శృంగారకావ్యగ్రంథమండలి ప్రబంధపరంపర — ౨.

# సత్యభామా సాంత్వనము.

లింగనమఖి శ్రీకామేశ్వర కవికృతము.

---

PUBLISHED BY
K. G. MURTHY.
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
1000 COPIES.

శృంగారకావ్యగ్రంథమండలి ప్రబంధపరంపర — ౨.

# సత్యాభామా సాంత్వనము.

లింగనమఖి శ్రీకామేశ్వర కవికృతము.

---

PUBLISHED BY
K. G. MURTHY.
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
1000 COPIES.

*

తంజావూరు వీర రాఘవాతుల పాలనలో, ఆంధ్రవాణి ఏలా వింత విలాసములతో చవులూరించి, కావ్య రసికులను హాయి నలవరచిందో- రాధికాసాంత్వనముతో- విశదమై ఉంటుంది.

సత్యభామాసాంత్వనము, మధురనాయకుల కీర్తిని చిరస్థాయిగా నిలిపే సప్తసంతానములలోనిది. కృతిపతి, తిరుమలనాయకుని మనుమడు అళఘురి, తిరుమలేంద్రుడు, క్షేత్రయ్యను సముఖానికి రప్పించుకొని బహు కాలము నిలుపుకొన్న సరసనాయకుడు. (కృతిపతిని మెప్పించడానికీ, క్షేత్రియమీది ఆదరణచేతా, శ్రీ కామేశ్వరకవి, పదభావములను అక్కడక్కడ సంతరించి వినియోగించుకున్నాడు) తాతను బోలిన మనుమడే అళఘురికూడాను, అన్నివిధములచేతా అని, శ్రీ కామేశ్వర కవి స్పష్టంగా చెపుతున్నాడుకదూ, గ్రంథారంభంలో. అళఘురి అన్న చొక్కనాథుడు కూడా శృంగార అనుభవాల విషయంలో వీరెవరికీ తీసిపోని వాడు అనిపించుకున్నాడు రాజ్యానికి వచ్చిన తరువాత. ఈతని మీద, శ్లోకైన చాటువులు శరభోజీ భాండారంలో ఉన్నవి.

శ్రీ కామేశ్వర కవిది విశేషించి ప్రౌఢమైన కవిత్వం. దానికి వన్నెగా, అచ్చతెలుగులూ, దేశ్యాలూ, సంస్కృతానికి తూకం తరిగి పోకుండా ఉండేటట్టు తలమున్కలుగా గ్రంథమంతటా విరజల్లేశాడు. అందుచేత వ్రాతప్రతులనిండా, విలేఖరుల దోషాన స్ఖాలిత్యాలు అనేకం పొడసూపోయినవి.

ముద్రణమునకు సాధుప్రతిని సిద్ధముచేయడానికి, పరిశోధనావసరాల్లో విశేషంగా శ్రమపడవలసి వచ్చినది. తెలుగునాటను లభ్యమవుతూన్నవానిలో, ఏ ప్రతినీ మూడవసారిగా విడువలేదు. శ్రీ కామేశ్వర కవి ఉత్తమరచనను, సహృదయులకు, అందించ గలిగినందున, మాకృషి ఫలించినది.

వ్యవస్థాపకుడు.

# భూమిక.

దక్షిణాంధ్రవాఙ్మయమున నెన్నికఁ గన్న రసవత్ప్రబంధములలో సత్యభామాసాంత్వన మొకటి. ఈ కృతి మధురాపురరాజ్యమున వెలసిన వానిలోఁ బ్రాచీనము. ప్రశస్తము. విజయనగరసామ్రాజ్యవిచ్ఛిన్నానంతరము తంజావూరు, మధుర, పుదుక్కోట, సేలము, కార్వేటినగరము మున్నగు రాజ్యములాంధ్రసాహిత్యసంపద కాస్పదము లైనవి. అందు మధురను క్రీ. శ. 1670 ప్రాంతములఁ బరిపాలన మొనర్చిన ముద్దళఘురి కంకితముగా నీ కృతిని రచియించినకవి.

—: లింగనమఖి శ్రీకామేశ్వరకవి :—

ఈతనిపేరు శ్రీకామేశ్వరకవి యని తెలియుచున్నను నీ వఱకు ముద్రించినవా రెల్ల రీతనిపేరు కామేశ్వరకవి యని ముద్రించినారు. కీర్తిశేషులు వీరేశలింగముపంతులవారి కవులచరిత్రము నందేమి, ప్రాచ్యలిఖితపుస్తకాగారవివరణము లందేమి, శృంగారగ్రంథమాలాముద్రణము నందేమి గ్రంథకర్త కామేశ్వరకవి యనియే యున్నది. ఈతఁడు తన గద్యమున 'శ్రీకరకవితాకరసుజనవిధేయ శ్రీకామేశ్వరనామధేయప్రణీతంబైన' అనియే వ్రాసికొని యున్నాడు. నేను బరిశోధించి చూచిన తాళపత్రగ్రంథముల నిట్లే యున్నది. ఇంతియకాక శ్రీకామేశ్వరకవి తన్నుఁ గూర్చి చెప్పుకొనుసందర్భమున.

"కం. కాకులవలె నిం టింటను
కాకవు లున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ! నీకె తగురా
యేకత నుడి పాలు నీరు నేర్పఱుపంగన్."

" కం. ఏభాష నైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదు సూక్తులవలనన్
నీభాగ్య మసదృశము గా
రీభవకరుణానివేశ! శ్రీకామేశా!"

ఇందుఁ దొలిపద్యమునఁ బ్రాసముకొఱకును రెండవపద్యమున యతికొఱకును 'శ్రీ' చేర్చినాఁ డనియందు రేని యాతని యీక్రింది పద్యమునుఁ దిలకింపుఁడు.

"చ. అనుపుగ రుక్మిణీపరిణయంబును మున్ హవణించి యార్య లౌ
ననఁ దనియించినావు మము నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించు మీ సొగసు పోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వన మనఁ గప్పురంపుచలువన్ గెలువన్ దిరుకామసత్కవీ!"

ఇచట శ్రీకామశబ్దమునకు తిరుకామ యని వాడినాఁడు. శ్రీశబ్దమునకు ద్రావిడమున 'తిరు' అనురూపము వచ్చును. తిరుమల, తిరువేంగడ, తిరుమంజన, తిర్వళిక మొద లగుపదము లిట్టివే. వైష్ణవసంప్రదాయమున 'తిరు' శబ్ద మాది యగుశబ్దములే మన కన్నియుఁ గానవచ్చుచుండును. ఇంతియేగాక శ్రీకామేశ్వరకవికృతము ధేనుమహాత్మ్య మను వచనకావ్యము తంజావూరుపుస్తకశాలలోఁ గలదు. అందుఁ గూడ.

" చ. వివిధకలాకలాపఖని వెంగనలింగమహేంద్రునాగ స
త్కవి తిరుకామ కోవిద శిఖామణి "

అని స్పష్టముగాఁ జెప్పికొని యున్నాఁడు. కావున నీతనిపేరు శ్రీకామేశ్వరకవి యగుట నిశ్చయము.

శ్రీకామేశ్వరకవి తొలుత శ్రీకాళహస్తినివాసుఁడై యా వెనుక మధురాపురమున రాజసమ్మానములఁ గాంచియచ్చటనే స్థిరపడిన వాఁడు. గద్య యందలి 'శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ, జ్ఞానప్రసూనాంబికాకృపావలంబవిజృంభమాణసారస్వతసుధాతరంగ' అనువాక్యమును 'దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలకుమా

కాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుళుచ్ఛసితచ్ఛత్రచామరకళాచికకన కాందోళికాదిరాజోపచార' అనువాక్యమును నీ విషయము తెల్లము సేయు చున్నది. కామాక్షమ్మ, నాగన యీతని తలిదండ్రులు. ఈతనివంశమున బహుమఖముల నాచరించిన లింగనమఖి ప్రసిద్ధుఁ డగుటచే నీతని యింటి పేరు లింగనమఖివా రైనది. ఈతఁడు సంస్కృతాంధ్రములయం దసమాన పండితుఁ డై, సరసకవితాసంపన్నుఁ డగుటయే గాక సంగీతమునఁ బ్రసిద్ధిఁ జెందినవాఁడు. గద్యయందలి 'వల్లకీవాదనధురీణ' యను విశేషణ మీతనివీణావాదనమును దెలుపు చున్నది. మఱి నీతఁడు గేయకృతులు పెక్కులు రచియించి నట్లు 'వర్ణగీతాదిగాంధర్వస్వరనవీనకల్పనాప్రవీణ' యనునది స్పష్టపఱచు చున్నది. ఈతని ప్రబంధకృతులలో నిపుడు సత్య భామాసాంత్వనముఁ దక్క తక్కినవి కానవచ్చుట లేదు. ఈతఁడు తొలుత రుక్మిణీపరిణయము రచియించిన ట్లీపఱి కుదాహరించిన పద్యము వలననే గాక

"తే. గీ. తనదు దక్షిణనాయక • త్వమున కుచిత
ముగను ముద్దళఘురిశౌరి • ముదముమీఱ
నపటిరుక్మిణీపరిణయం • బందు కతనఁ
దా నిపుడు సత్యభామసాం • త్వనముఁ గోరె."

అను పద్యమువలనఁ దెలియు చున్నది. ఇదియు ముద్దళఘురి కంకితముగా వెలసినది. ఈతనికృతి వే ఱొకటి ధేనుమాహాత్మ్య మను వచనకావ్యము గలదు. ఇది యముద్రితము. తంజావూరుపుస్తకాలయ వివరణమునఁ గల దీనివిషయముఁ గొంత తెలుపు చున్నాఁడను. ఇది సత్యభామాసాంత్వనకృతిపతి ముద్దళఘురి సవతియన్న యగు చొక్క నాథనాయనివారికిఁ గృతి.

"శా. శ్రీరామామణి వింతగా నురమునం • జెన్నొంది కొ ల్వుండ
తే రంగంబును కట్టుమట్టునసదా • దివ్యత్కృపాధారక్షి
రారాఢిం దగఁ గామధేనువు వలెన్ • రక్షించి లోకంబులో
శ్రీరంగేశుఁడు చొక్కనాథ... శౌ • రిన్ వేడుక న్బ్రోవుతన్."

అను పద్యముతోఁ బ్రారంభించి గ్రంథ మంతయు వచనకావ్యం బుగా రచియించినాఁడు. గ్రంథముకడపట—

“చ. వివిధకలాకలాపఖని • వెంగనలింగమహీంద్రునాగ స
త్కవి తిరుకామకోవిదశి•ఖామణి ధీరులు పాకవైరిలో
కవికచకల్పకస్తబక•గంధధురంధరసూక్తియుక్తి నౌ
నవు నని మెచ్చనావులమ•హాత్మ్య మొనర్చెను తేఁటమాటలన్.

అనుపద్యము గలదు.

ఇందు తేఁటమాటలతో గోమాహాత్మ్యము ధర్మరాజునకు భీష్ముఁడు చెప్పుట వర్ణింపఁబడినది. అశ్వాసాద్యంతవిభాగములేదు. ఇందలి వచనరచ నకు నీ క్రిందివక్తుల నుదాహరించెదను.

“సత్యలోకమున నివి యజ్ఞసంగతి నివసించు హోమమ్ముల నెల్లను వీనిపాలచే చమురు నుపయోగించు కొమ్ములు నెమ్ములు చర్మములు నున్ననితోఁక రోమములు పేడ పంచితమును నన్నింటికి నుపకరించు— గాలిని, చలిని, ఎండను వీనికి బడలిక లేదు. కావున నా యా సమ యమ్ముల తమకు నుచితమ్ములైనవను లివి సేయు. కావున నావును బ్రాహ్మణుండును నేకతత్త్వమ్మగుటం జేసి పరమపదంబు జెందు నందున గోబ్రాహ్మణులు సమానవస్తువు లని పెద్దలు పలుకరింతురు. అనృపా లమృతం బని యమతవిభుండు పలుకరించె.”

వచనరచన యధునాతనకాలమునఁ దక్క— యంతకుఁ బూర్వము లే దనువా రీగ్రంథమును జూడఁ దగుదురు. ఇది ముద్రణభాగ్య మందిన యాంధ్రవచన కావ్యవికాసముఁ గూర్చి కొంత తెలిసికొన నవకాశము గల్గును. ఈ మధురాపురమున క్రీ. శ. 1720 సంవత్సరప్రాంతమున వెలసిన సముఖము వేంకటకృష్ణప్పనాయకుని వచనభైమినిభారతము దీనికిఁ దరువాతిదియే.

శ్రీకామేశ్వరకవి ముద్దళఘరితాత యగు తిరుమలనాయకుని కాల మున నున్నవాఁ డగుటచేతను, తిరుమలనాయకుఁడు క్రీ. శ. 1623 మొదలు

1659 వఱకు మధురను బరిపాలించినవాఁ డగుటచేతను, క్రీ. శ. 1670 సంవత్సరప్రాంతమున ముద్దళఘరి సత్యభామాసాంత్వనముఁ గృతి నందుటచే నీతఁడు క్రీ. శ. 1670 ప్రాంతమువఱకు జీవించె నని చెప్ప నొప్పును. కవిని గూర్చి యింతకన్న మన కేమియుఁ దెలియ రా లేదు.

సత్యభామాసాంత్వనము నాలు గాశ్వాసముల శృంగారప్రబంధము. ఆంధ్రవాఙ్మయమున సాంత్వన మనుపేరుగల కావ్యములలో నిదియే తొలుతగాఁ గన్పట్టు చున్నది. దీనివెనుక సముఖము వేంకటకృష్ణప్ప నాయఁడు రాధికాసాంత్వనమును దాని ననుసరించి ముద్దుపళని రాధికా సాంత్వనమును వెలసినవి. ఇందు మొదటిది మధురాపురాంధ్రకృతి— రెండవది తంజాపురాంధ్రకృతి — ఈ గ్రంథమునకు మూలము భాగవత హరివంశముల యందుఁ బ్రస్తుత మైన నరకాసురవధఘట్టము— నరకాసుర వధానంతరము సత్యభామమానము నామె శ్రీకృష్ణుఁడు సాంత్వనము సేయుట నిందు ముఖ్య మగువిషయ మగుట కవి యీ గ్రంథమునకు సత్యాభామాసాంత్వన మనుపే రిడినాఁడు. శ్రీకృష్ణదేవరాయలవా రాముక్తమాల్యదయందు ' సత్యావధూప్రీణనము అను సంస్కృతకా వ్యము రచియించి నట్లు ' 'భావధ్వని వ్యంగసేవధి గాఁగఁ జెప్పితివి సత్యా వధూప్రీణనంబు'నను పద్యపాదము తెలుపు చున్నది. బహుశః సంస్కృత సత్యావధూప్రీణనము దీనికి మూలమేమో తెలియ రాదు.

ఇందుఁ దొలియాశ్వాస మంతయు నవతారిక యనియే చెప్ప నగును. శిష్టాచారప్రకార మిష్టదేవతానంతరము ముప్పదినాలుగు పుటలలో మధురనాయకుల వంశక్రమ మెంతయు విపులముగ వర్ణిత మైనది. ఇది చరిత్రకారుల కెంతయు నుపయుక్తము. ఆ వెనుక కథాప్రారంభమున ద్వారకాపురవర్ణనమును శ్రీకృష్ణుఁడు ద్వారక నేలు నని మాత్రమే తెలుపఁ బడినది. రెండవ యాశ్వాసమున నింద్రాగమనము నింద్రుఁడు నరకాసురుని వృత్తాంతముఁ జెప్పి శ్రీకృష్ణునిచే నరకాసురుని వధింతు నని ప్రతిజ్ఞ సేయించుటయు, వసంతోత్సవవర్ణనము, శ్రీకృష్ణసత్యాభామల విహారమును, యుద్ధయాత్రకు సత్యభామ బయలుదేరెద నన శ్రీకృష్ణుఁడు

నివారించుటయు, నరకాసురపుర మగు ప్రాగ్జ్యోతిషసమీపమున దండు విడియుటయు, ద్వారకలో సత్యభామావిరహమునుఁ జెప్పఁ బడినవి.

మూఁడవయాశ్వాసమున దండు విడుదల యందు శ్రీకృష్ణుని విరహావస్థయు, కలవింకుని హాస్యప్రసంగమును సత్యభామవద్ద నుండి చిలుకరాయభారమును కృష్ణుఁడు విరహమును సహింపఁ జాలక ప్రద్యుమ్న కుమారుని సత్యభామను దోడి తెచ్చుటకుఁ బంపి యామెను రప్పించుటయు వర్ణితము.

నాలుగవయాశ్వాసమున నరకాసురునిబంటు పూర్వజన్మవృత్తాంతముఁ జిలుక చెప్పుటయు, వానివలన నరకాసురునియుదంతము కృష్ణుఁ డెఱుంగుటయు, వర్షశరదృతువర్ణనములును, యుద్ధప్రారంభమును సత్యభామ యుద్ధకౌశలమును, నరకాసురసంహారమును, అదితి కుండలదానంబును, భగదత్తపట్టాభిషేకమును నరకుని చెఱయం దున్న పదాఱువేల చేడియల శ్రీకృష్ణుఁడు పెండ్లి యాడుటయు, సత్యభామప్రణయకోపమును శ్రీకృష్ణుఁ డామెసాంత్వనము సేయుటయు, ఫలశ్రుతితో ముగింపును గలవు.

ఇందు శృంగారరసము ప్రధాన మైనను నెడ నెడ వీర, రౌద్ర, హాస్యరసములు పోషింపఁ బడినవి. శృంగారలీలాప్రపంచనాటకసూత్రధారి శ్రీకృష్ణుఁడు నాయకుఁడు. శృంగారరససీమ సత్యభామ నాయికగా నున్న యీరసవత్కృతి యందుఁ దద్రసస్థాయి యగు రతివర్ణన ముత్కృష్టముగాఁ గావింపఁ బడినది. విరహావస్థయుఁ బూరుషాయితక్రియలు నతిమాత్రముఁగా వర్ణితము లైనవి. వీరరౌద్రరసములును నద్భుతరసమును, సత్యభామ యుద్ధవిహారఘట్టమునను, హాస్యము కలవింకుని వచోధోరణి యందునుఁ బొందుపడినవి. శ్రీకామేశ్వరకవి బహుభాషాసమర్థుఁడగుట కావ్యము రసనిష్యంద మై, రసికజనహృదయంగమ మై యలరునట్లు రచియించి కీర్తిఁ గాంచినాఁడు.

ఆ యా రసవర్ణనలకు నీ క్రిందిపద్యము లుదాహృతములు. శృంగారవీరరసమునకు:—

సీ. కంకణక్రేంక్రియల్ ♦ కటుచాపటంక్రియల్
చిఱునవ్వు మెఱయింపు ♦ జేవురింపు
కలవాగ్విరావముల్ ♦ కహాకహారావముల్
గొల్లన నగుముద్దు ♦ గొరకసద్దు
సరససల్లాపంబు ♦ సంగ్రామకోపంబు
వింతసొగసుఝాక ♦ వెగటుకేక
సొంపుమీఱినవైపు ♦ చుఱచుఱ మనుచూపు
బులుపులు తగునంగు ♦ పొగరుపొంగు

తే. గీ. సరసశృంగారవీరర ♦ సంబు లమరు
కొమరు తగి యుండ మెయిఁ జిఱు ♦ చెమట నిండఁ
బోరు గావించె రిపుసేన ♦ బో రవంగఁ
గల్లవగగొల్లదేవేరి ♦ కడఁక మీఱి.

రౌద్రశృంగారమునకు:_

సీ. సంవర్తకీలియై ♦ చంద్రికాపాళియై
కనుగెంపు నగుపెంపు ♦ గ్రక్కతిల్లఁ
బటుకాలదూతియై ♦ పంచాస్త్రహేతియై
చాపంబు రూపంబు ♦ సంఘటిల్ల
నశనిధుర్యధరమై ♦ యతిసుధావర్షమై
విడిసద్దు నుడిముద్దు ♦ విస్తరిల్ల
నుల్లాసనాభియై ♦ యురుమోహశోభియై
శరవృష్టి కచదృష్టి ♦ పరిఢవిల్ల

తే. గీ. దితిజదితిజాంతకులకు ను ♦ ద్వేగరాగ
సంగతులు పొంగ నంగనా ♦ జనమతల్లి
కినిసి యనిఁ జేసె ధీచమ ♦ త్కృతి వినిద్ర
రౌద్రశృంగారరసము లౌ ♦ రా యనంగ.

శృంగా రాద్భుతమునకు :—

సీ. వెన్నెలమూఁకయో ♦ విడిమెండకాఁకయో
యన నయ్యెఁ జంద్రాస్య ♦ మినుకుచూపు
మరుకీర్తి తెక్కయో ♦ నెఱతోఁకచుక్కయో
యన నయ్యెఁ బౌరవము ♦ త్యపుఁదూరాయి
పూఁదేనెసోనయో ♦ బోడిరాతివానయో
యన నయ్యెఁ మగువగా ♦ యకపుమాట
జంత్రవిశేషమో ♦ శతధారఘోషమో
యన నయ్యెఁ జెలివింటి ♦ గోనమునస్తు

తే. గీ. మొనయుశౌరికి వైరికి ♦ మోదఖేద
ములను శృంగారరసము న ♦ ద్భుతరసంబుఁ
దోఁచ నారానములు నేసి ♦ దుగము జేసెఁ
గుతుకకోపంబుల నెసంగి ♦ కోమలాంగి.

శ్రీకామేశ్వరకవి యుభయభాషల యందు వైదుష్యముగలవా
డయ్యును దన కవిత యందు జాతీయముల నుపయోగించి తెలుఁగుకవి
యనుపేరును సార్థకముఁ గావించికొనినాఁడు. కవితఁ గూర్చి

సీ. సరసత భువనంబు ♦ చల్లనై విలసిల్ల
సారస్వతిస్ఫూర్తి ♦ సంఘటిల్ల
వనమయూరాధిక ♦ వ్యాజ్ఞ్నపుణి పొసంగ
గయనటద్ధారాతి ♦ శయ మెసంగఁ
బటుతరోదితకదం ♦ బంబులు ననలొత్త
వెలుఁగుపకఁగనై న ♦ మెఱుఁగు హత్తు
సౌహృదకవిరాజ ♦ సంఘుంబు హర్షింపఁ
గూలంకషాభోగ ♦ లీల మించ

తే. గీ. నమృతవర్షము గురిసిన ♦ యట్లు ఘనత
వెలయఁ గాఁ గీర్తి కందళం ♦ బులు చెలంగఁ

ప్రకృతి యంతయుఁ దనియంగ ♦ వికృతి లేని
సుకృతి నొనరించు వాఁ డౌర ♦ సుకృతి జగతి.

అని గ్రంథమునఁ జెప్పినాఁడు. అట్లే కవిత సాగించినాఁడు.

గ్రంథమునఁ దెలుఁగుపలుకులను, నన్యభాషాపదములను, వాడుక మాటలనుఁ గూర్చి శ్రీకామేశ్వరకవి తనభాషానైపుణ్యమును వెల్లడించినాఁడు, దీర్ఘసమాసభూయిష్ఠము లగుపద్యము లున్నను నవి కవికిఁ గల గీర్వాణభాషాపాండిత్యమును విశదీకరించుచున్నవి. ఇందుఁ బెద్దన గారి 'సహసానఖంపచ' యి త్యాదిపద్యములకుఁ బ్రతిబింబము లనఁ దగినపద్యములు రెండు గలవు. వీనిఁ గవి సంస్కృతభాషాపాండిత్యము గలవాఁ డగుట సాధ్యమై సంతఃప్రౌఢముగా రచియించినాఁడు. ఇట్టి పద్యమల్లఁ బోయి తారాశశాంకమున వేంకటపతి తెల్లబోయినాఁడు. వర్ణనములఁ గూడ నీ కవి గతానుగతికముగఁ గాకఁ గ్రొత్తదారులఁ ద్రొక్కినాఁడు.

ద్వితీయాశ్వాసమున శయ్యాగృహవర్ణనము :—

సీ. పటికపుఁగీల్బొమ్మ ♦ చిటికరయొద్దికఁ జల్క
గుటికలఁదల్లకీ ♦ గొనుచు నినుచు
సురటిరెక్కలగాలి ♦ సోఁకులనేమొస
గొడిగెడు సకినల ♦ గుంపు నింపు
సద్దుసన్నన నార ♦ జంపు మంపులనింపు
జగజంపుజంత్రంపు ♦ జతలకూకి
కవలకున్నుకపూత్తు ♦ కవకవకివకివ
రవలతో మరుచివ్వ ♦ బదిరి డీర్చ

తే. గీ. నవులపుంజెందుచందువా ♦ తొవలపొంగు
తుమ్మెదయెలుంగుశ్రుతి గ్రమ్మ ♦ కమ్మపైఁడి
ఛక్కఘుమకారముల మేలి ♦ ముసుక లీను
హరువు మరుపై నశయ్యాగృ ♦ హమ్ములోన.

తృతీయాశ్వాసమున గుడారువర్ణనము :—

సీ. జాతిపచ్చలజోతి ♦ లాతిగాఁ జూచుచు
జ్ఞాతిపసరువన్నె ♦ రీతి సరిగె
కుట్టునాతిపతిమె ♦ గుజ్జరాతివిఖ్యాతి
సకళాతిబిళ్లపొం ♦ దికసరాతి
యేకరంగిహోరంగు ♦ టెంగిలీకపురంగు
లెనయుపగ్గపునిగ్గు ♦ లోనర లగ్గు
నుగ్గడితపునిల్వు ♦ మగ్గపురుతకల్వు
పతిమలకట్టుచా ♦ పలను బెట్టు

తే. గీ. చుట్టుఁ గనుపట్టు రతనాల ♦ కుట్టుపనుల
టేకుకంబాలు తగడంపు ♦ మేకు లుదిరి
కలశముల పక్కడోరడాలు ♦ కలికితావి
మీఱి హొమ్మైన కుతినీగు ♦ డారులోన.

చతుర్థాశ్వాసమున జాబిల్లివర్ణనము :—

సీ. కలువతలసంగాతి ♦ చెలువులమజ్జాతి
యివముపుట్టువిఖ్యాతి ♦ యింపుజోతి
తొలిజోగిముడిపూవు ♦ బలుజక్కవలగావు
నెలరేవలపుప్రోవు ♦ నింగితావు
ఒజ్జనెచ్చెలిమేలు ♦ యెఱుపువెన్నెలచాలు
కడలితాయలచూలు ♦ కళలప్రోలు
మరునివజ్రపుతాళి ♦ మలయురిక్కలబాళి
మొదయుజోడువిరాళి ♦ యిరులజాలి

తే. గీ. చదుకుడాల్ జంట తపసిరా ♦ చూపుపంట
సోగయుపురేవ కనుచాటు ♦ చోటియావ
తామరలబంది కలిమేను ♦ రామబంది
లేటఁ బాటిల్ల జాబిల్లి ♦ లేజరిల్లి.

ము న్నగునవి జాతీయపదములతో నెంతయు జానుమీఱు చున్నవి. శ్రీకామేశ్వరకవి రసాభినివిష్టుఁ డగుటచే వ్యావహారికపదముల నెన్నింటినో బాహాటముగా నుపయోగించినాఁడు. ఈ వ్యావహారికపదప్రయోగము నా యా పట్టుల కవిత కెంత యేనిసొబగుఁ గూర్చినది. రసస్ఫోరక మైనది. అత్యంతమృదులమును నాపాతమధురము నగు శ్రీకామేశ్వర కవి కవితారసమును నాంధ్రులు తనివి దీరఁ గ్రోలుదురు గాత!

నిడుదవోలు వేంకటరావు,

శ్రీరస్తు.



# సత్యభామాసాంత్వనము.



## ప్రథమాశ్వాసము.



శ్రీమహీకన్య యాత్మకర
చిన్మయముద్రికఁ జూచెదేమి నా
నీ మొనగుబ్బ తే సలము
నీటిది మానఁగలే నటంచుఁ దా
నామెయిఁ దెచ్చి కల్మి విన
తాఁ కొనసంగుదు నంటఁ దెల్పు శ్రీ
రాముడు ముద్దులక్ష్మిరిధ
రారమణుం గరుణించుఁగావుతన్.

మ. తనపాణీశేశ్వరునంకపీఠమున ను♦ద్యల్లీలఁ గొల్వుండి భ
క్తనికాయమ్మున కే నుదారయశముల్ ♦ గల్గింతు నన్నట్లు దా
హనుమంతుం దయఁ గూర్చి హారక్తికమణీ♦హారంబు పాలించు నా
జనకక్ష్మాపతికన్య ముద్దరఘురీ♦క్ష్మాపాలునిం బ్రోవుతన్.

మ. ఎలమిం దాఁ జనుదోయిఁ జేరుకొనఁగా ♦ నీమద్దళఝ్ఝాటకై
వలినీపూర మటంచు హారములఁ బో♦వం ద్రోయు రుద్రాణిగు
బ్బలు కేలం గబళించి యీర్ష్య చన సం♦భావించి సంతుష్టుఁడౌ
చలిగట్టల్లుఁ డొసంగు ముద్దళఘురి♦తూష్మాజాని కైశ్వర్యముల్.

మ. తొగరాకందు కపోలమందు రతిఁ దో♦డ్తోఁ జేర నీశానుగో
రు గదా యంచును దత్కపోలమున గో♦రు ల్వ్రీడుకున్ వీడుగా
ద్విగుణం బౌతమి గోరుగె ల్పొదవు తీ♦విన్ మించు శ్రీగౌరి పో
ల్పుగ ముద్దళ్ఘురిభూపచంద్రునికి గె♦ల్పు ల్గూర్చి మన్నించుతన్.

చ. తనదుహిరణ్యగర్భత స♦దా జగతిన్ మెఱయించు కైవడిన్
దనరుసువర్ణలీల వద♦నంబున డంబులు గుల్కఁ బల్కుమం
తనమున వాణి రాణి గను♦దక్కఁ బెనంగువిభుండు నిండుసొం
పున మన ముద్దుళఘురివి♦భుం గరుణించి చిరాయు[1]వీయువుతన్.

చ. పలుదొలుపల్కుపాళిఁ దగు♦బంగరుమేడను నాల్గువాకిళుల్
నిలిపినయట్లు లుండువిభు♦నిద్దపుమోములఁ బచ్చవిల్తు కీ
ర్తులబలె నాల్గురూపులను ♦ [2]బ్రోవయి కొల్వొనరించువాణి ము
ద్దళఘురిశౌరి కీవుత ద♦యన్ రసగుంభితవాగ్విజృంభణల్.

చ. ఒసపరి ముద్దుగుమ్మ తొడ♦నుండఁగఁ దత్పురుషాయితంబునన్
ముసురుకొను న్మెఱుంగుచను♦ముత్యపు సోనలమాడ్కిఁ జూడ్కి. కిం
పెసఁగెడియందపున్వమఘు♦బృందము చల్లుచు నుల్లసిల్లుమా
నిసిమదహాత్రి వీఁకదొర ♦ నింపుదయం గృతికర్తఁ బ్రోవుతన్.

సీ. ముక్తలక్ష్మీకుచం♦బు గ్రహించురీతి నే
బాలుఁడర్కునిఁ బట్టి ♦ ప్రాఁగిఁ గాంచెఁ
దన కలంఘ్యం బేది ♦ యను భాతి నేమహా
బలశాలి పచరించి ♦ వనధి దాఁటె
విభునిప్రతాపంబు ♦ వెలయించుదారి నే
వీరుఁ డగ్గికి లంక ♦ విందుఁ జేసె

పాఠాంతరము. 1. ఖీవుతన్. పా. 2. ప్రోవయి.

[1]సువిదరాగము చేతి ♦ కొనఁగిన[2]మాట్కి నే
ఘనుఁ డేలికను మణి ♦ కాస్క చేసె
తే. గీ. నతని ధృతిమంతు మతిమంతు ♦ నధికశాంతు
సమరదుర్దాంతవృత్తాంతు ♦ సారశౌర్య
వంతు ముద్ధళ్లరిక్షమా♦కాంతుఁ బోఁడివ
నెంతు నుతియింతు హనుమంతు ♦ నెలమిఁ గాంతు.

చ. పొలుపుగఁ బుట్టతేనెలు గు♦బుల్కొనుపల్కుల రామకీర్తనల్
సలిపినసత్కవి న్మధుర♦సామఘరోక్తుల ధర్మపుత్రుని
ర్మలచరితంబు పాణిబద♦రస్థితిగా నొనరించుసత్కవిం
దలఁచెద గౌరిపేడియపు ♦ తావులకీపులఁ బల్కుసత్కవిన్.

మ. మును గర్వంబున నాంధ్రభారతమహాం♦భోరాశి నన్నయ్య ల్కవుల్
మునుఁగం దామస ముద్ధరించువగ నిం♦పుల్ నింపుసందర్భముల్
దనరంగా నొకరెండుతేపల ప్రబం♦ధశ్రేణి నిర్మించు న
న్నన నెఱ్ఱార్యునిఁ దిక్కనాధ్వరిని హృ♦ద్యస్ఫూర్తిఁ గీర్తించెదన్.

శా. సంఖ్యాతీతవిధావనీరితసుధా♦సాధారణస్వాదుతా
సంఖ్యాపాదిచమత్క్రియోర్మిళవచ♦స్సందర్భణాష్టాదికిన్
సంఖ్యావత్త్వము చెల్లుఁగాక దొర గా♦సం బియ్యఁ దద్వేదనా
సంఖ్యాపూరకు లైనవారలకుఁ ద♦త్సామర్థ్యముల్ చెల్లునే?

చ. తెనుఁ గని సంస్కృతం బని మ♦ది న్వివరింపక నీచవాక్యపుం
దునియల నోటికుండలను ♦ దొంతి యిడున్వగ డబ్బికబ్బముల్
పెనఁచి నరాధముల్ భ్రమయఁ♦ బేరొని ముష్కరు లైనదుష్కవుల్
ఘను లగుసత్కవీశ్వరుల ♦ కైవడి రాజులపూజ కర్హులే?

మహాస్రగ్ధర

సదసచ్ఛబ్దావబోధుల్ ♦ సరసవిరచనా ♦ సాధుమేధాసనాథుల్
విదళద్దుర్యుక్తియూథుల్ ♦ వివిధకృతిమహా ♦ పీఠకానిర్ణిరోధుల్

పా. 1. సువిదరత్నము. 2. భంతి.

సదయుల్ సాధుల్ విబాధుల్ సభలను సుకవుల్ సత్కృతుల్ సేయుచోఁ గ
త్పదవిద్యత్కోటికూట స్ఫుటిత కటుపద్యంబు హృద్యంబునౌనే ?

సీ. ప్రౌఢులతోఁ బాము పగిదిని పగ చాటి
తెలియకుండను తేలు వలెను మీటి
వెస ముక్కు దూసిన పసరంబువలెఁ దుళ్లి
బంతికిరియను బెట్టు పడుచు మళ్లి
కాకికై వడి నింపు గానికూఁతలు వెట్టి
మేఁకవలెను గన్ను మెక్కఁ బట్టి
మాట దోఁచక కొంగ మాడ్కి ధ్యానము చేసి
యడవిమెకముదారి నానరాసి

తే. గీ. తికమకలు చెంది మది వకావకలు పొంది
వికలతను మూఁగయల్లిక వెగటు గాఁగ
త్రాఁగతనమునఁ గపి నంచు రాయిడించు
కుకవినుడిగుంపులు మనుఁగాఁగ గోటిదయ్యంపు.

కం. హృదయంబె పలక బలపము
చదు రగుమదియఖలుకు దీర్చ సామాజికుఁ డా
కొదమనెలతాల్పు సైసగ
విదితం బగు సుకవికవిత విద్వత్సభలన్.

చ. సకలము చల్లనౌ టెఱిఁగి జక్కవపిట్టలు దుక్కి కై వడిం
గుకవు లసూయచేఁ గుమిలి ఘూర్ణిలిరేని ప్రసన్న భావ రా
సుకవులు మామకీనమృదుసూక్తికిఁ జెందొవవిందునిండుచం
దిక నగుపండువెన్నెలల తేటకుఁ జొక్కి చకోరముల్వలెన్.

మ. కినియున్వా రనుచీకటున్ విరియ వాగ్దేవీముఖేందూదయం
బున నుప్పొంగెడినాదుచిత్తకలశాంభోరాశిపైఁ దేరుపా
లను నున్నోల్లువతేటపల్కులటు చాలఁ బొల్చురత్నంబు లు
ర్విని శృంగారకృతుల్ మహీపతులు కూర్మిన్వానిఁ జేకోరొకో!

సీ. సరసత భువనంబు ♦ చల్లనై విలసిల్ల
సారస్వతస్ఫూర్తి ♦ సంఘటిల్ల
వనమయూరాధిక♦వాక్షైన్యపుణి పొసంగ
రయనటద్ధారాతి♦శయ మెసంగఁ
బటుతరోదితకదం♦బంబులు ననలొత్త
వెలుఁగుపడఁగనైన♦మెఱుఁగు హత్త
సౌహృదకవిరాజ♦సంఘంబు హర్షింపఁ
గూలంకషాభోగ♦లీల మించ
తే. గీ. సన్నృతవర్షంబు గురిసిన♦యట్లు ఘనత
నెలయఁగా: గీర్తి కందళ♦ములు చెలంగఁ
బ్రకృతి యంతయుఁ దనియంగ ♦ వికృతి లేని
సుకృతి నొనరించువాఁ డౌర ♦ సుకృతి జగతి.

వ. అని యిష్టదేవతానందనంబును సుకవిజనాభినందనంబును గుకవినిందనంబునుం గావించి నే సభంగురశృంగారరసతరంగిత వచనరచనానుబంధం బగు నొక్క-ప్రబంధంబు నిర్మించ నెంచి యున్న సమయంబున:

కం. లక్షణలక్షితకమలా
వీక్షణపుంఖానుపుంఖ♦విభవోన్మేషా
నుక్షణతతివిశ్రుతి వై
దక్షిణ్యనగరంబు ♦ తనరు ధరిత్రిన్.

శా. ఆక్షోట ద్విధుకాంతసంతతి సము♦ద్యద్వృక్షసాలాంతరా
భాషిరూప్యతవిడూరజాతమయకు♦డ్యప్రాంగణాధ్యాతత
న్ముద్మావజ్రోపలవేదికాగ్రరుచిమ♦చ్ఛకాశిక్యవేశ్మాంశుగే
ఖావల్లదృవిజాతరంగమణిరం♦గత్తుంగ సౌధంబునన్.

మ. జన్మలం జల్లనిచూపులం దనుపుచున్ ♦ శంపాలతాంగుల్ నయం
బున వేవేల్ తనచెంతఁ జేరి యుడిగం♦బుల్ సేయ నంతంతకున్
ఘనతన్ దిక్కులరాజు లెల్లఁ బొగడం ♦ గర్ణాటరాజ్యేందిరం
గనుసన్నన్ వరియించె ముద్దళఘురి♦క్ష్మాజాని రంజిల్లుచున్.

ఉ. అంతిపురంబునం దగుసహా♦స్రనిజాకృతిభావచిత్రలీ
లాంతరకై తవంబున మృ♦గాక్షుల కందఱ కన్నిరూపులై
యెంతయు ముద్దులగ్గరిన♦రేశ్వరుఁడేలుఁ బదాఱువేలసీ
మంతినుల న్నిరంతరము ♦ మన్నన సేయు మురారికై వడిన్.

కం. ఈలీల ముద్దుగుమ్మల
నేలుచు మదిఁ దమి చెలంగ ♦ శృంగారాబ్ధిం
దేలుచు మహిషీజనముల
లాలింపుచు స్మరకళావి♦లాసము మెఱయన్.

సీ. ననుపుగా నొకవేళఁ ♦ గనకాంగి యొకర్తె
శుభలీలఁ బదముల ♦ నభినయింప
పనుపుగా నొకవేళ ♦ ననఁబోఁడి యొకర్తె
వీణానినాదంబు ♦ వినికిసేయ
తనుపుగా నొకవేళఁ ♦ దరళేక్షణ యొకర్తు
పంతుమార్గపుపాట♦వింత చూప
నినుపుగా నొకవేళ ♦ నీలవేణి యొకర్తు
హితవైనశృంగార♦కృతులు చదువఁ

తే. గీ. బనుపుగా నొక్కపంకజ♦పత్రనేత్రి
మదపతులరాయబారంపు♦మాట లాడ
జనులు కలియుగగోపాలుఁ ♦ డనఁగ వెలసె
సరసగుణహారి ముద్దుల♦గ్గరిమురారి.

సీ. ఏవేళ నడిగిన ♦ హేమరాశిముగ నిచ్చు
నేపాటికవి నైన ♦ నెలమి మెచ్చు
గుణ మింత గలిగిన ♦ గణుతించి జను నేలుఁ
దప్పు లన్నియుఁ దాల్చి ♦ తలఁచు మేలు
న్యాయంబుఁ గూర్చుచో ♦ న్యాయంబు పచరించు
నాశ్రితావళిఁ జాల ♦ నాదరించు

పా. 1. పత్రనయన.

విరసించునెట్టిభూ♦వరు నైన ననిఁ జెండు
సాధుగోష్ఠిని బ్రౌఢు ♦ జరపుచుండు
తే. గీ. నిలను గావునఁ జక్రివ♦ర్తులును రాజు
లార్గురు పదార్గురును గాని ♦ యన్యు లెనయె
యనఁగ సుగుణసమష్టిచే ♦ నతిశయిల్లు
సరసులభుంఘు ముద్దుల ♦ కృష్ణవిభుండు.

సీ. తనదానజలలీల ♦ తటవతీతతిమహాం
బుధులకు నెడ లేని♦పొందు గాఁగ
తనరమ్యతరయశో♦ధవళిమ యామినీ
వరునిబింబమునకు ♦ మెఱుఁగు గాఁగ
తనతేజ మిలఁ జుట్టు♦కొనుగట్టు పెన్నెఱుల్
మొగ్గరంబుల విచ్చు♦మొగ్గ గాఁగ
తనప్రీతిభారాఢ్యి ♦ వనజసంభవశేష
వాల్మీకులకు మేలు♦బంతి గాఁగ
తే. గీ. తనమనోవర్తనము నెన్న ♦ ధరణికన్య
కామణీదాశరథిపాద♦కమలబంభ్ర
మద్భ్రమరలీల నలువొంద ♦ మహిని వెలసె
నరిజనవిదారి ముద్దుల♦కృష్ణరిమురారి.

వ. వెండియు నఖండపాండిత్యమండితఖండపరశుకుండలకుండలి కులాఖండలదిఙ్మండల వేదండపాండురకీటికమతవిభుశుభాపాదనప్రచండబల సముద్దండదోర్దండ కందుకితతాండవఝుఝురమాకుచకరండ హిండమానవవ నవప్రవాళమణికాండసమరపరమండలాధిప తిమిరఖండనశౌండమహోచ్చండ చండకిరణమండలుండును, పరమర్దనగతమార్దవవహ్నదయ దుర్దమ మదకర్దమ సమ్మర్ద విస్ఫురసమరహర్దవినర్దమాన విరోధిశిరోధికా నిగళనదుర్దాంత సార్థకవఫణోపమ పరుషతరకరఘురట్టఘట్టన త్రుట్యమానధరణి చత్వర తదాత్వవిస్రుత్వర చక్రికులశక్రిఫణాక్రాంత నిర్వక్రిమణిచూర్ణ తాసవర్ణతా లబ్ధవర్ణ సామంత మహీకాంతగళ పరిగళదనర్గళశోణితద్రోణికానిపానసావ

దోత్కర్ష వేల్లితపల్లవాధరా కలిత కనక వల్లకీవాదనుండును, మావిరి మాణవీరాయమర్మభేదనుండును, కోపప్రసాదచటులకుటిలాలోకననటిత కుశేశయవితానసంరంభ కుంభస్తనీమోహనకుసుమసాయకుండును, కుంతూరి దుర్గనాయకుండును, తత్తాదృశ శృంగారకృతిచమత్కృతితరంగిత సుకవిహృదయకంజరంజనాను[1]క్షణవీక్షిత కటాక్షుండును, దక్షిణ సింహాసనాధ్యక్షుండును, తిరుమలనృపాల కలశాంభోధి పూర్ణిమాశశాంకుండును, ధరణీవరాహాంకుండును, కల్యాణ పరంపరోదారకుమార ముద్దుసీరనృప కల్పతరు తపః ఫలంబును, కమనీయగుణతరంగ లింగాంబికాగర్భశుక్తి ముక్తాఫలంబును, మోహనతరవిలాసబాలికాజనలీలాలోలుండును నగు ముద్దళఘురిభూపాలుండు. నీరజబాంధవుం డుదయింప నొక్కనాఁడు నిత్య కృత్యంబులు నిర్వర్తించి బలువగు మానికపుఁ దొడవులుదొడిగి చెలువు మీఱఁ గొల్వుసింగారంబు చేసికొని యనితర సాధారణరీతిం గ్రిందుకొన మందమందగతుల సౌధంబు డిగ్గి తనడగ్గఱం గ్రిక్కిఱిసి యిరుపక్క యలం డెక్కులంబిక్కటిల్లు చక్కెరవిల్తుచిక్కటూల్లవలె నెక్కువ పొగరుమేని టెక్కు లెక్కువ తక్కువ లేని చక్కని వయసునిక్కువగ జక్కవగుబ్బ లాండ్లు కర్పూరకస్తూరికా సంకుమద కుంకుమపంక కమల కర్పూరఫుల్ల మల్లికాసముల్లసిత సౌరభంబులు గమ్మనంగ్రమ్ముకొని కనకముకురకరండ కళాచికా కనకాలుకా కౌశేయకోపశోభితకరారవిందలై వెంబడింపఁ గొన్ని యంతస్థులు దాఁటి [2]యట చన నంగనల నందఱు మగుడం గనుం గొని తదనంతరంబునఁ జెంతఁ జేరి కొందఱుమున్నీలు మునుమున్నుగా నూడిగంబులు ఘటియింప నెన లేని రాజసంబు నటింప నిగనిగ నిగుడు తొగరాజుగతి సొగసుడంబు లంబుజరిపు వృషదున్మేషనితంబాడంబరంబు విడంబింప నింపునింపుపార్రఁగెంపుగుంపు చెక్కడంపువగం దురంగలించు కట్టాణిముత్తియపుగట్టి చప్పరపు ముంగిటిరంగు లర్యమమణి పర్యంత గిరిదర్యంతధరానటితకునటికాపటలోత్కట శోణిమగరిమ రాణింప గరగరిక దొరయు కట్టుడాలు జాలుకొను నీలంపుకంబంబులం గ్రిందుకొనుచెందొవ జిగిపొగరునిగుడఁ బగడపుబోదెల గుమింబాదుకొను నునుపుతత్త్రప్రదేశ

పా. 1. క్షణపక్షసీతకటాక్షుండును. పా. 2. యచట.

నిర్యాఢవిటపి విటపాశ్లాకమాన బాల వల్లివాళజాలలీలం దెలుప వేడుకల నీనుపై డూర్యంపుపొడి జిగిబెడగగు నిడుదపొడి పనినడరుకోడిగ తుదిమొద లుకడాని గంటలపలుకునిగుడ నికటతట మృగయావిధానసావధాన కిరాత వరారోహాకరాకృష్ట ధనుష్టంకారంబుల యలంకారంబునెరప, నారాడ నెనంగు నింగిలీకపు గచ్చు హెచ్చుగోడల నీడలరంగు మీాఱు నేకరంగిపట్టు మేల్కట్టుబిగిలింత నిరంతర విహరమాణైరావణ కరవిఘాత కటకతట భాసమాన కాసార సారస పరాగభరంబులు తిరంబు గొలుపఁ గడుపులు గొని యుదుటవన్నెల ముంగిటనుండు వేదండమండలంబు లున్నతశృంగ రంగత్తరంగితసంచార నీరదబృందంబుల యందంబుజూప నొయ్యనొయ్యన మవ్వంపు లాగడంపు సోరణగండ్లగొండ్లి సలుపు జాళువావాకిలుబొమ్మల యొఱపు కుసుమశరసాంపరాయ సంపద్యమాన చాతుర్యధుర్యకిన్నర దంపతీ విలాసంబులు మెఱయింప నుదయధరాధరంబు విధంబున నంబుమీాఱ మెఱయు నమరావతి గతి నాకలిత సుమనస్సంతానసురభిళంబు, రామవన ప్రస్థానంబుగతి చిత్రకూట స్థిత్యభిరామంబును, చంద్రమండలంబు బాగున సుధాధవళితంబును, రావణ సైన్యంబు వడువున నతికాయసమా నాశ్రయంబును, సుగ్రీవ సమ్ముఖంబుడంబున నవాగిస సంచార మారుత కిశోర నీలగవాక్షకుముదాభిరామంబును, సుధర్మాస్థానంబు చందంబున రంభావిరాజమానంబును, శుక్రసదనంబు[1]వలె నగురువాసనావాసితంబును, నగుకొలువు కూటంబున బాలసూర్యునింబలెఁ జేరి గనకపు మేలు గోరు ధరణీసురుల మంగళాశీర్వాదంబులును, తనకుఁ బరాకుదెలిపి బరాబరి సేయ సంభ్రమించు కంచుకి వ్యూహంబుల సాహోనినాదంబులును, తన ముఖసందర్శనంబునకు సందడించు సామంత ధరణీకాంతుల మిథస్సంఘృష్ట మణిమకుట విటంక టంకారంబులును, తనగెలుపుపద్యంబు లుగ్గడించు వందిబృందంబుల విజయహుంకారంబులును, తన చరణారవింద వందనము లకు ముందుముందుగా సాగలి దండంబిడు [2]గిరుపులున్న చెండి మున్న కొమాళ్ళ కలకలంబులును, తన నవ్వుపువ్వుసోనలకు మవ్వంబు నివ్వటిల్లఁ గొలువు మ్రొక్కులు ఘటించు వారవనితల కిలకిలల యలబలంబును, తన

పా. 1. వగను. పా. 2. గిరువులును.

సమ్ముఖమ్ముఁ జేరఁ గ్రమ్మ కలభమ్ములకాంచన ఘంటికాఘణఘణమ్ములును, తనయెదుట వేషధారులై వచ్చు శైలూషుల వినర్దమాన మర్దలతాళసముత్తాల ధణంధణంబులును గ్రందుకొన నందు.

మ. హితులున్ రాజు లమాత్యు లాడిగములుం ♦ హేజీబు లార్యుల్ పురో
హితులున్ జ్యౌతిషికుల్ నటుల్ భటులు సా♦హిత్యప్రవీణుల్ కవుల్
మతిమంతుల్ జయకాళ్లు పాఠకజనుల్ ♦ మాష్టీలు వజీరులు న్యా
ర్జితభక్తిం గొలువన్ మహావిభవముల్ ♦ చెల్వొంద నందంబుగాన్.

సీ. నునుసరిగెనకసీ♦పని సూరెపుటపు మి
న్నలు గ్రమ్మసమగ్గి♦గలను జిమ్మ
చే నున్న నున్నని ♦ చికిలిపైఁడి మొలామ
చికటారి నుడిగమ్ము ♦ చేతి కొసఁగ
మోరీలఁ జిత్తరుపటం♦బుసఁ గొల్చు శ్రీరాము
చరణాబ్జములకు నం♦జలి ఘటించి
బాలీసుబటువులు ♦ పక్కదిళ్లను మేలు
కట్టుపూజల్లులఁ ♦ గలయఁ జూచి
తే. గీ. స్తోమముగ పైఁడిపావడల్ ♦ చామరమ్ము
లాడ జిగివింపు రతనంపు ♦ టరిదికట్టు
గద్దెపై నంత ముద్దుల♦ఖ్సరి విభుండు
నిండుకొలువుండెఁ గన్నుల♦పండు వమర.

శా. ఆరీతిన్ సభ ముద్దులఖ్సరిధరా♦ధ్యక్షుండు కొల్వుండి తా
హేరాళంబుగ నయ్యెడన్ నచుచు సా♦హిత్యప్రసంగంబు గం
భీరప్రౌఢిమ మించ నన్ బిలిచి నె♦మ్మిం బల్కె వీణాకన
ద్వారీపాణి సువర్ణ కంకణరుఘణ♦త్కారానుబంధోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణ♦యంబును మున్ హవణించియార్యు లౌ
నన దనియించినావు మము ♦ నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించుమీ సొగసు ♦ పోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వన మనఁ గప్పురంపుచలు♦వన్ గెలువన్ దిరుకామసత్కవీ.

కం. కాకులవలె నింటింటను
కాకవు లున్నారు హంస♦కై వడి భువిలో
శ్రీకామ నీకె తగురా!
యేకడ నుడి పాలు నీరు ♦ నేర్పుఱుపంగన్.

కం. ఏభాష నైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదు♦సూక్తులవలనన్
నీభాగ్య మసదృశము గా
రీభవకరుణానివేశ ♦ శ్రీకామేశా.

వ. అనిన విని తదాజ్ఞానుమతి నే నంగీకరించిన నతండు సభవా మానంబుగాఁ గర్పూరతాంబూల కనక చేల కమనీయ రత్నాభరణస్తోమ గ్రామప్రదానంబుల నానందంబు జెందంబునఁ గ్రందుకొన నొసరించిన:

తే. గీ. తనదు దక్షిణ నాయక♦త్వమున నుచిత
ముగను ముద్దళఘురిశౌరి ♦ ముదము మీఱ
నాటి రుక్మిణీపరిణయం ♦ బందుకతనఁ
దా నిపుడు సత్యభామసాం♦త్వనముఁ గోరె.

కం. అదితికిబలె శ్రుతిభూషణ
మొదవింతు బుధాళి కనుచు ♦ నొగి శ్రీపతి నె
మ్మది ముద్దళఘురి యనఁ దగి
సదయత మఱి సత్యభామ♦సాంత్వన మెంచన్.

వ. అనుచు ననుచువేడుక నతని యింగితం బెఱింగి సంగరాంగణా భంగుర నిజ విజయరమా సౌమాంగల్యసంధాయకు, నపారకృపారస పోషిత కవిగాయకు, నాశ్రిత జనాభిమతార్థదాయకు, ముగ్ధవధూకుసుమ సాయకు, ముద్దళఘురిభూనాయకుఁ, గృతినాయకుం జేసి నే నేర్చినవగ నచె దీర్చి తేర్చినవన్నిటిసాటి తేటమాటలుచేర్చి కవితనాయికా సాంత్వన పర గోపాలకానల్పకల్పమంజరీసంజరీజృంభమాణసౌరభమ్ముఖమ్మున దినవిగమ సమయ [1]...నిన[2]...వీషుజలపటలలోలుత[3]...ద్వీధ్వాంకుర పరిగళదమృత

...1, 2, 3. గ్రంథపాతములు.

బిందుబృందంబునందంబునఁ గంజభవహృదయ రంజన పురుషాయిత పరవశ సరస్వతీ కుచహస్త విస్రస్తనిస్తుల జాతిసుమరీతి శృంగారరసతరంగితాంతరంగ కనదనంగ కర్ణరసాయన రతికృత రతికూజితంబు నోజ నే రచియించు సత్యభామాసాంత్వనం బనుకృతి నతి చమత్కృతిం బెరయ సరసవచో మాల్యంబు సాఫల్యంబు నందఁ జిందు మకరందపూరం బగుతదీయ వంశావతారం బభివర్ణించెద.

సీ. వనజసంభవముఖ♦వద్భవామరకోటి
కోటీరమణులతోఁ ♦ బోటి మీఱి
జహ్నుకన్యామణీ ♦ సలిలనిర్ఝరజాత
జాతరూపాంభోజ ♦ సమితిఁ గేరి
నీలాభిధానవ ♦ ద్బాలామణీహారి
హారిద్రవరదీప్తి ♦ యనఁగఁ జెలఁగి
బ్రహ్మర్షిపూజన ♦ పరిమళపారమ్య
రమ్యసౌగంధిక ♦ ప్రభలఁ జేరి

తే. గీ. రహిఁ జెలఁగుసారరుచి పూర♦రత్నహార
సహితవక్షోజ కాఠిన్య♦సమానగణ్య
నవనవారుణ్యనటి తాబ్ధి♦నంధనార
సారసంబు ముకుందాంఘ్రి ♦ సారసంబు.

తే. గీ. దాన నొకజాతి జనియించి ♦ తనర నాత్మ
వాసనలు ఘుమ్ముమన శుద్ధ♦భావ మమర
నందుఁ దాఁ జెంది యుదయంబు ♦ నందె జగతి
ధీప్రభోగప్రభుండు నా♦గ ప్రభుండు.

కం. ఆనాగవిభుఁడు గంగా
స్నానము గావించి విశ్వ♦నాథునికృప మెం
తేని తగ విశ్వనాథ
క్ష్మానాథునిఁ గాంచె వేదు♦కలు నలు వొందన్.

ఉ. నాగవిభుండు పాదభజ♦నంబుననే కడు ధన్యుఁ డంచునో
బాగుగ విశ్వనాథుఁడు కృ♦పాపరిపూర్ణ ఫలం బొసంగె నౌ
రా గణియించుచుండె నుద♦రంబునఁ దోఁచెను తోఁచి క్రమ్మరన్
దాఁ గటకస్థితిం దనరె♦ధాత్రి శివోన్నతి చిత్ర మెన్నఁగన్.

కం. ఆవిశ్వనాథుఁ డార్యో
ద్భావిత చారిత్రుఁ డగుచు ♦ ధనదసుహృత్త్రా
సేవధియై హితసుధియై
జైవాతృకమౌళి యనఁగ ♦ జగతిఁ జెలఁగెన్.

మ. ప్రబలారాతి కుమారకోటి ప్రతిబిం♦బంబుల్ నిజచ్ఛాయతో
నిబిడంబై కనుపట్ట సంగరమహిన్ ♦ శ్రీవిశ్వనాథేంద్ర బా
హు బలప్రోద్ధత ఖడ్గపుత్రికలుకై ♦ గుప్పారెఁ బ్రాయంబునన్
సొబగౌ నచ్చరనిచ్చు పెండ్లికొడుకున్ ♦ [illegible] చందంబునన్.

సీ. కామునిరూపు భం♦గముఁ జెంద నెవ్వాని
కడకంటిచూపునఁ ♦ గ్రొంచుకొనఁగ
వంశంబు జెరలెను ♦ వసుధలో నెవ్వాని
చండరసోన్నతి ♦ మెండుకొనఁగ
దండ భృద్వృత్తంబు ♦ తరిదుర్గఁగ నెవ్వాని
పటుపదాతి స్ఫూర్తి ♦ పరిఢవిల్ల
అవనికుంతలము చి♦క్కు వడియె నెవ్వాని
చేకత్తి యొక యింత ♦ చిందు ద్రొక్క
తే. గీ. సతఁడు భువి రాజశేఖరుం ♦ డఖిలబుధజ
నాభిమతదాత యీశ్వరుం ♦ డమితభూతి
ఘనుఁడును నయజ్ఞ రక్షకుఁ ♦ డనఁగ బరఁగె
తనరునాగయ విశ్వనా♦థప్రభుండు.

ఉ. సాగర మెంతయుం గలఁగ బల ర♦జంబున నింకు శిరంబు లూచుఁ బ్రా
గ్భోగివరుండు ఘోటఖుర♦కోటివిఘట్టన దుందుభిధ్వనిన్

వేగ వియత్తలం బదరి ♦ విచ్చు నటన్న జగత్త్రయంబునన్
నాగయవిశ్వనాథ నర♦నాథుని శౌర్య మవార్య మెన్నఁగన్.

ఉ. డెబ్బదిరెండురాజులఁ గ♦డిందితనంబునఁ గొట్టి పోరిలో
డెబ్బదిరెండుగెల్పులు వ♦డిం గయికొంచు సమగ్రకీర్తి చే
నుబ్బుచు విశ్వనాథవసు♦ధోత్పలబాంధవుఁ డొప్పె నారుహా
న్నిబ్బరగండఁ డంచుఁ దను ♦ నిద్ధర నందఱు ♦ సన్నుతింపఁగన్.

శా. విద్యారణ్య తపోవిపాకవిభవా♦విర్భూత సింహాసన
ప్రోద్యద్దుర్గను భార్గవిన్ విజయ లీ♦లోన్నిద్ర భద్రాగ్భనా
హృద్యప్రక్రియ నింటఁ జేర్చుకరణిన్ ♦ శ్రీవిశ్వనాథుండు చం
చద్యోగంబునఁ జెందెఁ దత్కరుణ హె♦చ్చన్ శాశ్వతైశ్వర్యముల్.

కం. ఆవిశ్వనాథనృపతికి
శ్రీవీరాజమకుఁ బెద్ద♦కృష్ణనృపాలుం
డావిర్భవించెఁ ద్రిభువన
కోవిద సంస్తూయమాన ♦ గుణమణిఖనియై.

మ. జగతిన్ నాగయ విశ్వనాథుపెద కృ♦ష్ణక్షోణి పాలాసిప
న్నగదష్టాహిత దుష్టమోఘు లమృతాం♦ధఃప్రక్రియన్ మించి వా
సిగ నస్వప్నతఁ గాంచి యంత విగత♦క్ష్వేళాతిరేకాత్ములై
ఖగవాహప్రతిమాను లైరి యిల స్వ♦ర్గంబందుఁ జిత్రంబుగన్.

సీ. ధర భోజజాతోర్జి♦త కళాస్థితి వహించి
లలిత సత్యాలాప♦కలన గాంచి
ఋక్షభవోన్మేష ♦ ఋజుకీర్తిఁ జెలు వొంది
భద్రాతిశయ లీలఁ ♦ ప్రౌఢిఁ జెంది
యలరుసుదంతాల♦య వసతి రాణించి
సూర్యాత్మభూమోద♦చర్య నించి
మిత్రవిందాధిక ♦ మృదు భావమునఁ బొంగి
లక్షణోదార లీ♦లలఁ జెల్వొంగి

శ్రీవిభుఁ గుమార కృష్ణ
క్ష్మావరుఁ గస్తూరిరంగ ♦ జనపతిఁ గాంచెన్.

ఉ. విస్సధరావరుండు పెద ♦ వీరనృపాలతనూభవుండు తే
జస్సమదత్వరాతిశయ ♦ శాంత పయోజభవాండ మండలాం
తస్సదృఢాంధకారత గ ♦ నంబడ వేదపుగట్టి వెన్నుపై
నుస్సు రటంచు వైరినృపు ♦ లుండక మ్రొక్కిరి లుప్తగర్వులై.

శా. ఆవిస్సక్షితి పాలవంశమణిబా ♦ హాలక్ష్మ్యకౌక్షేయకా
గ్రావిర్భూత సమగ్రకంపమున నా ♦ హావేడిడాల్గుండె యెం
తేవేగంబునఁ జంచలించె మఱిదా ♦ నిన్ సర్వగీర్వాణ కాం
తావక్షోరుహహారముల్ కడుఁ దనం ♦ తన్ గంప మందెన్ రహిన్.

ఉ. ఆనరనాథుతమ్ముఁడు ర ♦ ణాంగణతుంగతురంగ ధాటికా
నూనఖురానవద్యదళ ♦ నోద్యదతిద్యుపరాగ యోగన
ద్యోనిబిడైకకర్దమ మ ♦ హోదధి యల్లకుమారకృష్ణభూ
జాని చెలంగె నౌ నిజభు ♦ జానిభృతప్రబలప్రతాపుఁడై.

మ. సమరప్రాంగణసీమ వీరవిభుకృ ♦ ష్ణక్ష్మాపబాహాగ్రదు
ర్దమకౌక్షేయక విక్షతారి నృప వ ♦ త్సస్ఫారరక్తావివి
క్తమహీకర్దమయుక్తి భిన్నకరి ♦ ముక్తారేఖికల్ కీర్తిస
స్యము దోఁపన్ వెదఁబెట్టుకైవడిని ♦ నిచ్చల్ పొల్చు శుభ్రాకృతిన్.

సీ. దురుసుమన్నీల కీ ♦ ర్తుల పేరిటివెడంద
గట్టుమీఁగడచట్లు ♦ గొట్టికొట్టి
పెరరాచపూప గు ♦ బ్బెతలపేరింటిప్రో
యాంద్రమానము కొల్ల ♦ లాడియాడి
పరమహీపతి జయేం ♦ దిర చంటి పేరింటి
ధరణీధరము కేలఁ ♦ దాల్చి తాల్చి
దూబరిపెనుదాయ ♦ సైబు పేరిటిగట్టు
చిల్వమో [1]మదుముక ♦ చీల్చిచీల్చి

---

పా. 1. మెముకల.

తే. గీ. పంపులకు రానిదోర ప్రతా♦పంపు కెంపు
మెఱుఁగు పేరిట కార్చిచ్చు ♦ మ్రింగిమ్రింగి
వెలసె నీరీతిఁ గృష్ణలీ♦లలఁ జెలంగి
యుద్ధజయహారి వీరయ♦కృష్ణశౌరి.

చ. అలరుకుమారకృష్ణ మహి♦పానుజుఁ డాహవసవ్యసాచి య
త్యలఘు యశోవిశోభి హరి♦దంతరసంతమసాచిమర్ద లి
ర్దళనఘన ప్రతాపుఁడు వ♦దాన్యకులాగ్రణి సజ్జనావనా
కలితగుణాలవాలుఁ డగు ♦ కస్తురి రంగనృపాలుఁ డిమ్మహిన్.

కం. ఆవిన్న భూపతివలన
నావిర్భావంబుఁ జెంది ♦ యఖిలప్రభుసం
భావిత నిజవిజయ ప్ర
స్తావుఁడు శ్రీ ముద్దుకృష్ణ ♦ జనపతి వెలసెన్.

సీ. జన్యోర్వి విమతకుం♦జర తాడన మొనర్చి
యసమాన బలసహా♦యతఁ దనర్చి
రిపువత్సకంఠని♦ర్భేదం బమరఁగ గిట్టి
పరభోగిశీర్షముల్ ♦ పగుల మెట్టి
యహితోగ్రసేనోద్భ♦వాగ్రహ్మఁ గుదియించి
స్ఫుటయశోదానంద ♦ ఘటన గాంచి
తనర మందారాహృ♦తిని చాలనుప్పొంగి
ప్రబల సత్యాలాప♦రస [1]మెఱింగి

తే. గీ. చక్రిధర శృంగపద్మాళి♦శయము మీఱ
శిష్టజనరక్షణము దుష్ట♦శిక్షణంబు
నతిశయిల నవ్యగోపాలుఁ ♦ డనఁగ వెలసె
విన్నవిభు ముద్దుకృష్ణ భూ♦విభువరుండు.

చ. నలువుగ ముద్దుకృష్ణ నర♦నాథశిఖామణి గాంచె వేడ్కతో
నిలవయి చంద్రసూర్యు లుద♦యించిరొకో యని లోకు లెన్న ని

---

పా. 1. మెసంగి.

శ్చలగతి ముద్దువీరనృప♦చందు్రని శాశ్వతకీర్తి సాంద్రుని ని
ర్మలతరధీరతావిజిత♦మందరు నిర్మలభూపురందరున్.

కం. ఆముద్దువీరనరపతి
భూమండల మేలెఁ గమఠ ♦ భుజగవిభు కిరి
గ్రామణ్యష్టదిశాకరి
సామాజిక [1]సార్వభౌమ ♦ సారోన్నతుఁడై.

సీ. జాతిమాలిన యవ్వ♦సంతుండు వివరింప
సాటియే సౌందర్య♦సారమునను
రీతిమాలిన యల్ల♦జాతరూపనగంబు
సాటియే యనుపమ♦స్థైర్యమునను
నడకమాలిన యల్ల♦నందన వనశాఖి
సాటియే నిర్నిద్ర♦చారుకీర్తిఁ
జెలివిమాలినయట్టి ♦ [2]తొలుకరి క్రొమ్మొగుల్
సాటియే సతతవి♦శ్రాణమునను

తే. గీ. ననుచుఁ దను జను లందఱు ♦ నభినుతింపఁ
దనరె దుర్దాంత సామంత♦ధరణికాంత
సంతమసశాంతి పటు:ధామ ♦ చండధామ
విదితజయసారి శ్రీ ముద్దు♦వీరశౌరి.

చ. అనికయి వచ్చి కోర్కిధరప ♦ మానినడాలున నేలుశాత్రవా
ననములు పద్మముల్ దనరు ♦ నవ్యకిరీటమణుల్ పరాగముల్
గొనబుగ వెల్వడం దనదు ♦ కోటిమరందరసంబు ముద్దుకృ
ష్ణనృపతిముద్దువీరనర♦నాథుని ఖడ్గమిళింద శేఖరున్.

చ. అలనరనాథుతమ్ముఁ డఖి♦లారిభయంకరచారుమూర్తి యు
త్యలఘుశుభానువర్తి ధవ♦ళాంబుజ కార్తికచంద్రచంద్రికా
విలసనభవ్యకీర్తి గుణ♦విశ్రుతి నేడవచక్రవర్తి వ
ర్తిలె నిల నిర్మలప్రభువ♦రేణ్యుఁడు సత్కవిలోకగణ్యుఁడై.

---

పా. 1. సారబాహు. పా. 2. తొలుకారు.

సీ. పాఱుచోఁ గంపలు ♦ పట్టి బెజ్జము లైన
చెవులఁ బూమొగ్గ లొం♦ట్లవగ మెలఁగ
నెదుట మోటులు దాఁకి ♦ నుదుటఁ గ్రిమ్మిననెత్రు
జిగి కుంకుమంపుబొ♦ట్లుగను నెగడఁ
దలపాగ వోఁ బోడి♦తలల నంటినపావ
కుబుసాల్ రుమాలచెం♦గులుగ మెఱయ
నొనరఁ గాళ్లను జుట్టు♦కొనినతీఁగలగుంపు
కొమ రొందుబిరుదు పెం♦డెముగ నమరఁ

తే. గీ. జెట్టులను కోటరములందుఁ ♦ బుట్టలందుఁ
గుంజపుంజమ్ములను డాఁగి ♦ గం[illegible]దిండి
లండివగ చెండి వజ్రిలు ♦ [illegible]
వసుధఁ దిరుమల విభుదాసి♦వలన నోడి.

ఉ. పంపులచేత గెల్వఁ జల♦పట్టను కూటపుమూక [illegible]
గుంపులచేత బెట్టు గడి♦కోటలు లగ్గలు[illegible]
మంపులచేతఁ గోమలుల♦మానము [illegible]
యింపులచేత మాతిరుమ♦లేంద్రుని కెవ్వరు సాటి [illegible].

సీ. పెలుచఁ దోమనిప[illegible]♦ములు [illegible] మాని
యిలఁ [illegible] ♦ [illegible]
పలుమాఱు వడ్డికా♦సులు కూర్పుటలు మాని
మెలమితోన వరాల ♦ నియ్యనేర్చె
గోరుచేరుచుకూటి♦కోరిక మాని పా
యిగనురాజాన్నంబు ♦ లిడఁగ నేర్చె
నిల మోచి తనకుఁ దె♦చ్చిపప్పునుటలు మాని
పలుమఱు నగ్గిస్లు ♦ నిలుప నేర్చె

తే. గీ. గట్టుపైఁ గాఁపురం బున్న♦గొట్టు మాని
యొనర మధురాపురమునందు ♦ నుండ నేర్చె

పరిబలుసుఖముల వేంకట♦భర్త నిండు
వేడ్కలు చెలంగఁ దిరుమల♦విభుఁ డనంగ.

సీ. ఆర్యానుమోదన♦ప్రౌఢరీతి వహించి
యమరుసంపద హెచ్చు♦కొమరుఁ బూని
పరమహీభృద్భేద♦పటుశక్తి భరియించి
పరిథితసుబ్రహ్మణ్య♦భావ మంది
తతమహాసేనాభి♦ధానసంగతిఁ గాంచి
బహుళాత్మజస్ఫూర్తిఁ ♦ బరిఢవిల్లి
తారకజయలీల ♦ ధారుణి వెలయించి
శూరపద్మనియతి ♦ జూరలాడి

తే. గీ. వాసవాసత్య వరణీయ♦భాసురాంగ
పటిమవల్లీలసద్వృత్తిఁ ♦ బరిబలుక తనఁ
దిరుమలేంద్రుండు కొమరుని♦తీరుఁ బొంది
పరమశివమూర్తి కరుణచేఁ ♦ బడసెఁ గీర్తి.

సీ. మారిపాత్రులను గెల్చి ♦ నహుషలీలల మించె
క్షితి వసంతోత్సవం ♦ బతిశయిల్ల
సరిలేనివనస్ఫూర్తి ♦ సురభూజ డన రహించె
విజయదుర్గార్చనా♦విభవ మెసఁగ
సాడిరాజనారాయ♦ణుఁ డనుపేరు వహించె
లక్ష్మీవిలాసలీ♦లలు చెలంగ
శరభాతిశయగీతిఁ ♦ జాలఁ గీర్తి వహించె
విశ్రుతసింహాసన♦స్థితి పొసంగ

తే. గీ. ననుచు జను లెల్ల బొగడఁ దా ♦ నతిశయిల్లెఁ
జారుతర నిత్యశోభన♦సమయమిళిత
కవి బుధవతంస వైణిక ♦ గాయకోక్తి
తతనిజాస్థాని తిరుమల♦ధరణిజాని.

సీ. పడియపట్ల నడంగు • నగరాకుమారులఁ
    జెలఁగి కొమ్మునఁ జీల్చి • చిమ్ము ఘోణి
పనులఁ గ్రుమ్మరుగొంటు • నగకందుమన్నీలఁ
    దఱిమి వెన్నాడు వే • దండసమితి
బిలమధ్యమున డాఁగు • పెరవజీరుల గిట్టి
    కమలించు నిట్టూర్పు • కాఁకఁ జిల్వ
కెలనఁ జరించుమొ • క్కలిగడిరాజులఁ
    జెఱ నుంచు గుహాలలో • శిఖరికులము
తే. గీ. [1]తెలుచు వెలువడఁ గమఠంబు • నెలవు సొచ్చి
వారి వెడలింపఁ బో నంత • వసుధఁ దాల్చి
తమశ్రమము దీర్చుతిరుమల • ధరణినాథ
మణికిఁ బ్రత్యుపకృతి సేయ • మనసుఁ బూని.

కం. అల శ్రీ తిరుమలనాథుం
డలమేలమయందుఁ గాంచె • సనఘు వసంత్రో
జ్జ్వలవిభవసాంద్ర కీర్తులు
వెలయంగఁ గుమారనుతు • పిగసి గేద్రపున్.

చ. భువిఁ జినముద్దువీరనృప • పుంగవుపాఁశికృప ాణభిన్నశా
త్రవనృపదేహశోణితప • రంపర యింపులు గుల్కొ నూత్నస
రవరణవేళ నెంతయు సు • రప్రమదాతతి సంగమోత్సవంపు ను
త్సవము ఘటిల్లఁ బెల్లుగను • చల్లిన చెంద్రిపుజల్లు నా వడిన్.

సీ. [2]వలిగట్టు వెలిపెట్టు • కళలుట్టు నెలగుట్టు
    [3]వేగంటిదొరచెట్టు • వెండిగట్టు
వినుజాలునినురాలు • నును [4]చాలుగనుమేలు
    నలువబాబాలు క్రొ • న్ననలచాలు

---

పా. 1. తొలుదొలుత దంభకమఠంబు • నెలవు సొచ్చి. పా. 2 వలిమెట్టు తెలిబట్టు. (పా. 2. మలిమెట్టు వెలిబట్టు). పా. 3. వెలగట్టినాగచెట్టు. పా. 4. బాలుగల.

జిగిమీఱు తోఁగసౌరు ♦ మగరారుటపుపేరు
తళుకుముత్తెపుఁబేరు ♦ తమ్మిపేరు
విలసిల్లునసరెల్లు ♦ తెలివల్లుకొనుజల్లు
లరదిగంబురజల్లు ♦ నురుగు[1]విల్లు

తే. గీ. నెల్లపుడు నుల్లమునఁ జాలఁ ♦ దల్లడిల్ల
నల్లనల్లన మల్లాడి ♦ యుల్లసిల్లు
తిరుమల[2]ధరేంద్రువీరధా♦త్రీపచంద్రు
కీర్తి జగతిని ననుపమ♦స్ఫూర్తి మెఱయు.

కం. క్షమ వీరేంద్రుఁడు మీనా
క్షమ నలలింగాంబ నాజ♦మాంభోజాతా
క్షి మతియును మధురనాయిక
నమలమతిం బెండ్లియాడె ♦ ననుపమలీలన్.

తే. గీ. అట్లు మీనాక్షమ యయారె ♦ యాస లెంచి
స్వామితో విగ్రహముఁ జేయఁ ♦ జనక కఠిన
చాపలత డించి యశాంత♦సమరసత్వ
పటిమ మధురాపురిని వీర♦పత్ని యయ్యె.

సీ. క్షితి యవిరతరజ♦స్కతఁ గాంచి కోరనా
భర్తనెంతయుఁ గ్రిందు♦పడఁగఁజేసె
లచ్చి యంచనఁ జంచ♦లయె ఘనత నెనంగు
నేలినవానిఁబ్రా ♦ మ్మొక్కి నిలిచె
సతియె తాఁ బార్వతి ♦ శంకరుం డగువాని
నాత్మేశుఁ గదిసి మా♦ఱాడఁదొడఁగె
పతిదేవతయె తాను ♦ బాష దా తగువాని
ప్రాణనాయకుని నో ♦ రదుముకొనియె

తే. గీ. నని కువృత్తియును భృగుక♦లనయుఁ జండి
తయును వ్యాహారరీతిఁ జెం♦దకయ వసుమ

---

పా. 1. వెల్లు. పా. 2. నరేంద్రు.

తియు జగన్మాత గౌరి వా◆గ్దేవి యనఁగ
రంగలరె సద్గుణాలంబ ◆ లింగమాంబ.

చ. నిరుపమభర్తృభక్తి ధర◆ణిం బొగడొందెడునాజమాంబకుం
సరి యనవచ్చు నెంతయును ◆ జాహ్నవి వెల్వెలఁబాఱ కోషధీ
వరకలనాంతజాడ్యవిష◆వర్తను భర్తను ధూర్తమాళి యం
చరయుచు సారెకుం మొరసి ◆ యాదల[1]మెట్టక యున్న నెన్నఁగన్.

కం. లలితహరిభాషణ కుతూ
హలవిజయ[2]యశస్సమంచి◆తాత్మయునై తాఁ
గలితసుభద్రాభిధయై
యలరారుం మధురనాయి◆కాంబ గణింపన్.

సీ. తిరుమలమేదినీ◆వరుముద్దుపీరధ
రాధినాథుండు మీనా◆క్షిమాంబ
యం దలచొక్కనా◆థావనీపాలు లిం
గాంబికయందు ము◆ద్దళఘుగిందు[?]
నాజమాంబికయందు ◆ నచ్యుతేందు[?]ని చిన్న
యచ్యుతు మధురనా◆యకినుయందు
నారసింహక్షమా◆నాథశిఖామణి
నెన లేనివేడుకల్ ◆ [?]చ్చెలంగఁ

తే. గీ. గాంచె నెంతయుఁ గల్పద్రుమ◆పంచకంబుఁ
బాలమున్నీటిచందానఁ ◆ బ్రథితదాన
[3]వర్తనంబును కీర్తివి◆స్ఫూర్తి మెఱయ
సరససుమనోమనోవిలా◆సంబు మెఱయ.

మ. వెలయుం వారల కగ్రజుండు సుకృతా◆విఖ్యాతబోధుండు ని
ర్దళితానేకవిరోధియూథుఁ డహీన◆ర్వస్తుత్యమేధుండు సం
జ్వలితాబింధనగంధవాహసఖది◆వ్యద్భవ్యతేజోవితా
నలసద్గంధుఁడు చొక్కనాథధరణీ◆నాథుండు భాగ్యోన్నతిన్.

---

పా. 1. యొల్లక. పా. 2. వశస్సు.
పా. 3. వర్తనము వితతవి◆స్ఫూర్తి మెఱయ.

సీ. అలవనీపకు లెల్ల ♦ నవనీపకులమైరి
ఱెవ్వాని పటుదయా♦దృష్టివలన
వెస సుధాశులుసైత ♦ మసుధాశులే యైరి
యెవ్వాని ద్విజకోటి♦యిజ్యవలన
క్షితిని తిలసమాను ♦ లతిలసమానులై
రెవ్వాని తోడవ్రుల♦యోగివలన
నారార చలధీరు ♦ లచలధీరులు నయి
రెవ్వాని పదవంద♦నేచ్ఛవలన
తే. గీ. రాజమాతుర్మిండె యతఁడు దు♦ర్వారచారి
వైరినాసీరభటవార♦ఘోరవీర
వారినారాచచాపవి♦స్ఫారపూర
సాధుజయహారి శ్రీ చోక్క♦నాథశౌరి.

ఉ. చందనచంద్రకేతకులు ♦ సారెకుఁ బోఁగునకై యెదిర్చి నె
న్నం దగుచోక్కనాథనర♦నాథునికీర్తి యహీనతఁ రహిఁ
జందనవాటిఁ జుట్టుకొనఁ ♦ జందురునిం గబళింపఁ గేతకీ
బృందము మెట్టఁగా సెలవు♦పెట్టును కొందఱు చిల్వఁజోదులఁ.

సీ. చోళంబు పగల నా♦భీలకరామర్ద
గాఢాగ్నిశిఖరీతి ♦ యాక్షిపఱచి
మత్స్యంబు సుడివడ ♦ మందువేసవిపూట
గాటంపుపేరెండ♦కడఁక నెరపి
సింధువు శోషింప ♦ సీమారవఘోర
బాడబజ్వాలదర్పి ♦ పటిమఁ జేర్చి
వంగంబు పైపైఁ గ♦రంగ బంధురగంధ
వాహబాంధవకీల♦వైపు చూపి
తే. గీ. వంపులకు రాక దొరలు గ♦ర్వింపఁ గినుక
వివిధదేశంబులను దండు ♦ విడియునపుడు
తనరుపీయరచోక్కనా♦థక్షితీంద్రు
చంద్రహాసనటద్దామ♦చండిమంబు.

మ. నెల నానాఁటఁ గృశించు హెచ్చి ఘనుఁ డెం♦తే విచ్చు ఘోషించి య
ప్పలఁ దేలుఁగా జలరాశి పూరి గ్రసియిం♦పు న్వేల్పుటా వెమ్మతోఁ
బెలుచన్ లోఁగె దధీచి తూఁగె శిబి యు♦ర్వి న్వ్రీఁగె హేమాద్రియున్
నలు వొందన్ రహిఁ జొక్క_నాథవిభుదా♦నస్ఫూర్తి వర్తింపఁగన్.

సీ. తళుకుఁగ్రొమ్మెఱుఁగులు ♦ తలచూపె నని చిల్వ
దొర శంభుచరణంబు ♦ శరణ మంద
జంభారి దంభోళి ♦ సంధించె నని గిరుల్
మున్నీటినీటిలో ♦ మునిఁగి యుండ
వనశిఖి గనిపించె ♦ నని వచ్చి గొరులు
హరిదీశపురసీమ ♦ లాశ్రయింప
బలువేఁడి యిదె వచ్చెఁ ♦ బై నంచుఁ బ్రాఁబంది
యడవిటెంకిమఱుంగు ♦ వడి వసింపఁ

తే. గీ. గనఁబడు నిజప్రతాపంబు♦కతననొంటి
డంభకమఠంబు మోవఁ గ♦డంగ బహుళ
ఖండ మగుధాత్రిఁ దాల్చె న♦ఖండకీల
నవ్యగుణహారి శ్రీచొక్క_♦నాథశౌరి.

శా. ఆధాత్రీరమణానుజుం డఖిలవి♦ద్యాకాంతుఁ డుద్యన్మహా
మేధావంతుఁ డహార్యధైర్యుఁ డతిగం♦భీరస్వభావుండు ది
గ్వీథీనర్తితచారుకీర్తి యతులో♦ర్వీమండలాఖండలాం
భోధిశోభనరామచంద్రుఁడు తగున్ ♦ముద్దళ్ళరీంద్రుం డిలన్.

సీ. ఇనకాంతమయము లం♦టయ్యె విరోధిదుర్గంబు
లేమహోన్నతమహా♦హేళి మెఱయ
మణు లయ్యెఁ బరవీర♦మహిళాళికనికర
లేనయోజ్జ్వలకీర్తి♦గాన మెసఁగ
సూదంటురా లయ్యె ♦ శూరారిమకుటంబు
లేమహీపతిలోహ♦హేతియెదురఁ

గరక లయ్యె నరాతి♦కరికుంభరత్నంబు
లేనరేశ్వరుఁ డంప♦వాన గురియ

తే. గీ. ఘనుఁ డితం డని మొనసిన♦కాందిశీక
పారశీక శకాంగ బ♦ర్బర కళింగ
వంగ బంగాళ చోళ నే♦పాళభయద
ఘనవిజయధాటి ముద్దుల♦ళ్ఘరికిరీటి.

సీ. ఏమహీపతిచేతి♦యొకటూరిచిల్వకు
బదనిక లరివీర♦వదనతృణము
శ్రేణురంధరుబలాం♦భోధికిఁ జెలియలి
కట్ట దాయలు మొట్టు♦పుట్టమెట్ట
యేధన్యుకోపవ♦హ్నికిని తాపస్తంభ
ముద్రా నైరులకేలు♦మోడ్పుసరవి
యేరాజుహయఘూర్ణి♦నీరదాళికిఁ దోలు
గాలి ధావదరాతి♦పాళియూర్పు

తే. గీ. జగతిఁ దగు నాతఁ డురరణాం♦చత్స్ఫుటప్ర
పంచసమధికవంచనో♦దంచితాత్మ
పంచతిరువడిరాజస♦స్తాంగహారణ
కదనపరిపాటి ముద్దుల♦ళ్ఘరికిరీటి.

సీ. నలుఁడు సారతరసౌం♦దర్యవిభ్రమమున
ననలుఁడు తేజోమ♦హత్త్వమునను
భవుఁడు నితాంతసం♦స్తవనీయకీర్తిని
నభవుఁడు దీర్ఘాయు♦రతిశయమున
నిలుఁడు నిరుపమావ♦నీభరణంబున
ననిలుఁడు పటుబల♦ప్రౌఢిలీల
గదుఁడు బంధురతర♦గాంధర్వకళయందు
నగదుఁ డుదారభో♦గాప్తివలన

తిలకంబై జనియించి సుస్థిరగుణా♦ధిక్యంబుఁ జెందం దదా
కలనన్ ముద్దళఘేంద్రుఁ డర్మిలిఁ గనున్ ♦ గార్హస్థ్యధర్మోన్నతుల్.

మ. సరసీజాక్షుఁడు చక్రధారి యయి ని♦చ్చల్ హెచ్చు శ్రీముద్దుల
ళ్ఘరిశౌరి న్మఱపించు నాత్మజునిలీ♦లన్ శ్రీ యనం బొల్చు బం
గరుసామ్మె యది రుక్మిణీత్వము తగం♦గా ధారుణిన్ రుక్మిణీ
హరిణీలోచన వన్నెఁ గాంచెను సము♦ద్యల్లోకముఖ్యస్థితిన్.

మ. అనఘుం డైనకుమారుఁ గాంచి శుభవి♦ద్యామూర్తి యా నన్నకీ
ర్తిని నల్వొంది రమావిలాస మమరన్♦రీతిన్ విజృంభించి చ
ల్లనిలేఁజూపుల నందఱు న్మనుచులీ♦లం బొల్చె నాఢ్యత్వ మా
నన ముద్దఘ్నరిరాజమాళిసతి మీ♦నాక్ష్యంబ భాగ్యోన్నతిన్.

ఉ. ఆనృపచంద్రుతమ్ముఁ డని♦శార్చితనీలగళుండు సర్వవి
ద్యానిపుణుండు ధన్యుఁడు వ♦దాన్యశిఖామణి దివ్యకీర్తికాం
తానవమన్మథుండు కవి♦తాచతురుండు చెలంగు జన్యసీ
మానటితోరుశౌర్యఖని ♦ యచ్యుతశౌరి యశోవిహారియై.

సీ. ఉగ్గుఁ బట్టకమున్న ♦ యుదయించె నాశ్రిత
జనులపై నాసక్తి ♦ శంభుభక్తి
మాట నేరకమున్న ♦ నేర్పెంచె సత్యంబు
గురుపైనధర్మాను♦కూలబుద్ధి
[1]మృదు వెఱుంగకమున్న ♦ పొడవెను సాహిత్య
శీలనంబు కవీంద్ర♦లాలనంబు
పాదు కదుమురీతి ♦ పనుపడకయమున్న
న్గ్రాంశ్రిమస్రిమ ♦ వానిఁ గనియె

తే. గీ. సెంతయును వింత యని ధరా♦కాంతుసమితి
సంతతము సంతసమ్మున ♦ సన్నుతింప
వెలయు నిలలోన నసమాన♦విభవ మమర
శుభగుణాస్థాని యచ్యుత♦క్షోణిజాని.

---

పా. 1. మృదువు నేరకమున్న.

శతృపార్థివగేహా • చిత్రితఫణులకు
వల్మీకగర్భభూ • వసతి పొసఁగ
రిపుమహీమహికాంశు • గృహచకోరికల కం
గారసత్రంబు ల • వ్వారి యయ్యెఁ
బరిపంథిమనుజేంద్ర • భవనకేకినులకు
ఘోరకాంతారసం • చార మొదవె

తే. గీ. విదిత తిరుమలనృపవీర • విభుకుమార
వీరముద్దళ్ళరిప్రభు • విజయధాటి
కానిరాఘాటచతురంగ • ఘనచమూగ
మాహమోహాదిశల్ చుట్టు • ముట్టినపుడు.

సీ. చెంగల్వరాయఁడు • చేరుచుక్క నొసంగ
వలిగట్టు వజ్రమే • ఖల ఘటింపఁ
గుండలిగ్రామణి • కుబుసంబు నొసగూర్పఁ
గైలాసగిరి రూప • కటక మిడఁగ
గాంగపూరము హంస • కములఁ జేర్పఁగఁ బాల
మున్నీరు ముత్యపు • మురువుఁ జూప
నంబరచరశాఖి • యలరుదండలఁ బూన్ప
వంకరూపరి నెల • వంక యునుప

తే. గీ. నందఱకు నన్నిరూపులై • యష్టదిగ్వి
జృంభితానేకలీలయై • చెలఁగి జగతి
నెంతయు నటించె ముద్దళ్ళ • రీంద్రచక్రి
వర్తి మూర్ధన్యమంజుల • కీర్తికన్య.

సీ. కడగట్టువెన్ను చీ • కటిఁ గొట్టఁ గాని శ
త్రుగృహాంధకారముల్ • దునుమలేదు
కడలి శోషింపఁ జొ • ప్పడుఁ గాని పగరాచ
చెలులకన్నీరు రాఁకఁ • జేయనేర

దనలత్రియోన్మేష ♦ మణంచుఁ గాని విరోధి
పురు లేర్పుశిఖఁ గొంచె♦ పఱచలేదు
రోదసి మెఱయింపు♦రుచి నింపుఁ గాని భీ
తవిరోధిదిగ్గ్రాంతి ♦ తరపఁజనదు
తే. గీ. బళిర యిది వింత యనఁ దగు♦బలసమిద్ధ
ఘనసమరబద్ధ వీరకం♦కణసమగ్ర
ధీరముద్ఘళరిక్షమా♦ధిప కరాగ్ర
మండలాగ్రప్రతాపార్క ♦ మండలంబు.

శా. జాగ్రై యింపుగఁ బల్కుకుల్కునునుపుల్ ♦ జగ్గుల్ తగ న్నిత్యక
ల్యాణస్ఫూర్తి నెసంగఁగా జతులు చా♦లా మించి రాణించఁగా
నేణాక్షీతతి ముద్దులళ్ఘరిధరి♦త్రీశుండు లాలించి తా
వీణావాద్యమునేర్పు మీటువగ నౌ ♦ వింతం దనంతీఁ రహిఁ.

సీ. చల్లనిమల్లెపూ♦జల్లు లెత్తినభాతి
ననతేనెసోనలు ♦ నునుచుగీతిఁ
గమ్మకప్రపుదుమా♦రమ్ములచందాల
వింతకస్తురివీణ ♦ విప్పులీల
సంపఁగిపుప్పొడి♦గుంపు గుప్పినబాగిఁ
బునఁగుత్తాలగీవి ♦ పెనఁగుహొయిఁ
బన్నీటి చిట్టూట ♦ పరిమవిల్లినజాతిఁ
బల్కునెచ్చెలిఫీగె ♦ పల్కుగీతిఁ
తే. గీ. జల్లఁదన ముల్లసిల్లంగ ♦ నెల్లవారు
సౌర సేబాసు మేలు మ♦ర్ఘళ్ళరె యనఁగఁ
బ్రౌఢి మెఱయంగ సాహిత్య♦రచన సేయు
నెపుడు ముద్దళఘురిశౌరి ♦ రిపువిదారి,

సీ. తిరముగా నలపార్వ♦తీలోచనము పర్వ
రాజచూడామణి♦ప్రౌఢి మెసఁగ

---

పా. 1. పఱపఁజనదు.

నతులవైఖరి మించు • రతిలీల రాణించఁ
గందర్పమహిమలు • గ్రిందుకొనఁగ
మల్లికామోదంబు • మలయుంగ ననయంబు
నితవు మీఱ వసంత • గతి పొసంగ
లలిత మాలక్ష్మీవి • లాసంబు దగుఠీవి
శ్రీరంగవిభవంబు • చెలువుమీఱ

తే. గీ. భావరసములు తగ హృద్య • భరతవిద్య
నలవఱచుఁ దాను బాలల • నతనులీల
విదితరణకేళి శాత్రవ • విపినకీలి
కవికమలహేళి ముద్దళ్ళ • రింద్రిమాళి.

సీ. తనవిజయాంకగా • థలు వ్రాయువోఁ జేతి
వజ్రరేఖిక చూచి • వణఁక గిరులు
తనసింహనాదంబు • దశదిశాధిపు పరా
క్రమవేళ నాలించి • కదలఁ గరులు
తనపించెకుంచె లు • ద్భటఘోరఖురదళ
ద్ధరణిపద్ధతి గాంచి • తలఁకఁ జిలువ
తనధాటి నా రసా • తలబిలంబులు జూఱ
చెంచులరొద విని • చెదర ఘోణి

తే. గీ. తనచమూధూళిజంబాలి • తమగుకడలి
దంభకమఠం బడంగ నా • ధార మగుచు
ధరణితరుణిని దా భుజా • సరణిఁ దాల్చుఁ
గదనజయహారి ముద్దుల • ఘ్రరిమురారి.

సీ. వరభోగపరిభూత • వాసవుం డితఁ డౌట
నెడ లేనివానల • కేమి హెచ్చు
చక్కఁదనంబునఁ • జందురుం డితఁ డౌట
నిల నుండుపంటల • కేమి హెచ్చు
దానలక్ష్మిని కామ • ధేనువే యితఁ డౌట
నెన లేనిసాఁడికి • నేమి హెచ్చు

సకలవిద్యాప్రౌఢిఁ ♦ సర్వజ్ఞుఁ డితఁ డౌట
నెనిమిదికలుములఁ ♦ కేమి హెచ్చు
తే. గీ. బళిరె మజ్ఝారె యని జనుల్ ♦ ప్రస్తుతింప
ధనకనకధాన్యవస్తువా♦హనసమృద్ధి
వెలయు నాచంద్రముగ ధాత్రి ♦ వీరనృపతి
[1]కరటిశరభుండు ముద్దుల♦క్ష్మరివిభుండు.

## షష్ఠ్యంతములు.

కం. ఏవంవిధ సద్గుణమణి
[2]కావలయాంచద్ధరావ♦రాంగీహీర
గ్రైవేయకాభిశోభి య
[3]శోవిలసితధవళఘృణికి ♦ శూరాగ్రణికిన్.

కం. సంధాభృగునందనున క
బంధనగంధవహబంధు♦హితతేజోని
ర్గంధితగంధాంధరిపు
స్కంధావారాంబునిధికిఁ ♦ గవిసేవధికిన్.

కం. నాభాగసమున కంబుజ
నాభాగమబోధధుర్య♦నకును హరిన్నా
నాభాగనటితకీర్తిఘ
నాభాగరిమాతిశయున ♦ కధికజయునకున్.

కం. ఆంధ్రవచోనాథునకుఁ బు
రంధ్రీపాంచాలునకుఁ గ♦రధృతాసిలగ
త్కంద్రిపరిపంథిపార్థివ
రంధ్రితదినమణికి మతిధు♦రంధర ఫణికిన్.

కం. ఘోరమహోదారమహో
దారమహోన్నతతరాబ్ధి♦హాతచణునకు మం

పా. 1. కరటికలభుండు. పా. 2. కావలయాచలధరావ♦రాంగీహీర.
పా. 3. శోవిహసితశితఘృణికి ♦ శూరాగ్రణికిన్.

దారవనీగౌరవనీ
హారవనితవంచి కీర్తి • హారిగుణునకున్.

కం. దీపితతేజఃస్థితికిన్
బ్రాపితవిజయేందిరాని • యతికిం గరుణా
శ్రీపతికి ముద్దువీర
క్ష్మాపతిముద్దఘ్నరిక్షు • మాతలపతికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన సత్యభామా
సాంత్వనం బనుమహాప్రబంధమునకుఁ గథాక్రమంబెట్టి దనిన.

శా. శ్రీశుం డానరకాసురున్ గెలిచి రా • చెల్వ ల్పదార్వేలు పే
రాశం గూడఁగ నల్లుసత్య నెటు లూ • రార్చెలె నాసత్కథన్
ధీశక్తిన్ జనమేజయుం డడుగఁ దా • నెక్కొన్న మోదంబుతో
వైశంపాయనుఁ డిట్లనెన్ మధుసుధా • వాదప్రవీణోక్తులన్.

కం. శ్రీపురహరరథరమణీ
నూపురమై కల్మిపడఁతి • నుడికొప్పులకున్
కాఁపురమై సొబగుల నఁ
[1]కాపుర మని యనఁగ ద్వార • కాపుర మలరున్.

ఉ. ఆపురమందుఁ గెంపుజగి • యుందపుకోట పయోధికన్యకుం
బ్రాపగుతమ్మిపోలికను • భాసిలెఁ గొమ్మలు రేకులట్లు చా
లా నరఁగున్ దదంతరగ • భన్నవమౌక్తికలీల నబ్ధివీ
చీపృథుశీకరమ్ము లెన • సెన్ హరిసేనలు చల్లుకై వడిన్.

మ. పురసౌధాగ్రములందు రాసుతులతోఁ • బూఁబోండ్లు కందర్పసం
గరముల్ సల్ప [2]నెనంగులేసకినకూ • కల్ వైజయంతంబునన్
దిరుగుంగూకికవల్ రహిం బ్రవనుచు వా • రిన్ నేర్చి వాక్ప్రచ్చఁ బ
ల్మలు సెబా సని వేల్పుఁజేడు నగి చా • లా నచ్చురల్ మెచ్చఁగన్.

---

పా. 1. కాపుర మై తనరు ద్వారకాపురమలరున్. పా. 2. నెనంగ వేసరిలికూకల్.

ఉ. అందలిమూలరాపనుల ♦ యందపుఁజత్త్రరు లొప్పుసెజ్జలన్
కెందలిరాకుఁబోంట్లు మరు♦కేళి యొనర్పఁగ సేదదీర్పఁ బో
కందళితోత్పలోద్వళిత♦గౌరవకైరవసౌరవాహినీ
కందళితారవిందమధు♦గంధధురంధరగంధవాహముల్.

సీ. మాటికి నింపుత♦మ్మరసంపుజిగి పెంపు
తహతహఁ జరియింపు♦దాసిగుంపు
నిలమీఁద నొత్తునం♦ఘ్రిలలత్తుకలబొ్గసు
సురతంపుముద్దత్తు♦సుఖపుఁజొగసు
లొగి డీలుపడి గాట♦ముగ వాలుముడిపూలు
పరవంజికొనుమేలు♦సావురాలు
ననయంబుఁ జెదరి ఘ♦మ్మనుమంబుగిలుమంబు
నికరంబు లైన నఖ♦స్ఫుటితదంబు

తే. గీ. లమర నిశ్శంకనిగానాంక♦సమరసమయ
యువతికోలాహలమ్ములఁ ♦ దపబిబిబి
మీఱ నింటింట నిటులు మ♦ [illegible] రె యనఁగ
వెలయు రహిఁ జాటె యస్వేటి♦నేశవాటి.

చ. పలువగమొగ్గలుం జిగురు♦సాళ్లలు దంటలు బంతు లంబుజ
మ్ములు నెనయం [1]జెనంగువల♦పుల్ తగఁబూచినపూపుఁదేనె [illegible]
బ్బులఁ గొన వచ్చినావొ కొని♦పించెదవో యని [illegible]కాండ్రకున్
విలుతురు పుష్పలావికలు ♦ పీట విరుల్ సరు లేర్పఁగింపఁగన్.

ఉ. పైఁటలు జాఱఁ గుంననపు♦బారి ఘలీ లన మస్తు మీఁకి శ్రేం
గాటకమందు మందగతిఁ ♦ గామునిపట్టపుదంతులో యనం
బోటికి నారెకట్టికలఁ ♦ బొంకముగా విటు లావరించి రా
మాటికిఁ గొల్వుబోగముల♦మానవతుల్ చరియింతు రప్పరిన్.

---

పా. 1. జెనంగు తలపుల్.

కం. కంటె నతోదరి సొగసులు
వింటె నయమ్ముగను విటుల♦విధము లటం చా
కం టెనయక నం టెనయక
కుంటెనకత్తియలగుంపు ♦ గుమ్మిరు వీటన్.

సీ. నెలరేకఁ గొనుసంజ♦నిగ్గు నా నాభినా
మమునఁ జెందిరిపురేక ♦ కొమరుమీఱఁ
జిలుకనొక్కిన బింబ♦ఫల మనఁ గసికాటు
మోవిని గుల్కు చెం♦గావి మెఱయ
వలఁ జిక్కగయుజక్కు♦వ లన జాఱినపైఁట
నెనసి బల్గుబ్బపా♦లిండ్లు నిక్క
కరటికుంభము లంటి ♦ మొరయుతుండములీలఁ
పిఱుఁదుల మడిచేఱు ♦ పొరలి యాడ

తే. గీ. మూపు తనియించుజంపెపు♦ మోపునీటు
కొండ్రి సగరను రాకపో♦కల నగించఁ
ఒయాపపాప్రియంపు బొఁవన♦బోనగత్తె
చెలమిఁ దిరుగుదు రెచ్చోటఁ ♦ గెలసి వీట.

ఉ. అత్యకలంకవృత్తి వెఱ♦యూండుమ్రిను రాముని హృద్యవాద్యవై
యాత్య మొసంగ నంగజవి♦హారమహారసికావతంసులై
నిత్యము క్రీడ సల్పుదురు ♦ నీటులు మీఱఁగ వేశవాటులన్
సాత్యకిచంద్రభానుశివ♦సాంబజయాది కుమారవర్గముల్.

మ. కమలాకాంతవసూపభుక్తసుమనః♦కస్తూరికాయుక్తులై
తమి నించుం దెరరేకులుం జెవులకిం♦దన్ వ్రాలునుగ్రొప్పులం
కము మీఱం దగుబోనకత్తియలచెం♦తం జేరి యల్లుండ్రపై
కము హాళిన్ రమియించు నాత్మగృహిణీ ♦ కాలుష్యసంధాయియై.

సీ. మసలువోఁ జీరపైఁ ♦ బసిఁడితళ్కులు గుల్కఁ
బసుపునున్గ్రొడనిగ్గు ♦ బయలుదేఱ

సందంద రూపసి ♦ నరయుసొంపునను మో
మలంచఁ గమ్మలజోడు ♦ తళుకుమీఱఁ
గుడిసీరుచెం బంటి ♦ జడుదాని ముందుగాఁ
గసరుచూపు జగంబు ♦ గాఁడి పాఱ
నరితికాఁ జెదుట వా♦తెర నొక్కఁ గొంజెక్కు
చెమటఁ జెందొప్పుబొట్టు ♦ చెమ్మదేఱ

తే. గీ. వలుదబిగిపాలగుబ్బల♦వంక బ్రిగుకు
సాగ సనుచు మాటిమాటికిఁ ♦ జూచుకొనుచు
వీథి నొగిఁ గొంటెబోఁపలు ♦ వెంట నంటఁ
గులుకుఁ దొలిజాతిచనుఁబాల♦కోమిరెచాలు.

ఉ. కాంతలు పవ్వళించి తొడ ♦ కౌను కవుంగిటఁ గూర్చి పొక్కిటన్
వింతగ మోము లుంచుకొని ♦ వే మణితమ్ముల నుగ్గడించు చొ
క్కింత నయం బొకింత ఘన♦మింపు ఘటింపఁగ నిద్రిమబ్బులోఁ
బంతము మీఱఁగా సరళిఁ♦బాడుచు రచ్చటిబోంట్లు వేకువన్.

చ. నిలుకడలేక పైకొనెడి ♦ నేర్పులు దెల్పఁగ నవ్వుమోముతోఁ
జెలిమిని దెల్పఁగాఁ దిరుపు♦చేయువగల్ భ్రమణంబు దెల్పుతీ
వులఁ దగ నాట్యశాలనడు♦వుగ్గొనఁ బొందురు నాగవాసపుం
లలనలు వీటఁ దాళగిరి♦లాగున నెయ్యురు నెంట నంటఁగన్.

సీ. తతవేశవాటికా♦కృతకాదుర్రిలను గూడి
నవఘర్మవారిఁ దా♦నమ్ము లాడి
పసపువాటించుక♦పర్రిపుబూది మైనించి
లలనోపభుక్తశా♦టులు ధరించి
ననరేకునును సెజ్జ ♦ యను[1]బృసీస్థలిఁ జేరి
కొమ్మలకౌఁగిటి♦గుహలఁ జేరి
మానినీహారాక్ష♦మాలికల్ రాఁదీసి
స్మరమంత్రిగాయత్రి ♦ జపముఁ జేసి

పా. 1. బృశ్శస్థలు.

తే. గీ. యెడనెడను నావులింతలఁ ♦ బొడముతప్పు
దీర మన్మథ మకరాంక ♦ మార మదన
మనసిజ మరుద్రథ రమాకు♦మార యనుచు
వెలయు విటతాపసులసేన ♦ వీటిలోన.

ఉ. వేఁకటిచింత యంత మది♦[1]వింతగ నెమ్మెయిఁ గప్పుగప్పుతో
నాఁకటి కానవా ల్ఫలము♦లన్నము చేటిక లాని రాఁగ నుర్
గూఁకటిఁ గల్వపూ ల్దురిమి ♦గుబ్బలఁ గస్తురిఁ బూసి జారులం
జీఁకటినేస్తపుంజెలులు ♦ చేరుదు రప్పురి దాదియిండ్లలోన్.

మ. ననుపుర్ బాపులు చూడ నైదువలు శ్రీ♦నాథాజ్ఞనెంతే నెదు
రొక్కన బంగారపుపావలర్ దిగి, నును♦గుబ్బల్ బయల్దేరఁగా
ల్వనుసారింపుచుఁ దాళిగట్టు జనుచే♦లా కౌనునీటాని కొ
ల్వునకుర్ వత్తురు రాయబారపుఁజెలుల్ ♦ కోటానఁగోటుల్ పురిన్.

సీ. పాకారిణిమకృత ♦ ప్రాకారములమీఁద
రారాలబసువని♦బారు చెలఁగ
గోపురాంతస్సీమ ♦ నూపురారావంబు
లమర బోగముకన్నె♦గము లెసంగ
గోపవామాదగ్గ♦ధూపవాసనలచేఁ
దమ్మిపూమేల్కట్లు ♦ ఘుమ్మనంగ
భద్రానువాదక♦రుద్రానువాకముల్
పఠియించుపారుల♦ప్రౌఢి వెలయ
తే. గీ. నందుఁ జెలు వొందు నందిహ♦స్తారవింద
వేత్రవిత్రస్తగీర్వాణ♦వితతి యగుచు
శైలరాజన్యకన్యకా♦శంకరులకుఁ
దావళం బైనయొక పైఁడి♦దేవళంబు.

శా. ఉల్లాసం బొనగూడ జగ్గునడతో ♦నొయ్యారపుంజూపు లు
ద్వల్లీలం దగఁ జేతు లెత్తి భసపుం♦దళ్కొత్తు పాలిండ్లతో

పా. 1. వింతగ హెచ్చుగఁగప్పురంబుతో.

మల్లాడం దగునింతుపై డికడవల్ ♦ మౌళిస్థలిం బూనుచుం
చల్లో చల్లని చల్ల యమ్ముదురు ని♦చ్చల్ గొల్లచాన ల్పురిన్.

ఉ. ఆపుర మేలు యాదవకు♦లాగ్రణి దిగ్గణితోగ్రభూరిఘో
రీపటలామరారినగ♦రీయుగరీణశరీరవీరని
ర్వాపణగర్వనిర్వహణ♦రంగదభంగరథాంగవిక్రమో
ద్దీపనభూష్ణుఁ డాహవవ♦ధిష్ణుఁడు కృష్ణుఁడుసర్వజిష్ణుఁడై.

శా. ఆకంసాసురవైరి యష్టమహిషీ♦వ్యాపారజాపారలీ
లా[1]కూపారనిమగ్నమానససము♦ద్యత్కామవిద్యాపరీ
పాకంబు ల్మెఱయంగ రంగయినమే♦ల్బంగారపుం సజ్జలో
లోకాతీతవిహారుఁడై మదవతు♦ల్గొల్వంగఁ గొల్వుండఁగన్.

వ. తదనంతర కథావిధానం బెట్టిదనిన.

మ. సరసా సంగరసంగరస్ఫుటసుహృ ♦ సంధాన సంధానతా
దిరమాభూషిత భూషితస్తుతిగతా♦సృక్కర్ణ దృక్కర్ణకుం
జరవాగానన గానవ్యసుయశః♦సామ్రాజ్య సామ్రాజ్యసి
క్తరసాస్యందన స్యందనధ్వరిపుభా♦క్కాంతారకాంతారసా.

కం. సూక్ష్మాలాపవిచక్షణ
సుక్షోణీధరఖలవిపక్ష♦కుంజరసమ్రా
డ్వక్షశ్శ్రీరక్షేపణ
దీక్షాహార్యక్ష పాండ్య♦దేశాధ్యక్షా!

కం. అద్వైతమతాధారా
మృద్వంగీనుతవిహార ♦ మేదురసారా
సద్విజయకీర్తిధారా
విద్వన్మందార ముద్దు♦వీరకుమారా!

పా. 1. కూపారసమగ్న.

మాలిని. ప్రథనసవకిరీటీ ♦ పాలితప్రాజ్ఞకోటీ
ప్రథితవిజయధాటీ ♦ ప్రౌఢసౌజన్యపేటీ
రథగజభటఘోటీ ♦ రాజనాసీరవాటీ
పృథుబలపరిపాటీ ♦ భిన్నదుర్వాత్కరోటీ.

గద్యము.

ఇది శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ జ్ఞానప్రసూ
నాంబికా కృపావలంబవిజృంభమాణసారసారస్వతసుధాతరంగ వెంగనా
మాత్యవంశపావన విరచితవిద్యాధిదేవతాసంభావన దక్షిణసింహాసనాధ్యక్ష
తిరుమలక్షమాకాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుళుచ్ఛళిత
చ్ఛత్త్ర చామరకళాచికాకనకాందోళికాదిరాజోపచార హృద
యరంజకవచోవిహారవల్లకీవాదనధురీణవర్ణగీతాదిగాం
ధర్వస్వరకల్పనాప్రవీణ కామాక్ష్యంబికానాగనకవి
రాజనందన కలితసకలబాంధవహృదయరంజన
శ్రీకర కవితాకర సుజనవిధేయ శ్రీకామే
శ్వరనామధేయప్రణీతం బైనసత్యభామా
సాంత్వనం బనుమహాప్రబంధంబు
నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.



# సత్యభామాసాంత్వనము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీ పరిపూర్ణకలాపా
గోపవతీకుసుమచాప ♦ కుటిలశాసమద
శ్చాపలదీపితవిమల
వ్యాపారదురాప ముద్గల ♦ క్ష్మారిభూపా !

తే. గీ. అవధరింపుము జనమేజ ♦ యక్షితీశ్వ
రునకు [1]నలవ్యాసమునిశిష్యుఁ ♦ డనియె నిట్లు
సజ్జఁ గొలువున్న పసిగాపు ♦ సామిసరస
తామరసపత్త్రనేత్ర లం ♦ దఱు వినంగ.

కం. వినవచ్చె వాద్యరవ మొక
టనితరసాధారణముగ ♦ నాకసమున నా
నినదంబు వెంబడిన క్రొ
న్ననతావులు గుబులుకొనియె ♦ నానాదిశలన్.

---

పా. 1. నావ్యాస.

ఉ. తావులవెంబడిం దగిలి♦తార్కొనెఁ దేఁటులు తేఁటిఱెక్కలం
బోవక నాఁటెఁ బుప్పొడియుఁ ♦ బుప్పొడితోఁ దగెఁ బూవుసోన యా
పూవులసోనతో మిగులఁ♦బొల్చెను కల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనుక♦వీచెను కమ్మనిచల్లఁదెమ్మెరల్.

ఉ. తెమ్మెర వీవఁగానె కడు♦తెల్లని సీవిరిగుంపు లంతటన్
గ్రమ్మెను పండువెన్నెలలు ♦ గాసినకై వడి వాడిజాళువా
కమ్మపసిండికాఁడలు చొ♦కాటముగాఁ దమహస్తపంకజా
తమ్ములఁ బూనునచ్చరల♦తండము నిండె నఖండసంపదన్.

ఉ. నిండినయాసుపర్వతరు♦ణీతతికంకణకింకిణీభవా
ఖండరవంబు కిన్నరుల♦గానము దైవతలోకవంది వా
క్పండితసిద్ధసాధ్యపత♦గప్రభురత్నకిరీటకోటికా
హిండితవేత్రివేత్రములు ♦ నెంతయుఁ దోఁచె మహాద్భుతంబుగన్.

కం. అవి యటులఁ దోఁచ నిక్కిన
చెవితేజియుఁ దలఁపుటావు ♦ చెంతల నొలఁగన్
చవుదంతి వెండిమలసాం
పు వహింపుచు మందగతులఁ ♦ బొల్పుగ రాఁగన్.

సీ. తొడనుండి ఱొమి యుబ్బ ♦ దురుసుగా నునుగుబ్బ
పాలిండ్లపౌలోమి ♦ ప్రక్కఁ గుమ్మ
గుమ్మలు వేవేలు ♦ కులుకుచు నెఱమేలు
కస రెత్తువగ నూడి♦గములు పూనఁ
బూన రాచవజీరు♦పోఁడిమి గడిదేఱు
తనరునెమ్మొలు చక్కఁ♦దనము మించ
మించలవడిమేని ♦ మంచిసొమ్ములమేను
బెళకిన నొకవింత♦సొలపుఁ జెందఁ

తే. గీ. జెందడరువన్నెకడవన్నె♦చేల వల్లె
వాటు లిరుగడ నొకనీటు ♦ చాట మణివి

మానమున శౌరిఁ గనఁ గోరి ♦ మస్తుమీఱి
సరగునను వచ్చె నటు చేరి ♦ జంభవైరి.

ఉ. వచ్చి విమానముం డిగి త్రి♦వాసులు దిండ్లు పరంగివీఁటలుం
జిచ్చలు ముందుగా నడువ ♦ నీలపురాబిరడల్ పొసంగఁ గ్రొం
బచ్చలచిల్క కెంపురవ♦పావలు మెట్టి పులోమకన్య చె
య్యిచ్చిన నాని యాబుధను♦లేంద్రుఁడు రాఁ గని విస్మితాత్ముఁడై.

సీ. చేరి రుక్మిణియిచ్చు ♦ చేలాగు రహిఁ బూని
సత్యమూ పొకయింత ♦ నందిటాని
మఱి జాంబవతియిచ్చు♦మడుపు వాతెర నంది
పొంత రవిజగుబ్బ♦పోటుఁ జెంది
భద్రతోఁ బౌలోమి♦బా గాగడము చేసి
యోరటిల్లి సుదంతఁ ♦ జేరఁ దీసి
విరులచే నలమిత్ర♦విందవేనలి రువ్వి
సరగ లక్షణనీవి ♦ సడల నవ్వి

తే. గీ. యుదిరిపీడెము వెడజాఱ ♦ సొగయలు మీఱ
సిగను పింఛంబు నటియించ ♦ సొగసు మించ
పకాను లొనగూడ హారంబు ♦ లల్లలాడ
లేచె బలుసేవ నాసవ్య♦సాచిబావ.

కం. పడఁతి యొకతె కుచభరమున
జడియుచు మై వంచి పట్టి ♦ సమ్మాళిగలం
దొడుగం బదములఁ గొని యె
క్కుడురాజస మొప్ప నెదురు♦కొనె నయ్యింద్రుం.

ఉ. అత్తఱి సజ్జక్రింద నను♦రాంతకుకట్టికవారు జాళువా
బెత్తము లాని యంతటను♦బెట్టు బరాబరి సేయ బెట్టుపై
హత్తినరాజలోక మకు♦రావళియుం మకుటంబు లూడఁగాఁ
దత్తర మంది వీఁగ వని♦త ల్బలవైరియుఁ దక్క దవ్వులం.

మ. పురుషానీకము లట్లు పోవ వికచాం♦భోజేక్షణల్ ప్రేమతో
నిరువంకం గొలువన్ బలానుజుఁడు న♦య్యింద్రుండు సంధించి యి
ర్వురకే ల్గేలను గీలుకొల్పి తమపు♦వ్వుంబోఁడు లాలింగన
స్ఫురణన్ సేమము దెల్పఁగా నెనరుసొం♦పుల్ చూచి సోత్సాహుఁడై.

తే. గీ. నరగ నటు వచ్చి మేరుమం♦దరములట్లు
భోజకన్యాశచీముఖాం ♦ భోజముఖుల
తోడ నిరుగడ దిండ్లు వె♦న్నాడఁ జేరి
యొఱపుమీఱఁగ సరిగద్దె ♦ నుండుటయును.

సీ. శశిరేఖ మునుమున్న ♦ చలువలు సవరించెఁ
జేరువ హారిణి క♦స్తూరి నించెఁ
జెలువుగా నలతార ♦ చేరుచుక్కను దెచ్చె
హేమ కాంచనసుమ♦దామ మిచ్చెఁ
జిత్రరేఖ ఖాకవన్నె♦చీర లియ్యఁగడంగె
రంభ సిరముకప్పు♦రం బొసంగె
మంజుఘోష కడింది♦మణులపెండెముఁ జేర్చెఁ
గోమ రొండు సుగుణ హా♦రములఁ దార్చెఁ

తే. గీ. బ్రాహ్మితోఁ దక్కు-కొమ్మలు ♦ పారిజాత
కుసుమఫలజాల మొసఁగిరి ♦ గోపబాలు
రందుకొన నాదరము మీఱి ♦ యన్నగారి
సన్న సేయంగ గోవిందు♦సముఖమందు.

ఉ. కానుక లట్లు వజ్రి సుర♦కాంతలచే హవణింప నింపుగా
మానసమందుఁ గ్రందుకొను♦మక్కువ పిక్కటిలంగఁ గల్పవ
ల్లీనవమంజరీమధురుఁ♦[1]రీలహరీతతిరీతి దాఁచ నె
డానన మించె శ్రీపతి యు♦దారముదారచితోక్తి వైఖరిన్.

ఉ. నీ కెన యెవ్వ రయ్య ధర♦ణీధరశాసన నీదువాసనన్
లోకము లెల్ల ధన్యము ల♦భోలత మించిననీప్రభావ మ

పా. 1. రీలహరీసహరీతి.

ప్రాకృత మానుని న్నుఁ గన•రాదు మునీంద్రులకైన నట్టిచోఁ
బ్రాకృతులైనగోపకుల•పై దయ సేయుట వింత లయ్యెడిన్.

సీ. భోగమా సుతనూ•పయోగ మారసి చూడ
భాగ్యమా యజరోప•భోగ్య మెన్న
ధామమా త్రిభువన•భీమ మారసి చూడ
శాంతమా కరుణాని•శాంత మెన్న
సుకృతమా యనుదిన•ప్రకృత మారసి చూడ
ధైర్యమా యరిజయా•వార్య మెన్న
శీలమా గుణగణా•వాల మారసి చూడ
సారమా పటుజయో•దార మెన్న

తే. గీ. నన్ను నోయన్న పొగడ న•న్నన్నయన్న
లువ కయిన శక్యమే నీదు•హావణు లహహ
లలనతో నీవు వచ్చుట•వలన నింద్ర
తనరికెలు నిండె నేఁ జేయు•తపము పండె.

మ. అన నాపల్కుల కుబ్బి చాల మదిలో•హర్షించి హర్షించి స్వా
సనువొందుంబడినూలుకన్నులు ప్రఫు•ల్లాంభోజరేఖాక్రమం
బున రాణించఁగ బాకశాసనుఁడు సొం•పు ల్నింపఁ గాలోమి తా
నును కంసాంతకుతోడ నిట్లనియె నెం•తో యోర్పు సేర్పుం దగన్.

కం. గోపకులమీఁదిదయచేఁ
బ్రాపించితి నంటి వీవు • బళి యిది [1]వింతా
గోపకుఁడ నేను గానా
గోపాధిప నిన్నుఁ జేరఁ•గోరఁగఁ దగదే.

ఉ. వర్షము నించి గోపపశు•వత్సకులంబుల నిన్ను మున్ను దు
ర్ధర్ష భయంబునం గలఁచఁ • దత్సమయంబున లోకరక్షణో
త్కర్షము చాల వ్రేల గిరిఁ•దాలిచి తప్పు సహించి నన్ గృపా
వర్షము నించి పంచుటలు • వారిజలోచన యే నెఱుంగనే.

పా. 1. వింతే.

కం. [1]వత్సపశు గోపతతి నొక
వత్సర మెందెందు దాఁచి ♦ వంచితుఁడై నీ
వాత్సల్య మందె విధి శ్రీ
వత్సా నే నెంతదొడ్డ ♦ వాఁడను చెపుమా.

మ. దివికిం బట్టపురాజుఁ జేసితివి యా ♦ దిక్పాలక శ్రేణిలో
నెవరిం బోలుదు నీకటాక్షవిభవం ♦ బెం తంచు వర్ణింతుఁ గౌ
రి వరం బి మ్మన నిత్తు వాశ్రితులకున్ ♦ సృష్టిస్థితిధ్వంసక
ర్తవు సర్వజ్ఞుఁడ వైనఁ జెల్పెదను నా ♦ రాకల్ దయాంభోనిధీ.

సీ. చనవరు లైనట్టి ♦ సనకసనందనా
దుల వెంటఁ దిరుగాడి ♦ యలయ లేక
ప్రియముఁ జెప్పిన నుబ్బ ♦ జయవిజయులదండ
గోలల కగపడి ♦ క్రుంగ లేక
గర్వించుసముఖపు ♦ ఖరసానిదాసరి
జోడిగలిండ్లకుఁ ♦ బోవ లేక
చూచిచూడనియట్లు ♦ చొలయువిష్వక్సేను
నొద్ద దీనతఁ గాచి ♦ యుండ లేక

తే. గీ. జడిసి యేప్రొద్దు నుముఁ బ్రోచు ♦ కడఁక మఱచి
యంబిపురి లచ్చికౌఁగిట ♦ నాని చొక్కు
నల్లవై కుంతిపతిఁ జేర ♦ నళికి కృష్ణ
చేరితిని నిన్ను శ్రీమంతుఁ ♦ జేయునన్ను.

కం. అంబురుహాక్షా తొలి కన
కాంబరుఁడవె నీవు జగతి ♦ నది యెఱుఁగనకో
యంబరచరచంద్రునకును
బింబితచంద్రునకుఁ దెలియ ♦ భేదము గలదే.

తే. గీ. భక్తసులభుండవై నీవు ♦ బాలురైనఁ
బ్రౌఢులైనను గరుణింతు ♦ వనుదినంబు

పా. 1. వత్సతతి గోపతతి.

నచటికొల్వున రాజన ♦ మధికముచటఁ
జేరుదళవాయి మముబోంట్లఁ ♦ జేరనీఁడు.

ఉ. పెక్కులు గావు నాదయిన ♦ పెద్దతనంబున కేమి మాటికిన్
దిక్కని నిన్నె నమ్మితిని ♦ దీనులఁ బ్రోచుట నీదుసొమ్ము నే
దక్కితి నీకు దేవరవు ♦ తండ్రివి రుక్మిణి కన్నతల్లి యీ
తక్కిన కోమలుల్ సవతి ♦తల్లులు నిక్కము దానవాంతకా.

శా. శ్రీమంతుం డయి కానివానివలెనే ♦ చిత్రంబుగా దానవ
స్తోమోద్యన్నర కాసురాహవభవ♦ద్దుస్సాధ్యబాధావృత
స్థేమంబై యమరావతీనగర మా♦ర్తిం జెందఁ నేజూచుటల్
సామీ యే మని విన్నవింతు మదిలోఁ ♦ జాలా భయం బయ్యెడిన్.

సీ. పురవీథి వచ్చున♦చ్చరలపాలిండ్లపై
పొక్కి గోరులు నాట ♦ నొక్కి నొక్కి
మొక్కడెక్కడఁ గన్న♦జక్కులప్రోయాండ్ర
చిగురువాతెరగంటు ♦ చేసిచేసి
కడతొలంగినఁ బోక ♦ గంధర్వకాంతల
నామున కౌఁగిట ♦ నానినాని
విడిమేనులుగ నిల్చి ♦ వినువాఁక సిగాడు
పన్నగాంగనలను ♦ బట్టిపట్టి
తే. గీ. కనినకడ డాఁగుకిన్నర♦కమలముఖులఁ
జెనకి యలయించి వెతఁ జేసి♦చేసి యఘుకు
దీటి గడిదేటి నరక♦దైతేయరాజ
సేన పగఁ జాటి నావీటఁ ♦ జేసె లూటి.

సీ. పోతరమ్ముల దేవ♦పూజాగృహమ్ముల
బెట్టుగాఁ దేజీలఁ ♦ గట్టువారు
నడువీథిఁ దమకు సం♦దడి యయ్యె నని ముది
జడదార్ల ముచ్చెల ♦ నడుచువారు

నలుగడ బ్రహ్మచా♦రులఁ ద్రోసి పొలదిండి
తొత్తులఁ గలయించి ♦ దూఁకువారు
చలమున బ్రహ్మని♦ష్ఠులఁ బట్టుకొని యూఁగ
డించి బరువులు మో♦యించువారు
తే. గీ. నగుచు నందనవనిచెట్టు♦లఁ గలమెట్టి
సురవరుల నెల్లఁ గట్టి యు♦క్షులను గొట్టి
మాలికలు పీడఁ దట్టి సం♦భ్రమము దొట్టి
తిరుగుఁ బురిలోన నెల్లదై♦తేయసేన.

సీ. అల తిలోత్తమ చాల ♦ గులగులలై మిట్టెఁ
బ్రమ్లోచికిని నీటు♦ బవిళ్లి వుట్టెఁ
గడు ఘృతాచికి వీలు♦నడుము చక్కఁగరాదు
మేనక కీఁక నయో ♦ మేను గాదు
చిక్కెమహోరంగ ♦ ప్రక్కగోరులలావు
శారకు దగ మించి ♦ తీరెఁదావు
ధ్రుతమంజరికి నంత ♦ దొడుగుదీయక హెచ్చెఁ
బెనుగంటిచే హేమ♦పెదవి విచ్చె
తే. గీ. నెందు నిటువంటిలంజెర్క ♦ మెవరుఁ జూడ
మందు రవ్వటి కేరిలో ♦ నసురభటులు
సుదతులను బట్టి కులుకు దీ♦ర్చుకొని విడుచు
నపుడు తల్లడమున నల♦యమరు లెల్ల.

చ. ఇటువలెఁ బౌరులుం బురము ♦ నేను భయంబున నెన్నియేఁడు లు
త్కటరిపుబాధలం బడి వ♦కావక లొందుచు ధాతవెట్టిము
చ్చట నెఱ వేఱు టాయెఁగద ♦ సామి పరా కొనరించ నాయమా?
కటకట యింకనైన దయఁ ♦ గావఁగదే జగదేకనాయకా.
తే. గీ. మొదలిరాకాసిసేఁతలు ♦ గదిసినపుడు
పిదప పొలదిండిజగజెట్లు ♦ పెరిఁగినపుడు

నెత్తి పోయినయట్టి మా ♦ యిల్లు నిలిపి
తీళ యిప్పటి నరకున ♦ కెంతచింత.

కం. అన విని యతనిమహత్త్వము
వినయోక్తుల దీనదశయు ♦ వివరించి సదా
ఘనముగ నమ్మినవాఁడని
మనమున హరి యెంచి నిండు♦మక్కువఁ బలికెన్.

ఉ. ఇంతవిచార మేల విబు♦ధేశ్వర యీపని యెంత ముజ్జగం
బంతయు నీదుకోపమున♦ కాఁగునె తమ్మునిమీఁది కూర్మిచే
నింతయుఁ బల్కి తీ వసుర ♦ యెచ్చటి కేఁగిన నెందు డాఁగినన్
దుంతవయాళిరౌతుపురిఁ ♦ ద్రోచెదఁ గాచెద లోక మంతయున్.

కం. నవముగ సమరాలంకృతి
హావణించుటకంటెఁ బ్రకృత ♦ మైనవసంతో
త్సవము నెఱవేర్చి మఱి దా
నవుపై దండెత్త వలయు ♦ నముచివిరోధీ.

కం. ఈయుత్సవమున నచ్యుత
సాయకునకు శైలసుతకు ♦ సంతోష మగున్
శ్రేయంబు గలుగు మనల క
జేయతయుం గలుగు రిపులఁ ♦ [illegible].

తే. గీ. ఇంద్ర! యింద్రాణియును నీవు ♦ నీజయంతుఁ
డచ్చరలతోడ నీడకు ♦ వచ్చినపుడు
తరుణచంద్రావతంసుజా♦తర ఘటిల్లె
నస్మదీయమనోభీష్ట ♦ మతిశయిల్లె.

వ. అనిన వినీతియు వేడుకయుం గ్రందుకొన నమ్మహేంద్రుం
డుపేంద్రుని కిట్లనియె.

మ. కరిసంరక్షక వైరిశిక్షక హరీ ♦ కంసారి యోరాజశే
ఖరుఁడీవే నినుఁ జూచినప్పుడె కదా ♦ కల్యాణముల్గల్గె నేఁ

బురికిం బోవలెఁ బోకయున్న దితిభూ♦పుంఖానుపుంఖాతిదు
ర్భరనారాచములన్ కపాలమయి స్వా♦రాజ్యంబు భోజ్యం బగున్.

కం. అనిచిన జయంతు నచ్చర
వనఁబోఁడుల నచట నిలిపి ♦ నగరికి హరిచం
దన సంతానసుమాదిక
ఘనసురభిద్రవ్య మంపఁ♦గల నీ కెపుడున్.

తే. నావుడు సంతసించి యదు♦నాథుఁడు కస్తురి కుంకుమంబు క్రొం
బూవులు బోంట్లు దేహళికిఁ♦బూసి యొసంగ నతండు నట్లు సం
భావన సేయ నియ్యకొని ♦ మక్కువతో సరిగంచు మంచిచెం
గావుల నిచ్చి లేచి దయఁ ♦ గౌఁగిటఁ జేర్చుచు నంపె వాసవున్.

కం. అనిచిన జయంతు నచ్చర
వనితల నట నిల్పి కదలె ♦ వాసవుఁ డంతన్
వనజదళాక్షునిసదనం
బున కంచుకి యిట్టు లనియె ♦ మోదము మీఱన్.

తే. శ్రీరమణా యుమాపతికిఁ ♦ జేయుమహోత్సవ మెల్లఁ గన్గొనన్
మేరు వనేకరూపముల ♦ మేలిమితో నట నిల్చెనో యనన్
దేరె నభంబు శృంగముల ♦ దీటుచుఁ బైఁడివసంత మాడుచున్
తేరులు తేజరిల్లెఁ బురి♦దేవత లందఱు నుల్లసిల్లఁగన్.

సీ. కలధౌతదళసౌధ♦ములయూథములె యెందుఁ
గుంకుమకొలఁకు లే♦వంకలందు
ఘనసారహిమపూర♦ఘనకటాహము లెందు
విరితేనెదొనలు లే♦సరఁబులందు
మగరాలనిగరాల♦మలఁచుమార్గము లెందు
విధుశిలావేదు లే♦వీథులందుఁ
గలువరాచలువరా♦చలువ లేకడలందుఁ
బూవుచందువలె యే♦త్రోవలందు

తే. గీ. నిచ్చలును మెచ్చ నగుగచ్చు • సొచ్చుపీలు
రవలపచ్చతోరణము లే•రచ్చలందుఁ
గ్రందుకొన నిందిరాదేవి • చిందు లెనసె
ననఁ దగుపురంబుశృంగార • [1]మద్భుతంబు.

వ. మఱియు నవ్వాలివ్వాల నివ్వటిల్లుపువ్వు పందిళ్లనీడలఁ బరిమళ మంజిమను రంజిల్లుకుమంజిమను పన్నీరు చికిలించుజాడల నెడతెగక యడరు నడపావడలును, పావడలమీఁదఁ గ్రమ్ముమొలకతెమ్మెరలకప్పురంపుసుమ్ము గ్రమ్మరింప ఘుమ్మను తావిముమ్మరంబునకుఁ దానె తలయూఁచునగ మెదలిమెదలి నటించు నేడాకులయనఁటికంబంబుల నెడనెడం గూడిన రస దాడిచెఱకుదడులును, చెఱకుదడికురుంజులఁ జులుకగానంటు నంటిసేరుప్పు లును నంటిమేరువులనుంగిలిముగిండ్ల రంగుమీఱు బంగారుగేసు చెన్కప్పు చిక్కుపనినిక్కు తడికచిక్కొమ్మ లావరించు ఘన్నవ్వట(?) సనిబవరిగొన్న సన్న జాజిజల్లుల నల్లసిల్లునల్లకలువచప్పరంబులును చప్పరంబులకెదురుకట్ట నిండుఫు సుద్దదిద్ద జానొందునౌమఖానా నిండి దండిగ నంబరంబున నుప్పొంగించు (?) ళించు గొప్పధారలుగల జలయంత్రంబులును, జలయంత్ర(?)రణీ కృతావలంబ జంబీరనారంగనాగపున్నాగమాతులుంగలవంగపచేళిమ (?)దీర్ఘ మదాళిమ ఫలకేళి మనోహరకీరవీరవారమ్ములును, నచట (?) కెందమ్మికప్పడగొప్పకప్పరపు పూఁతసెజ్జలును నా(?) సజ్జలును, వాటినికటంబున పంబుచూపు సపురుచిప్పరు (?) నుంచినమంచియావజమ్ములు, నావజమ్ములసరసనీటుచాటిమీటు సురభా నులు మెఱుంగుచెందొవరేకుసింగాణులు కుసుమశరశ్రేణులు కుంకుమవంక ణులు రాణించుమసంబున జంకులు దొలంక చేకానుకలానుక శ్రీమంతు లగు మంతు లంతంత సందడింప నల్లకుమారలోకంబు నల్లుంద్రప్రకంబు తమతమహాజారంబులసమీపప్రదేశమ్ముల సకలవస్తూపహారమ్ములు హావ ణించుకొని నిలువఁ గలువకంటు లారలిపల్లెరంబులు చేఁబూనుకొని యున్న వారు కన్నవా రండఱు వెఱఁగంద నయ్యవసరంబున.

---

పా. 1. మబ్బురంబు.

చ. గొడుగులు నాలవట్టములు ♦ కుంకుమకస్తురినీటితిత్తులున్
సిడములు జాళువాపికిలి♦చెండులు నీఁటెలు పైఁడియందెలె
క్కుడువగ వేత్రముల్ మొరట♦కొమ్ములు చిమ్మనఁగ్రోవు లాని ని
ల్కడసొగ నూని బోగము వె♦లందులు వేవురు వెంట నంటఁగన్.

సీ. కంకణమణిఘృణాం♦కణమణిగణధగ
ద్ధగలు కుంకుమవసం♦తములు చల్ల
గళసీమగళదన♦ర్గళనీలధళధళల్
దనరుకస్తురివసం♦తములు చల్ల
నెలరాలజిగి గ్రమ్మ♦నెమ్మేని నిగనిగల్
తావిగందపువసం♦తములు చల్ల
రాణించుబంగారు ♦ వీణెల మిసమిసల్
తళుకుపసపువసం♦తములు చల్ల

తే. గీ. గంటసనయఁ బొల్చి జాళువా♦యందెఁ దాల్చి
హావణికలు మీఱి పైఁడిసే♦రువులదారి
పర్వతకుమారితోఁ గూడి ♦ బయలుదేరి
చెలులు సమరియుండెఁ దరుణేందు♦శేఖరుండు.

తే. గీ. అనిన విని యంతిపురిఁ జేరి ♦ యనువుమీఱ
చెలులు గై చేసికొని చెంత ♦ నిలిచినంతఁ
గొలువుసింగారములఁ జెందు♦కొండ ఱేండు
ముఖు లెదుటఁ జేర మదిని స♦మ్మదము మీఱ.

సీ. అరజాలుసిగమీఁద ♦ విరిమొగ్గసరి చుట్టి
జాళువాజంటరు♦మాల గట్టి
సొగసుకస్తురిపట్టె♦సోగనామము దీర్చి
మెసలెడుకుంకుమ♦మెఱుఁగు గొనర్చి
డంబుముత్యపుచేస♦రం బొకచే నాని
చీనాగొలుసు లొక్క♦చేతఁ బూని

పాలకాయొంట్లును ♦ బావిలీ ధరియించి
ప్రోదిగాఁ జెవుల జ♦వ్వాది నించి

తే. గీ. తళుకుజిగిమించు సరిగంచు♦తమ్మిపూల
వ్రాఁతపనిదుప్పటిని వల్లె♦వాటు వైచి
కడఁక తగ నెంచి కొల్వుసిం♦గార మిటులు
చేసికొనె శౌరి యెన లేని♦చెలువుమీఱి.

తే. గీ. వెనుక నెదుటను నిలిచిన♦వెలఁదు లెల్లఁ
దనమొగముఁ జూడ సామియం♦దంబుఁ జూచి
కోమలజడ్రవేటులును పచ్చ♦గోళ్లసోఁకు
లెన్ని చూచిన ననఁ డేమి ♦ యెన్నుఁ డపుడు.

వ. తదనంతరంబ నితంబినీనికురంబ విలంబమానమణిమేఖలాకలకల మ్ములును, కంజాననాచరణకంజసింజానమంజుమంజీరఝుళంఝుళంబులును, పంకజముఖీ పాణిపంకరుహచంకనత్కనక కంకణ ఝణ ఝణత్కారంబులును, విధుముఖీజన కబరీ నిబిరీ సమురువక కురువక ఫుల్లమల్లికాగంధానుబంధగంధోదయ పుష్పంధయస్తసంధయ ఝుంకారంబులును, విచిత్రతర వేత్రిణీలోకవిజ్ఞాపిత విజయహూంకారంబులును, వివిధహృద్యవాద్యసన్నాహ సమయచిరత్నానిరళనాదంబులును, గ్రమ్ముకొన నమ్మానవతులును కమ్మ విలుకానిఁ గన్నసామియును ముందుముందుగా నానందసంబు ఛందంబునఁ గ్రందుకొనఁ జెందిరపువన్నెగందపుపొళ్లచెందమ్మిరేకులచల్లు లాపంసగి నగరెల్ల ఘూర్ణిల్లె నంత.

ఉ. ఫౌజులు రాజులుఁ౯ నగరి♦బైల రయమ్ముగ నేఁగఁ దత్పుష్కరాం
భోజదళాక్షులుఁ౯ చిఱుత♦బోడికలు న్నికటోర్వి రాఁగ నా
నాజనులుం దొలంగురవ♦ణంబున కట్టికవారు గొల్లలుఁ౯
రాజపథంబునం గడుబ♦రాబరి సేయ మహాద్భుతంబుగ౯.

సీ. బలుగొల్సు లెనయించి ♦ బండ్లపై నుంచి కుం
కుమ నించుబంగారు♦కొప్పెరలును

కాపుగుబ్బెతగుంపు♦మూపులపై నుంపు
గందంపురతనాల ♦ బిందియలును
చిఱుతనీమందంపు ♦ చేఁ బూనుపవడంపు
గొనబుకస్తురిగాజు♦కుండలవలు
జతగూడి వెలిబొక్క♦నమువారిచేచక్కి
హావణించువన్నెగం♦దవడితట్ట

తే. గీ. లావెనుక సూడిగమ్ములఁ♦హాస్తములను
గచ్చుతట్టలరాణించు ♦ కలువపూల
చెండ్లు పలువన్నెపన్నిటి♦గిండ్లు తావి
విరులు నేతేర నెనలేని♦వేడ్క మీఱ.

తే. గీ. తనియఁ గన్నాఁగి వెన వసం♦తమునఁ దోఁగి
సొరిదిగా జొత్తుపావల♦సొబగు హత్తు
వింతదగునీధి నిరుగడ ♦ వెడలె నంత
సొగసు వెలయింపుహరికొల్వు ♦ సూళెగుంపు.

ఉ. మన్ననయమ్మగారు లొగి♦మానికపుంజిగిపేరు లాని ము
న్నున్నుగఁ బోవ నావెనుక ♦ మూవరసాసులు సందడించఁగాఁ
గన్నెలు వేనవే ల్మరుని♦కైదువలో కడవన్నెబొమ్మలో
వెన్నెలసోగలో యనఁగ ♦ వెంబడిగా నడతేర నిచ్చలుల్.

సీ. భృంగఝుంకారంబు♦రీతి నుపాంగంబు
ఘు మ్మన ఛక్క ఢిం♦ఢి మ్మనంగ
నిల్చి నాదించుతం♦త్రీవాద్యములసుతి
ఘు మ్మనఁ జెంగుత♦ఝ్ఝ మ్మనంగఁ
జిఱుతమద్దెలతోడి ♦ చిఱువీరణపుసద్దు
ధిమ్మన దిమ్మొధిం♦ధి మ్మనంగ
జిలుగైనవరలహో♦చ్చలు శేషనాదమ్ము
ఝు మ్మన నిల్వుతోం♦ఘొ మ్మనంగఁ

తే. గీ. జంద్రవలయమ్ము సారంగ ♦ జవిలిబాజ
మురళి ముఖవీణె తిపిరి కి♦న్నెర కమాచి
తాళమును వేటుగజ్జెలు ♦ దవిలి రక్తి
గుల్కఁ గంధర్వమేళంపుఁ ♦ జెలులగుంపు.

తే. గీ. సరససాంబ్రాణిధూపముల్ ♦ చౌకళింప
గెలుపుపద్యంబులను వంది♦నులు నుతింపఁ
గెలన నుడిగంపుజవరాండ్రు ♦ కెలసి చూడఁ
బసిఁడిపావడ లాడ రా♦జసముతోడ.

మ. ప్రపదం బానుక కుచ్చెలల్ మెఱయఁగాఁ ♦ బాలిండ్లపై పై నొయా
రపుపైఁట ల్వెడజాఱ లేనగవు మీ♦ఱ న్వచ్చి దేవేర్లు నె
య్యపుమాటల్ పలుకంగ రాధ యడపం♦బానంగ బ్రేమాలక్ష బరా
కు పరా కంచును వేత్రిణుల్ పలుక వ్యా♦కోచస్మితాబ్జాస్యుఁడై.

సీ. మెఱపులఁ దళుకొత్తి ♦ నెఱతనంబున హత్తి
వలగొన్న యల నీల♦జలధరంబొ
సొలపులసొంపెక్కి ♦ పలుచుక్కఁగమి నిక్కి
సరస దొరయనుండు ♦ చందురుండొ
మిసమిసల్వాలయింపు ♦ పసిఁడితీవియగుంపు
పొదలియుండెడు కల్ప♦భూరుహంబొ
మణిశలాకలు నిండ ♦ మలసి బెళ్కుచునుండ
నలువొందు నల రోహ♦ణాచలంబొ

తే. గీ. యనఁగ శృంగారసర్వస్వ ♦ మవని ముంచి
మించి కంటికి సాక్షాత్క♦రించి నటులు
పొగరుచిగురాకుఁబోండ్లతో ♦ నగరు వెడలె
మందరధరుండు మన్మథ♦మన్మథుండు.

మధురగతిరగడ.

అప్పుడు శ్రీపతి ♦ నాత్మల మెచ్చుచుఁ
గప్పురగంధులు ♦ కడఁకల హెచ్చుచు

మునుకలు గను జను♦ముగుదలఁ గనుఁగొని
వెనుకొని యరసెడు♦వెలఁదులఁ గనికని
చెలిమియు బలిమియుఁ ♦ జెలఁగఁగ మఱిమఱి
యెలమిని నొండొరు ♦ లిట్లని పలికిరి
పైఁబడ నేటికె ♦ పంకరుహేక్షణ
ప్రాఁబడె నీ కీ♦పదటము లక్షణ
చెనకుచు హరి ద్రో♦చిన నేఁ ద్రోచితి
ననవచ్చెదు నీ ♦ వదె సాత్రాజితి
చిత్రముగా హరి ♦ చెనకిన నేటికి
మిత్రవింద నీ♦మొరమొర లేటికి
నాడెను రుక్మిణి ♦ హరితో ముచ్చట
యేడ దమ్మ మన ♦ కీలవ మిచ్చట
కందువతోఁ బతి ♦ గనె నంతంతకుఁ
జిందురవారము ♦ చేరె సుదంతకు
కౌతుకనడలు పె♦క్కులు జాంబవతికి
హితవులు గలయది ♦ హృదయమునఁ బతికి
సారె చూపు మొగ ♦ మరసెను భద్రకు
నేర మయ్యెఁగదె ♦ నిన్నటినిద్రకు
చుట్టుక హరితో ♦ సూరకుమారిక
గుట్టుబయలుగా ♦ గొణిగెను శారిక
యీయెడ రాధిక ♦ యెంతటిచిన్నది
మాయురె హరిమెడ ♦ మలయుచునున్నది
కోమలవల్లికిఁ ♦ గొసరుచుఁ జేరెను
సోమునిబావకు ♦ జుమజుమ మీఱెను
కలహించుట నీ♦ఘనతకు మేలా
కలభాషిణి నీ♦గాయక మేలా
మందరధరుపై ♦ మమతలు ద్రోయకు
చందనరేఖిక ♦ చనె నాచాయకు

సదమదముగ నిదె ♦ సందడిఁ గూడెను
కొఁదవే దానికిఁ ♦ గుబుసము వీడెను
పసుపడ హరిచే ♦ బంతులరువ్వులు
మొనసెను దానికి ♦ ముసిముసినవ్వులు
నెలఁతకు నూరక ♦ నీవిక జాఱెను
పొలుపుగ హరితలఁ ♦ పులు చేకూరెను
పడఁతికి గుబ్బల ♦ పైఁట తొలంగెను
కడుతమి హరి క ♦ గ్గలమై పొంగెను
మున్నుగ నది విరి ♦ మొగ్గలఁ జల్లెను
వెన్నునిమదిలో ♦ వేడుక చల్లెను
నావుడుఁ దమి మ ♦ న్ననయుం గాటము
గా వెలయఁగ హరి ♦ గనె సయ్యాటము.

తే. గీ. అటుల సయ్యాటములఁ దేలి ♦ యదుకులాబ్ధి
పూర్ణచంద్రుడు శృంగార ♦ పూర్ణుఁ డగుచు
నగరు వెలువడి నెఱనీటు ♦ నడలతోడఁ
జెలులతోఁ గూడఁ బురవైరి ♦ చెంతఁ జేరి.

ఉ. నారులపాట యచ్చరల ♦ నాట్యము చంద్రవతంసుచందముం
దేరులయందముం బురము ♦ తీరును వీథులసౌరు నెంచి లో
సారెకు మెచ్చి విస్మయము ♦ సమ్మదముం బొదలంగఁ దాను శృం
గారవతీజనంబులు జ ♦ గద్విదితప్రతిభానుభావులై.

తే. గీ. శివునకును మ్రొక్కి యనుపమ ♦ శ్రీల ♦ జొక్కి
యిందుధరుసమ్ముఖమున నొ ♦ క్కెడను నిల్చి
యాదిని జయంతుఁ బ్రద్యుమ్ను ♦ నర్జునాది
నృపతులను బిల్చి కుంకుమ ♦ నీటఁ దేల్చి.

కం. ఆవెనుకఁ గవివరేణ్యుల
నావెనుకన్ బుధులు గాయ ♦ కావళిఁ గరుణా

భావనచందనజలధా
రావితతిఁ ముంచి పనిచె ♦ రాజస మొప్పన్.

ఉ. ముందుగఁ బోవఁ బంచె నల ♦ ముగ్ధశశాంకకళావతంసు నా
సందడిఁ బోయె నచ్చరల♦సంఘము బోగపుటింతిగుంపు తా
మందగతుల్ తగ న్వెనుక♦మానవతు ల్గొలువన్ బ్రతోళికా
ళిందమునం జెలంగి మరు♦లీల వసంతము లాడి వేడుకన్.

కం. పీడక శౌరి వసంతము
లాడన్ కుంకుమరసంబు ♦ లపుడు రహించెన్
జూడంజాలక సవతుల
సూడున మహి క్రోధరసము ♦ చూపెడు మాడ్కిన్.

తే. గీ. ఉదయభాస్కరు మొరయించి ♦ యువిద యొకతె
శౌరిపైఁ గల్వపూబంతి ♦ సరగ వైచె
నెలఁతపై నొక్కతన్వి ప♦న్నీరు నించె
నేసెఁ గల్లరిగొల్ల నా♦యికకు వెఱఁగి.

తే. గీ. శ్రీరుచిగురాకులందె ప♦న్నీరు నించి
యచ్యుతుఁడు నొక్కకొమ్మఱొ ♦ మ్మవ్వళించి
యింతి మర్మంబు విడు మని ♦ హెచ్చరించె
నిఱుకుచనుదోయినడుచక్కి ♦ చఱచినట్లు.

ఉ. తమ్మిలకోరిఁ దాల్చుదొర♦తంద్రికిపై నెరయాళి జాళువా
చిమ్మనఁగ్రోవి నొక్కచెలి ♦ చేతులకొద్దిని చిమ్మఁ జిమ్ముతోఁ
గ్రమ్మి యురమ్మునం దొరగు♦[1]కప్పురపుం జెలినీరు వోల్చెఁ జి
త్తమ్మున నున్నచంద్రమనిసు♦ధారసముల్ వెలిఁ దేరుకై వడిన్.

తే. గీ. మదనజనకునిపై నఘా♦మనులు చూడ
నెదుటఁ గస్తూరి నీ రొక్క♦యింతి చల్లెఁ
గంసశాసనుఁ డప్పు డా♦నందు వెఱఁగి
గ్రక్కున మరల్చెను కళింద♦కన్యనీరాడ.

పా. 1. కప్పురపుంజలినీరు.

సీ. బాహుమూలశ్రీల • పసపువసంతంబు
దోళుక లేఁగాను దో • ష్ఠోన యుళుక
కడకంటిచూపుల • కలువవసంతంబు
చిందఁ దోడవునవ్వు • చికిలి చెందఁ
బలుచనిచెక్కిళ్ల • పైఁడివసంతంబు
నెఱయఁ జిగురుకేలు • నిగ్గు దోరయ
రహిఁ సమగుల లక్క • రసపువసంతంబు
చిమ్మఁ గాంచీనినా • దమ్ము గ్రమ్మ

తే. గీ. సమ్మదమ్మున నదరంటఁ • జంటఁ గ్రుమ్మి
గుమ్మివిరిదమ్మిచిమ్మనఁ • గ్రోవి తేనెఁ
జిమ్మె హరిపైని మగుడించి • చెల్వఁ బూని
రాజవదనాతిమూర్ధన్య • భోజకన్య.

ఉ. జగ్గు మనంగ జాంబవతి • సత్యయుఁ జిమ్మనఁగ్రోవు లానఁగాఁ
దగ్గకసోఁగఁ బారుహిమ • ధారలు ప్రక్కల సోఁక నుల్కుచున్
కగ్గక వెన్నుఁ డత్తరిఁ • గైదువదేవరసత్యజాతరల్
పగ్గము లాడుకైవడిని • భాసిలె వ్రేఁతలు మేలు మే లనన్.

తే. గీ. గందవడి భద్రనెమ్మోము • నందుఁ జల్లి
వెన్నుఁ డేతేరఁ జన్నులు • వెన్నునాని
యణఁచెను సుదంత మరునిగా • యమ్ము లార
హత్తి గజనిమ్మపంక్తిచే • నొత్తుకరణి.

ఉ. వాళిగ వెన్కనుండి యొక • యంగన సన్న గొమొనర్చి నవ్వ గో
పాలుఁడు మిత్రవిందచను • బాతుల కుంకుమనీట నేత్రముల్
వేళమె చిమ్మఁజిమ్మ నది • పీవసకెంజిగిజాలు వెల్లయుం
దేలెను మొల్లనై బుదోర • తేజము టెక్కము నిక్కునై వడిన్.

కం. పక్షీంద్రతురంగునిపై
వీక్షణరుచి కలువదోని • విధమున నిగుడన్

లక్షణ చల్లె వసంతము
నాక్షణమే కుచఘటంబు ♦ లతఁ డదుమంగన్.

సీ. ఒకసారి దనుజారి ♦ యుదుటుగుబ్బలపైఁట
హస్తకస్తూరిక ♦ నపనయింప
మఱియొక్కపరి హరి ♦ మాధవుళవుచీర
కుచ్చెలచేతికుం♦కుమము పూయ
వేఱొక్కసారి కం♦సారిచేనంటువై
గోవజవ్వాది చె♦క్కులను జెమర
మఱుసారి యలశౌరి ♦ కరముగంధవడిపో
నదరంటఁ బిఱుఁదుల ♦ నప్పళింపఁ

తే. గీ. జెలులనే పోఁకులను గ్రమ్మ♦చికిలిమీస
ములఁ బసపుపావడను వెన్నఁ ♦ డలమి చిమ్మఁ
జాయయునుబోలెఁ దిరిగిన♦చాయఁ దిరిగి
రహిఁ నతఁడు వంట మడు పాన ♦ రాధ వెంట.

సీ. పావడకట్టుతో ♦ భ్రమసి తొల్గెడివారు
నొగి నీవి జాఱఁ గూ♦ర్చుండువారు
రవికవీడినఁ బైఁట ♦ రహిఁగఁ జెక్కెడువారు
నది వోఁ గుచము కేల ♦ నదుమువారు
తడికోకతొడనిగ్గు ♦ లడర వ్రాలెడువారు
సవోర్చఁ దళుక్కన ♦ నణఁగువారు
కుచ్చెలనెఱికి వోఁ ♦ గొంతి కొందిగెడువారు
నాభిపైలైన వె♦న్మలయువారు

తే. గీ. నగుచు నగినగి వగవగ ♦ నిగుడుపొగరు
మిగుల బొంగసుగ మగువలఁ ♦ జిగురువిల్తు
మాయలను జొక్కఁజేసిన♦మరునిఁ గన్న
సామి తమిఁ జెందుఁ జెందునా♦సమయమందు.

సీ. రసదాడివిలుఁ బూని ♦ బిసరుహాస్త్రులఁ బూని
కుసుమాస్త్రముల నేయుఁ ♦ గొంతిసేసు
కొలఁకుల జతగూడి ♦ కుంకుమనీ రాడి
కొమల నుగ్గాడించుఁ ♦ గొంతిసేసు
బోంట్ల నేచఁగఁ జాలు ♦ భూపతిమలచాలు
వింత గన్గొని నవ్వుఁ ♦ గొంతిసేసు
చెలులకు సందిళ్ల ♦ ఫలపరంపర లెల్లఁ
గొల్లగా నిప్పించుఁ ♦ గొంతిసేసు

తే. గీ. ప్రొద్దు గడపుచు మకరాంకు ♦ వస్తు చెల్లి
నగు వసంతోత్సవం బటు ♦ లతిశయిల్లి
నెఱపి తా నెల్లపల్లవా ♦ ధరుల కెల్లఁ
దనివి సంధిల్ల నామాయ ♦ వాగినిల్లు.

వ. మఱియు నయ్యిందిరాజాని రమ్యవసంతోపవనసంగమ్ములవలనను విచిత్రతరనీహారమ్ములవలనను వినుముఖీకరారవిందనిక్షిప్తకుసుమసౌరభ ప్రవాహమ్ములవలనను హృదయమ్మున నిస్సంగానిషహారమ్ములు నొందించఁ జంచలనయనారుణారుణ పటాంచలప్రపంచితసంచారప్రతాపానలాంబుదన విశంకట సకుంకుమపంక సంకలనచంకనదకలంకనిజశరీరంకిరణజాలమ్ములను, తరుణతరణికోటిధాళధళ్యంబును గ్రమ్మించుక్రొమ్ముంచు మవ్వంపు బాగులు జాఱఁ గొమరుమీఱులావణ్యసారంబును లలితాలాపంబును మందహాసం బును మహనీయవిలాసంబును మానసోల్లాసంబును మన్మథవిలాసంబును గ్రందుకొన నరవిందముఖీబృందంబునుం దాను నమందానందంబున మంద మందగతులఁ జెందలిరుపందిళ్లఁ దోఁప నించునించు పారువంబును సురుసురుబును గొజ్జంగినీటికొలంకులును గుజ్జుమామిళ్ల వంకలును కృత్రిమ కేళీగృహవాటం బులును కృతకాచలకూటంబులును జూచి శిర మూఁచి యవ్వారిజాక్షి యలరుల నెలజాతరలఁ జాటి నగరప్రదక్షిణంబు గావించి నగరాజకుమారీశ శంకరుల మగుడ సేవించి వారల నిజనివాసంబుల కనిచె నంత సాయంతన సంధ్యారాగమ్ము వెన్నునియంగరాగమ్ములాగునజగమ్మున నిండఁ జంచకర

ఱుండు కుంకుమభరణికరణిఁ జరమగిరికడనుండె నంభోరుహంబులు వాడె వియోగిజనధైర్యంబులు వీడె నిందీవరంబులు విరిసె నిందిందిరంబులు మొరసెఁ గందర్పవీరాట్టహాసంబులు వెలసెఁ గటికిచీకటి హరిదంతంబులఁ గలసెఁ దారలు మెఱసె ధవళిమ తూర్పుదెస నెఱసె జక్కవకవలు తల్లడించె జాబిల్లి యుదయించె నంతకుమున్న వెన్నెలలనిగనిగలు హత్తుపగలు వత్తు లిరుగడల నడవ ముందుగాఁ గొందఱిందుముఖులు కరదీపికాదశసహస్రంబుల నాని పొలిచి సముఖంబున నిలిచి దిశల జాళువామొలామాలు నివ్వటిల్ల దివ్వటీసల్లాములు చేసిడాసి మారువారువమ్ములలీలల విలసిల్లు నిరుపగళ్ల బారుదేరి గ్రమ్మన సమ్మదనగోపాలుండును కలితకర్ణికార కలికానుషంగ జంగమగాంగేయశైలంబు డంబున దంతపురేకుసంతనవింతపనికడానిగచ్చు పచ్చలపల్లకినెక్కి యిరుపక్కియలఁ గ్రిక్కిఱిసి దచ్చిదేరులు తచ్చనలాడ నటనాటకశాలకేలికతోడ నాపురవీథినుండి హజారంబుఁ బ్రవేశించి యంతస్తుల మించి యపరంజియిటికెలాగడపుపటికెపుఁగంబంబుగుంపు నెఱకెంపుజగతి నిగనిగదగు మగరాలకుమడికాసురేకుజోకయిాడపు నీలపుగోడసడలఁ దురంగలించు చెంగటిముంగిటికిరీటిపచ్చపెచ్చుపసరుజిగి విచ్చలవిడి పుటంబెగయువగఁజెలంగుబంగాళిపచ్చతానకపుటింగిలీకపు వ్రాఁతతామెరపొందుఁ జెందుముత్యపుచందువాలఁ గనుపట్టి తెరమానికపురాకట్టు తొట్టికట్టినశిబికావరోహణంబు చేసి శచీవిలాసిని యనుపఁ గొందఱచ్చరలచ్చటికివచ్చి పారిజాతకుసుమబృందాది దివ్యచందనమ్ములు దెచ్చియిచ్చిన సంతసిల్లి యచ్చెలువ క్షేమరక నరకదైతేయబాధలవలన దాడి తడవుచెల్లె నని విన్నవించిన నాలకించి నగి జయంతు రావించి కటాక్షించి యంతనయ్యచ్చరలఁ దోలుతటియచ్చరల నగారి నివాసమున కనిచిన వేడ్కనప్పుడు సత్యభామ సరసత నవరస యని హెచ్చరించినలీలఁ జేలాగియ్య నడచి కనకకక్ష్యాంతరంబులు గడచి దైతేయుమీఁద దాడిచనవలయు నని యందఱు వినునట్లుగా మందలించి కందలించినపొగరు నిగుడఁ బ్రద్యుమ్న భీమవిజయసైనేయులం గాంచి వీట జయయాత్ర చాటించ విజయభేరి వేయించ నియోగించి భోజతనయాముఖనిఖిల లలనాజనంబుల నంతిపురంబున కనిచి తోరంబగు సాత్రాజితిమాణిక్యాగారంబు చేర నరిగి యందు.

ఉ. సారసనేత్ర లారతు లొ♦సంగ వసంతముచెల్వు కొల్వుసిం
గారముల న్నడల్చి యట ♦ గ్రక్కునఁ దా జలకంబు లాడి క
న్గోరులరావిరేకపని♦గోణము గట్టుచుఁ జల్వఁ దాల్చి యం
భోరుహనేత్రుఁ డందముగ♦మోమునఁ గప్రపుబొట్టుఁ బెట్టుచున్.

కం. లోలాక్షియుఁ దోడనె హా
జీలై రా నారగించి ♦ చేఁ దొలఁచి రుమాల్
పూలును కలపము తగ బా
గాలాకుమ్మడపు లొసఁగఁ ♦ గైకొని యంతన్.

శా. శృంగారించుక శౌరి చంద్రముఖమై♦సింగారమ్మును జూచి యు
ప్పొంగన్ డెందముతోడఁ జూపులు నయం♦బుల్ చాలఁజేకూర సా
రంగాక్షుల్ తనసైగ జెల్సి వెలిచే♦రన్ వేడ్క నాయంగనా
నంగాయోధనసాధనప్రమనథ♦న్యస్తొహాసనాహిఁబల్కుచున్.

సీ. పటికపుకీల్బొమ్మ♦చిటికకమ్ముచికఁ గూర్క
గుటికలపల్లకీ ♦ గొనుచు నినుచు
సురటిరెక్కలగాలి♦సోఁకులఁ నేమొన
గొడిగెఁడు నకిసల♦గుంపు నింపు
[1]సన్నసన్నన నార♦జంపు మంపులనింపు
జగజంపుజంత్రంపు♦జతలఁగూడి
కవలకుస్తుకహత్తు♦కవకవకికవకవ
రవలతో మరుచిన్న♦బవిరి దీర్చ

తే. గీ. నవులపుంజెందుచందువా♦తొవలపొంగు
తుమ్మెదమెలుంగుశ్రుతి గ్రమ్మ♦కమ్మపైఁడి
ఛక్కఘుమకారములమేలి♦గ్రుక్క లీను
హరువు మురువైన శయ్యాగృ♦హమ్ములోన.

---

పా. 1. సద్దుముద్దుల నార.

కం. విరిసుచ్చు హెచ్చుగచ్చుల
తతిమెనపగడాలకోళ్ల దంతపుపనిచ
ప్పరమంచంబున ఘుమ్మని
పరఁగెడుసేవంతిరేకు పానుపుమీఁదన్.

చ. చికిలిమెఱుంగుకెంపురవ చెక్కడపున్ జిగిడంబకంబు మో
రకొణిగె నంటఁ గట్టినజి రాపనిమేలరవిప్పదీర్ఘకో
రకములనింపు సంపఁగిక రాశము నోరతురాయిసోఁకని
య్యక వసియించుహారలత లాడఁ దలాడను చేయి యూఁదుచున్.

కం. వసియించ శౌరిసరసన్
మిసమిసమనుగబ్బిగుబ్బ మెఱుఁగుపయఁటలో
మసలఁగ నెఱమోహపురా
జసపుం దరితీపులోడ సత్య వసించెన్.

తే. గీ. కాంత యటువలె వసియించి కొంతసేపు
మంతనములో వసంతపు మాట లాడఁ
బ్రొద్దు గడపుచు నున్న దీ పూవుఁబోఁడి
యని యుతాళించి యెనలేని హసాసు మించి.

కం. పనిలేనిమాట లాడుచుఁ
దనమైచే మేని సోఁకఁ దప్ప బెణఁకుచున్
వనజదళాక్షుఁడు మాటలఁ
దనియక మదిఁ బొంచియుండెఁ దహతహ మీఱన్.

కం. రమణుఁడు పొంచుట తనచి
త్తములో నెఱుఁగ కట మాట దారిగ నగుతా
గమకించి కురుజుతెలనా
కుమడపు మొనపంటఁ గఱచి కొ మ్మని యొసఁగెన్.

చ. ఒసఁగినయంత వింతగను హుమ్మని కమ్మనిమోవి నోరఁగా
దుసికిలనీక యమ్మడుపు తోడఁజుఱుక్కున నొక్కి శౌరి సం

తనమును సిగ్గు నెగ్గుమెయి • తగ్గును సీత్కృతిజగ్గు మొగ్గురా
జనమును మీఱి బోటిమెయి • సంఘటిలం గటిలగ్నపాణియై.

కం. పెదవిచుఱుకంట సతి పతి
కెదురెక్కుచు గోర నదిమి • యెదను చనుమొనల్
గదియించి కాటు సోఁకినఁ
గదియంబడి నిల్చి వెల్చి • కై వడి నంతన్.

చ. ఉరమున గుబ్బ లాని హరి • యుల్కుచు మాటలఁ దేర్చి పల్కుచున్
తరుణిని నిండుకౌఁగిటను • దార్చి నయంబు లొనర్చి హామికల్
బెరయ బిరాలునన్ బొటన • వ్రేలునఁ గుచ్చెల రెమ్మి నీవి వోఁ
బొరలి చివుక్కునం గదిసె • బోటియుఁ దా నెదురెత్తు లియ్యఁగన్.

కం. అటువలెను శౌరి కదియుచుఁ
గుటిలాలక జొక్కమలుకు • గ్రుక్కులు రహిఁ బి
క్కటిలన్ ఘుమకారము సం
ఘటిలన్ బకదారిరవలు • గలిబిలి సేయన్.

కం. రతికంటుమొదలఁ గదురఁగ
గతిపెక్కుల నిలిచి నిలచి • కమ్మలు గదలం
జతగొని ముంగర పొదలన్
కొతకక మణితంబు సలిపెఁ • గోమలి యంతన్.

సీ. అధికహస్తగ్రాహ • శిథిలకుంతలవాల
మాతతశ్రమకణో • ద్యత్కపోల
మామృష్టఘుసృణది • వ్యచ్ఛిత్రనికటాల
మనోన్యరచితాట్ట • హాసలీల
మధిగతసుఖ మనం • గామిాలితనిపాల
మాప్రయోగక్షతో • ష్ఠప్రవాళ
మలఘువక్షోజక • ట్యామర్దనస్ఫాల
మాకీర్ణకుసుమశ • య్యానిచోళ

తే. గీ. మవిరళావ్యక్తవాగ్జాల ♦ మతికరాళ
మాత్మపులకాంకురనిరాళ ♦ మమితఖేల
మగుచు మరుఁ డిచ్చుఁ గొలువుండి ♦ నగుచు మెచ్చ
నమరి నిరతంబు మెఱసెఁ ద♦త్సమరతంబు.

కం. చిఱుమూల్గు లూరడింపులు
గరిసింపులు గాయకములు ♦ కసరులు కొసరుల్
మురిపెంబులు సరసంబులు
మెఱయఁగఁ దరుణియును హరియు ♦ మెలఁగుచునుండన్.

ఉ. చొక్కక చొక్కినట్లు మఱి♦చొక్కియుఁ జొక్కనియట్లు చొక్కి పైఁ
జొక్కినయట్లు మేలువగఁ♦జూపుచు వాతెఱకాటు మేపుచున్
మ్రొక్కుచుఁ దక్కుచు న్వాయల♦ముద్దులఁ బెట్టుచుఁ జెక్కుగొట్టుచుం
జక్కెరబొమ్మ యోరటిలఁ ♦ జక్రధరుం డతివిస్మితాత్ముఁడై.

కం. బొమగఱచి చనుపొత్తుల
జో డరచేతుల నడంచి ♦ సొగసి దురుసుగా
వీడెకి విడుచుచు మఱిమఱి
కూడక కూడుచుఁ గరంచెఁ ♦ గోమలి నంతన్.

కం. ఇందుముఖిసమరతం బా
చందంబున వెలయ విభుని♦చరణంబులపై
సందుకొని లాగి కుచని
ష్పందనను రమాంగి వీఁగి ♦ పైకొనువేడ్కన్.

కం. పయికొనియును కంసాంతకు
పయి బరు వానకయ పొదలి ♦ భామామణి త
త్ప్రియలీల కలరి మఱిమఱి
నయముగఁ గొలిపించె శౌరి ♦ నానాగతులన్.

సీ. వీఁగి సన్నం బైన♦లేఁగౌను వణఁకంగ
నుదుటుగుబ్బలు మాటి ♦ కుభికి పొంగ

మొగిలిరేకులనూనె♦ముడిచిందు లెనయంగఁ
దళుకుఁజెక్కిళ్ల క♦మ్మలు చెలంగ
మెఱపుహొంబాళెపు♦సర మల్లలాడంగ
మ్మెఱుపులవలెఁ దోడ♦మిం చెసంగ
నిలువక రవలయం♦దియలు ఘల్లు మనంగఁ
గవగూడి విడిగాజు♦రవ చెలంగ

తే. గీ. నంగన చెలంగె నపుడు ర♦థాంగపాణి
యంతరంగంబునకుఁ జాల ♦ వింత గొలిపి
జంతవగ చూపుపంతుమై♦నరులకోపు
మీసరం బైనమరుసాము♦పై సరంబు.

కం. ప్రియుఁ డుబికి మోవి గొరయం
బయిపయి మో విచ్చి యిచ్చి ♦ పడఁతుక జడియన్
నయముగను చెమటఁ దడియన్
మయినుడియ న్మెఱసెఁ గాంత♦మగసాగ సంతన్.

మ. కొఱపల్కుల్ రవగుల్కుచిన్నెలును, కెం♦కుల్ నిక్కుమేలన్నులున్,
తరమావాతెర తేనెజున్నులును, ని♦ద్రామేనిడాల్ హొన్నులున్,
చిఱుగోరింపులనింపుచన్నులు, హొయల్♦చేకొన్నవాల్గన్నులున్,
హరి కెంతేఁ దమి రేఁచె బోటి మగస♦య్యాటంబు వాటింపఁగన్.

సీ. చిఱుదొండపంటికిఁ ♦ జిలుక చేరినలీల
వరునివాతెర నొక్క ♦ వ్రాలివ్రాలి
కరికొమ్ము గుద్దిన♦కరణి గుబ్బల బమ్మ
యెమ్మెకానియురమ్ము ♦ గుమ్మ కుమ్మ
వెడవిల్తుచేఢక్క♦నుడికారములపోల్కి
బకదారివగరవల్ ♦ పల్కి పల్కి
పలుమాఱు పొదలుచుఁ ♦ బైపాటుదురుసాఁగి
లకుముకివలె బయ ♦ లాఁగియాఁగి

తే. గీ. పులకమొలకలు నెలకొన ♦ లలితనఖర
కలితకటిగళసుఖజల♦స్ఖలనసమయ
విరళవిరళోక్తి మై లోఁగి ♦ వీఁగి తనిసి
మగనిఁ దనియించె నొయ్యారి ♦ మమత మీఱి.

తే. గీ. అటులు విహరించి దంపతు ♦ లచటినుండి
బయలుదేరి వసించి చ♦ల్వలు ధరించి
మగుడఁ బాన్పునఁ బవళించి ♦ మమత మించి
యంచితోల్లాసముగ నిదు♦రించి రంత.

చ. తిమిర మడంగెఁ గ్రుంగె నలు♦దిక్కులు జారకులంబు సాంధ్యనా
సమితి చెలంగెఁ బొంగె మది♦జక్కువకుం గుతుకంబు పక్షినా
దములు గడంగె నింగెనసెఁ ♦ దామరపుప్పొడిగుంపు సూర్యబిం
బ మట వెలింగెఁ జెంగె నతి♦మంజులగౌరవకైరవద్యుతుల్.

వ. అప్పు డప్పద్మలోచనుండు కప్పురగంధియుం దానును మేలుకాంచి కాల్యకృత్యంబులు నిర్వర్తించి పౌలోమీప్రహిత పారిజాతకుసుమజాత కుంకుమపంకసంకుమదమృగమద జాంబూనదాంబర చంకనదలంకారుండై పువ్వుఁబోఁడితోడ బువ్వంబు నారగించి తదీయముఖతామరసదత్తకర్పూర వీటికాతిసురభిళవదనార విందుండై వేదండగామినీకుచమండలోపధానంబు నం జేరి వింతహాయలు మీఱియుండె నయ్యెడఁ బ్రద్యుమ్నుండు సద్యస్తన విజయయాత్రాముహూర్తంబు సమీపంబయ్యె నని యేకాంతంబుగా విన్న వించిన నన్నతోదరి యంతకుమున్న యెన్నునిపయనంబు తనకు మన్నన గ్రొన్ననఁబోఁడులవలన విని నిశ్చితప్రయాణయు విభుప్రస్థానవార్తాజాయ మానవిరహాతరళీకృతప్రయాణయునగుచుఁ గలితమధుకైటభనిరాస కంస శాసనా నీవు నరకాసురవిజయంబు సేయుట యీదేవీసమాజంబునకు నేఁ దెలుపఁదగినది గావున భూమివారు చూడ స్వామివారితోడనే నన్నుం దోడుకొని విజయంబుసేయవలయు నని యెచ్చరించిన మచ్చెకంటినిం జూచి మదనజనకుం డిట్లనియె :—

చ. వెఱవక పోరు చూచుటలు ♦ వెన్నెలకుప్పలొ కాక గవ్వలో
గురుగులొ బొమ్మరిండ్లొ మఱి ♦ గుజ్జనగూడులొ పెండ్లివీడులో
పొరిఁబొరి నిచ్చలుం విసరు♦పువ్వులరువ్వులొ తేటనవ్వులో
యరయరు కార్యముల్ మృగము ♦ లట్ల వెలందులఁ దెల్ప శక్యమే?

సీ. పాటలాధర[1]యాట♦పాటలా యింక ని
శ్శంకశాత్రవవీర♦హుంకృతములు
బోటు లాడెడిపూల♦వేటులా రిపుకోటి
నాటితకరవాల♦పాటనములు
తేటలాగునఁ జిల్క♦మాటలా యక్షత
ప్రతిపక్షభటరూక్ష♦భాషణములు
నీటు లానెడు వీణె♦మీటులా హుంకార
చంకనదరిచాప♦టంకృతములు

తే. గీ. బోటు లాసించుముత్యాల♦పేటులా ర
ణాంతదుర్దాంతకుంతప్ర♦హారధార
లువిద యిది చండితన మని ♦ యుండియుండి
యకట యీవేళ సంగ్రామ♦యాత్ర యేల.

చ. ఉవిదలతోడ మర్త్యుఁడు ర♦ణోర్వికిఁ బోవుట యెట్లు పోయెనా
బవరము చేయుదానవుల♦పైఁ బడి చూపుట యెట్లు చూపెనా
యవిరళబాణజాతముల ♦ నంగనఁ గాచుట యెట్లు కాక నీ
సవతులు విన్న నెట్లు మఱి ♦ [2]శారదపూర్ణనిశాకరాననా.

కం. మానవసమరమువలెనా
మానవతీమణి యిదేటి♦మాటలు బళిరే
దానవరణభీషణదశఁ
దా నవలా చూతు ననుట ♦ తగునే యెందున్.

---

పా. 1. యాల♦పాటలా. పా. 2. శారదపూర్ణసుధాకరాననా.

కం. అన విని మిటారి వగజిగి
కొనగుబ్బల నతనివెన్ను • గోరాడుచు మఱా
పునఁ దనమో మిడి కులుకుచు
వనితామణి యిట్టు లనియె • వల్లభుతోడన్.

చ. వలవనిచింత యేల యదు•వల్లభ కల్లభయంబు ప్రోదియుం
బొలుచుట స్వామివల్లఁ గద • పుట్టు జగంబుల కెల్లఁ జెల్ల! నేఁ
డెలియ నటంచుఁ బల్కితివి•తీరుగ నేణకులంబు గబ్బిబె
బ్బులిఁ గనుకై వడి న్వడి రి•పుల్ నినుఁ గన్గొని నిల్వనేర్తురే.

కం. సాధారణనరునికి నా
యోధనముల్ రిపులు ననెడు•యోజన తగుఁగా
కీ ధాత్రి నీమహత్త్వ ము
సాధారణ మగుట నిట్టి•శంకలు గలవే.

కం. ఆఁటది రారా దనునీ
మాటవలన నేమి త్రిపుర•మర్దనుఁ డని మున్
బోటుల సిక నొకప్రక్కన్
గాటపుతమి నాని గెలుపుఁ • గై కొనలేదే.

చ. అవునవు నెన్నిమాయలు సు•రాసురకోటిఁ దృణీకరించునీ
కవుఁగిటిగూఁటిలోఁ జిలుక • కైవడి నిచ్చ వసించుబోటికిన్
బవరము చూడరాదొ పెర•బారులు నుగ్గొనరించరాదొ దా
నవు లన నెంత.రాక్షసజ•నంబులు దైత్యులు నెంత శ్రీపతీ.

చ. సవతులు విన్న నెట్లనుచు • సంతస మొప్పఁగఁ బల్కి తీవు మా
సవతులవల్ల నొవెఱపు • సామికి నేఁడు నవంబె యైన యా
దవకులచంద్ర నన్ను దయ•దప్పక దోకొనిపోవఁగావలెన్
బవరము చూడ నాసతుల • పాదము లాన మరల్పరాకుమీ.

కం. అనిన నగి మగుడఁ దనచె
క్కు నొక్కి ముద్దిడుచు వేఁడు•కొనఁగా నెనగా ...

ననిమురిపెపుమాటల నం
గన గట్టిగ మనవి సెల్వ • గమకించంగన్.

మ. సకి యొక్కర్తు పరాకనన్ విజయుఁడున్ • సైవేయమాద్రేయభో
జకుమారాదులు భీముఁడు న్వడిగ రా•నద్యశ్శ్వభామాదనో
క్తి కమాహూర్తికలోక జీవ జయ వా•గ్రీతిన్ ముహూర్తంబు చే
రిక యాటన్ హరి లేచె లేచినయొయ్యా•రిన్ మక్కువం జూచుచున్.

ఉ. చూచినకాంతునిం గనలి•చూచుచు నే మనలేక నవ్వుచున్
దాచతురాలు గావునఁ ద•దాత్యసమాగతబాంధవాళిపై
మోచినగుట్టుతోఁ దలుపు•మూలకు నేఁగుచు మ్రొక్కి సామికిన్
ధీచతురన్ వయస్యఁ గొని • దీవనవీడె మొసంగ సొంపుగన్.

వ. ఇవ్విధంబునఁ దన్వంగి దీవనవీడె మొసంగ నంగీకరించి హావుసు మించి యంతకుమున్న దొరఁకొన్న విజయభేరీనినాదంబు విని యచ్చటికి వచ్చినవై దర్భీముఖనిఖిలవిధుముఖీజనంబుల నెల్ల సాదరవిలాసనమందహాస వీక్షాలీలానవిశేషపోషణమ్ములతమకమ్ము కెరలించి తన్నివాసమ్ములకు మరలించి కరారవిందకలిత విజయకరావలంబం బంది విలంబమానజాంబూన దాంబరవిభాకదంబంబు ప్రతాపంబువిధంబున భుజంబునఁదొంగలింప దిగం గనాతరంగితాశీర్వచనరచనానుభావభూదేవ బలదేవ వసుదేవ నందాది గురు బృందానుమతిఁ గైకొని నగరు వెలువడంగ హెచ్చరించిన నగుచుఁ జంచల హృదయకంచుకవ్యాహారసాహానినాదంబు సంధిల్ల రాజీవాక్షుండు తేజీ నెక్కి యిరుపక్కియల బవిరిగాఁ గ్రిక్కిఱిసి హాజీలై తేజీల నెక్కి కుమార లోకమ్ము నల్లుంద్రు కమ్ముకొనిరాఁగ నమందమందగతుల ముందువెనుకఁ గొందజెన్నుఁదగుచున్నవార లేనుంగుల నెక్కి రాఁగ సంవర్త సమయావర్తావర్తసఘూర్ణమానార్ణోరాశి జంఘాలతరంగసంఘాతసంఘర్షణ జనిత నిర్ఘోషణాపోషణనిపుణదుందుభిబృందకందళితనినాదమ్ముల సమదహృదయ పుటభేదనమ్ములు చాటి యాపుటభేదనమ్ము దాఁటి తమకంబుబైట గమకంబుగా హావణించినకలువకలువడంపుచలువనెత్తావి ఘుమ్మన గొప్ప కురువేరుచప్పరంబునడాసి తురంగావరోహణంబు చేసి యచట నగుశుభ

నిమిత్తంబులకు సంతసిల్లి మనంబున భవానీశంకరులకుఁ బ్రణమిల్లి చతురంగ బలంబును వెన్నాడి వచ్చి గుమిగూడి యుండుటం జూచి యేచి కరువలి దిండిచండి దొరతండంబుగుండెనంజుడు నంజుసంజకెంజాయకఱకుటెఱకలు గలుగుపులుఁగుమన్నీఁదనయెప్పటిపటానిందలంచె తలంచిన నతండు వెండి బిరడజిగిమెండుకొన వేఱొక్కనడ బ్రహ్మాండమధ్యంబునంబొలిచినవగ వచ్చి నిలిచినం జూచి కటాక్షించి సకలబలసహితుండై తదీయస్కంధారోహ ణంబుఁ జేసి యతివేగంబున సాగరాంతరాకాశపథంబునం జనియున్నిద్రశరభసైరిభశార్దూలంబు నుదగ్రహరిణగజగవయకులంబు నురుతరసాలతమాల మాలతీహింతాల తక్కోలంబును జృంభమాణనిర్ఝరిణీశతసముల్లోలకల్లో లంబును ఘణిమయగుహావిహారిదానవదంపతీ విలసనోద్వేలంబు నున్మీలిత కుముదకమలసముదయసముదంచిత కాసారతీరోపవనపర్వానుపర్వామితసర్వర్తుకుసుమ మకరందతుందిలాలవాల మ్మగు కనకమహాకుత్కీలమ్ముఁజేరి యగ్గిరియందు నిచ్చలపుపచ్చికబయళ్ల గరుడుని డిగ్గి యందు నిష్యందమాన సలిలబిందుపిండీకృతయజ్ఞభుగ్జలదకుంతలాదృగ్జలరుహ ప్రాగ్జ్యోతిషపురకలిత విహృతినరకదానవశుద్ధాంతకాంతాకుచకుంభగుంభితమసృణజరీజృంభమాణ పరిమళఝరీసంధానితమందపవనకందళమ్ముల సేదదేరి పరిజనమ్ముల నెల్ల నియోగించి పాళెంబు విడియించె నంత.

తే. గీ. చిగురుఁబోఁడి ముకుందుని • నగర నుండి
తలఁపు వెనుకొనఁ గనకసౌ • ధమ్ము నెక్కి
కొమలతో మంచిశుభశకు • నములు గాంచి
సామినెమ్మోము మఱుఁగైన • సంచలించి.

కం. రతనంపుగవాక్షులలోఁ
బతిఁ గనుఁగొనునంచు వదన • పద్మ మొదిగియుణ్
సతి యెఱుఁగక మై మఱచిన
గతి నుండఁగ నిలిపి చెలిమి • కత్తియ లంతణ్.

కం. ఇదిగో ముకుందుఁ డనినణ్
మదిరేక్షణ తిరిగి చిత్ర • మధ్యతలమునణ్

సదయునిఁ గనుఁగొని యావిభు
పదములపై వ్రాలి సోలి ♦ భగ్నాశయయై.

తే. గీ. మదిని నెలకొన్నరుక్మణి♦మాయఁ దగిలి
కలనఁ గైవచ్చుజయలక్ష్మి♦వలనఁ జిక్కి
మఱియు వేవేలుచెలువల♦మరులఁ గెరలి
నన్ను రానిత్తువా నీవు ♦ నలిననాభ.

కం. కాంతల నందఱ మును శు
ద్ధాంతమునకు ననిచి నాగృ♦హమునకు నీ వే
కాంతమున వచ్చి కలియుట
యెంతయు బలవంత మనుచు ♦ నెఱుఁగఁగనైతిన్.

మ. అని ప్రాణేశ్వరునేర మెంచ నవలా♦లాడ్క జెలుల్ భోజనం
దన నీక్షింపుము ముంగట న్నగుచుఁ గాం♦త ల్గొల్వఁగా నున్న దం
చును చేఁ జూపినఁజూచి నవ్వి సఖి యం♦చుం జేయి చేయూఁతగాఁ
జనుచున్ బంగరుమెట్లవెంబడిని రం♦జన్మంజుమంజీరయై.

సీ. చెలువునిపై బాళి ♦ సెలవుముట్టినజాలి
మొలక లెత్తువిరాళి ♦ మోహరించ
వెడనడలహొంతంగు ♦ విడికమ్మలమెఱుంగు
గ్రమ్ముగుబ్బలపొంగు ♦ ముమ్మరించ
కలకఁబాఱినయేపు ♦ తొలఁకఁబాఱినవైపు
తలిరువిల్తునితూపు ♦ తారసించ
చిగురువాతెరఠెక్కు ♦ చికిలిచూపులచొక్కు
చిఱునవ్వులయుచెక్కు ♦ జేవురించ

తే. గీ. చెలులు మునుమున్నుగా నేఁగి ♦ కలువరేకు
సెజ్జ హావణించ మెల్లనఁ ♦ జేరి శిశిర
మారుతోదారతుహినకా♦సారతీర
చంచదుద్యానసీమ నా♦సత్యభామ.

వ. తదనంతర కథావృత్తాంతం బెట్టిదనిన.

మ. మహిసంక్రందన, [1]క్రందనందనసుమ
న్మందార, మందార దు
స్సహసంస్పర్శన, స్పర్శనాతిగదయా
సద్భావ, సద్భావన
న్మహిళాభావిత, భావితార్కభుజసీ
మాధామ, మాధామవి
ప్రహితాలోకన, లోకనవ్యనయనా
భాచంద్రభూచంద్రమా.

కం. కరుణావరుణాలయ నత
భరణా శరణాగతారిపార్థివ సుగుణా
భరణా వరణాంచితపుర
తరుణా యరుణాబ్జసద్రుతాయతభరణా.

కం. ద్రాక్షాశిక్షానుక్షణ
రక్షోక్తికృతవినోదరక్షితపక్షా
లక్షణలక్షితవీక్షా
దక్షిణసింహాసనేంద్ర దయితకపీంద్రా.

మత్తకోకిల.

ప్రాక్కటీవిజటీనసాదర
పద్మభూభుజగావరా
ధిక్కృతార్యమహోభరాధర
తీక్ష్ణఖడ్గరణోదరా
న్యక్కృతారిధరావరా దర
హాసగమ్యసరాదరా
చొక్కనాథనృపాలసోదర
స్ఫూర్తితామరసోదరా.

---

పా. 1. క్రందనందితసుమ.

## గద్యము.

ఇది శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ జ్ఞానప్రసూనాంబికా కృపావలంబవిజృంభమాణసారసారస్వతసుధాతరంగ వెంగనామాత్యలింగనమఖివంశపావన విరచితవిద్యాధిదేవతాసంభావన దక్షిణసింహాసనాధ్యక్షతిరుమలక్ష్మాకాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుళుచ్ఛసితచ్ఛత్ర చామరకళాచికాకనకాందోళికాదిరాజోపచార నీరజాక్షహృదయరంజకవచోవిహారవల్లకీవాదనధురీణవర్ణ గీతాదిగాంధర్వస్వరకల్పనాప్రవీణ కామాక్ష్యంబికానాగనకవిరాజనందన కలితసకలబాంధవహృదయానందన శ్రీకర కవితాకర సుకవిజనవిధేయ శ్రీ కామేశ్వరనామధేయప్రణీతంబైన సత్యభామాసాంత్వనం బనుమహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.



# సత్యభామాసాంత్వనము.

## తృతీయాశ్వాసము.



శ్రీ శృతకరుణాశృంగా
రాశ్రాంతసమగ్రగుణగ♦ణాలంకారా
విశ్రుతకీర్తివిహారా
యాశ్రితమందార ముద్దు♦లక్ష్మిరిక్షీరా.

తే. గీ. అవధరింపుము జనమేజ♦యక్షితీశ్వ
రునకు నావ్యాసమునిశిష్యుఁ ♦ డనియె నిట్లు
పాళె మటువలె విడియించి ♦ ప్రౌఢి మించి
పరిజనముతోడఁ బసిగాపు♦పాదుశాహు.

సీ. జాతిపచ్చలజోతి ♦ లాతిగాఁ జూచుమ
జ్జాతిపసరువన్నె♦రీతి సరిగె
కుట్టునాతిపతిమె ♦ గుజ్జరాతివిభాతి
సకళాతిబిళ్లషాం♦దికసరాతి
యేకరంగిహారంగు ♦ టెంగిలీకపురంగు
లెనయుపగ్గపునిగ్గు ♦ లోనర లగ్గు

నుగ్గడితపునిల్వు • మగ్గపుఱుతకల్వ
పఱఁగెడిపట్టుచా • పలను బెట్టు
తే. గీ. చుట్టుఁ గనుపట్టు రతనాల • కుట్టుపనుల
ఱేకుకంబాలు పగడంపు • మేకు లుదిరి
కలశములపక్కిదోరడాలు • కలికితావి
మీఱి సొమ్మైన కుతినీగు • డారులోన.

చ. మొదటిసరాతి దాఁటి యట • ముంగలిగద్దియఁ గొంతసేపు స
మ్మదమునఁ గొల్వుఁ జేసి మఱి • మంత్రుల రాజులఁ బంచి యూడిగాల్
యదుకులసార్వభౌమ జత • నయ్య యనన్ వడి లేచి యావలన్
గదియఁగ దూఱెఁ బమ్మిన న • కాసిగుడారునఁ జేరి యచ్చటన్.

చ. పరిపరిచాయలన్ సుళువు • పట్టుతలాడయుఁ బక్కదిండ్లఁ జే
బెరయుతివాసులున్ బటువు • బిళ్లలు సూరెపుటంపుపానుపున్
నెరజిగికుందనంబుహవ • ణింపులయింపుల నింపు కెంపురా
తరిమెనకోళ్ల నల్లసిలు • దంతపుమంచముమీఁద వింతగన్.

మ. హవణొందం బవళించి యాయుధచయం • బాచుట్టునన్ బోడిగల్
సవరించన్ గనుగీటి క్రొంజికిలిగా • జాబాకుదా దొక్కవ
క్క వడిం బానుపుక్రింద నుంచి రఘు • నిక్కం జెంగటన్ జేస్త్రశాం
ద్రము వసింపం బెదయూడిగా లెదుటఁ జు • ట్టుం గొల్వ నుష్ణ్రముఁద్దష్ట

చ. పకపకనవ్వి సారె కొక • పాటిగ మీసము దువ్వి యుస్సురం
చొకపరి యూర్చి పక్కనగు • నొంటిగఁ జెక్కటఁ జెయ్యి చేర్చి యూ
రక వెఱఁగంది చిత్తమున • రాఁజినపూవిలుకానిబాణపున్
సెకలకుఁ గుంది సత్యపయిఁ • జెందినమోహము మోహరింపఁగన్.

కం. జిలజిల మనమున నొనరం
జిలచిలకన్నీరు దొరఁగ • సెక చిత్తముతో
నిలుపోపక వల పాఁపక
తలపోసెన్ సత్యరూపు • తహతహ మీఱన్.

వ. ఇవ్విధంబున నవ్వివ్వచ్ఛబావ జవ్వనియూవు తలపోసి తలపోసి వాసి దొరంగి కరంగినమనసున నెవ్వగ నివ్వటిల్ల నివ్వెఱఁగు సంధిల్ల నవ్వలివ్వలం బొఱలుచు నాఁపరానితాపరాశిం దెరలుచు నల్లనల్లన మెల్లమెల్లన నుల్లంబునఁ బల్లవించుతల్లడంబున నెల్లదెసలు నిరులుకొన మరులు కొనసాగ నీశ్వరా సాగరావారితంబగు [1]నీశిఖరిశిఖరభాగం బెక్కడ నాద్వారకాపురం బెక్కడ నే నెక్కడ నింతి యెక్కడ నీ శైలంబునకుఁ బౌలోమిమగని జాలంబున నేల వచ్చె నీవలపుదండు నేలీల నెమ్మది నుండు నెపుడు నాతపములు పండు నేవేళ లీలావతి నాప్రక్కలో మక్కువఁబండు నిండుపొగరున నున్నయన్ననఁబోఁడికి నెవ్వరు నాబన్నంబులు విన్నవించువారు వియోగం బేలాగునంగడతేరు నని తనుఁ దానె పలికిపలికి యులికియులికి తిగిచి కన్నుల మొగిచి యన్నువకలికిపై నెలకొన్న తనభావంబునకు దైవంబునకు వగచి వగచి యుఁసుగని వగచిడిముడిగెడసి యెడనెడ యని నడగనియగు చిలుక నెడఁ గని పై నడరి పడంతిమగతుడుమువిడుములం బడ గడగడవడంకి వెడవెడపడవందొడరుదు రుసుతొగకిరుసుదొరయరిమురిగరగరింగరువమున మురు నమరఁ బరిపరివిరిగొరక మరిమారి బరపి చిరచిర నెరపి దిరదిరం దిరుగ సరగున డిందిన డెందంబునఁ గ్రందుకొను వెత చిందులసందులజబ్బువారమై యుబ్బుదీర వెఱచి మైమఱచి తోన [2]తెలిసి సొలసిసొలసి యలసియలసి మిసమిసనొసయ నొసపరి పసరుచెంగావిరంగున కుదురుకొన కట్టువన్నె జంటకుట్టునుదురు తెరపి రుమాలతోడ జాఱుసిగ వీడ బావిలీముత్తియం బించుకించుక తొలఁగియాడ మెఱుఁగుబంగారుదుప్పటిజాఱ మే నెల్లఁ జెమట లూర నంగాంగములబలిమి మెడల ముంగామురము చేసరము సడల నురమునందుఁ దగుపచ్చరుమంజముత్యాలతావళంబులు కగ్గ నుల్లాసంబు తగ్గ నుల్లంబునఁ దలంపులు నెగ్గ డగ్గఱి తివాసుల నున్నమన్నన చెలికాండ్రతో మందలించిన నంద క్షేమందురో యనుచింత నోహటిల్లి కొంతయూరడిల్లి యాత్మగతంబున.

మ. మెలతల్ నాజయయాత్రలోఁ దమకుఁ దా♦మే యాడుకోఁ జూడఁగాఁ
దెలి సాలోనన చిన్నవోయి తమి చిం♦తి ల్లింత నంతంతఁ దాఁ

---

పా. 1. నివ్వరాహాశిఖరభాగం. పా. 2. తేచి సొలసిసొలసి.

బలుకనవ్వచ్చి భయంబు సిగ్గు జమిలిం◆పఁగ త్రెప్ప లల్లార్చి చూ
పులపై దేర్చినముద్దరాలితరితీ◆పు ల్దెల్ప శక్యంబులే.

చ. కులుకుమెఱుంగుగబ్బివలి◆గుబ్బ లురంబున నాని కిన్కచేఁ
బలుకుట మాని పాదములఁ◆పైఁ బడి దిగ్గన లేచి బాష్పముల్
దొలఁకఁగ వెంట జంట ననుఁ◆దోఁకొనిపోయినఁ గాని తాళ నం
చెలమిని విన్నవించుచెలి◆నేటికి నాఁటికిఁ గ్రమ్మఱించితిన్.

చ. ప్రమదలు లేనిచో మనసు◆రాయి గదా మగవాని కంచు నే
రములు దలంచ కంచు నను◆ గ్రక్కున నక్కునఁ జేర్పుచుం గ్రమ
క్రమమున వత్తు నన్నగమ◆కంబును లోఁ దనుకంబు పొంచ్చఁగాఁ
గుములుచునున్నయాకొమెర◆కొంకు దలంకును నెన్న శక్యమే.

ఉ. వైరుల గెల్చి నే మరలి◆వత్తు నటం బొటఁబ్రేల నేల్వ్రా
గీఱుచుఁ దారుచుం దలుపు◆క్రేవల నావల నిల్చి పొంచ్చుచున్
నో రొకయింత రాక దయ◆నూల్కొని దీవనవీడె మిచ్చి క
న్నాఱలుగొన్నయామగుద◆పోయగ మేయుగమందుఁ గందునో.

సీ. గజకేతువాతసం◆గతిని సేనలదుమ్ము
 లెరలంగ నెపుడు నేఁ ◆ దిరిగిచూతు
వెన్నానికొనివచ్చు◆మన్నీ ల్పరా కనఁ
 దిరుగుచో నెపుడు నేఁ ◆ దిరిగిచూతు
మావంతు వెడలించు◆పూవుతోరణములఁ
 సరణి నే నెప్పుడు ◆ తిరిగిచూతు
గవను లడ్డముదేరి ◆ యవలఁ బో బయ లాని
 తేఁకువ నెపుడు నేఁ ◆ దిరిగిచూతుఁ

తే. గీ. బయనమై తేజి నెక్కి నే ◆ బయలుదేఱి
కనకసౌధాగ్రములకూకి◆కవలగూళ్ల
యిండ్లకడ నెక్కి సోరన◆గండ్లచక్కి
శకునములఁ గోరుదయచూపు ◆ సకియచూపు.

కం. చూచెద నన్నను మనసునఁ
జూచుటయే కాక పోయి ♦ చూచుట యెపుడో
యాచంపకాంగికై పులు
నాచూపు మెఱుంగుకోపు ♦ లానగువై పుల్.

ఉ. దానిపహారంగు దానిజిగి♦దార్కొనుచెక్కులరంగు దానిన
మ్మేనినలుంగు దానితొడ♦మించుబెడంగును దానినవ్వుపు
వ్వానమెఱుంగు దానిబిగి♦వట్రువగుబ్బలపొంగు నెంచినన్
మానస మయ్యయో మరుని♦మాయలఁ జొక్కెడి నేమి సేయుదున్.

సీ. పక్కవాటుగఁ గొంత ♦ పడ కిచ్చి తమి నెచ్చి
కసివోక లె మ్మని ♦ కొసరునేర్పు
ఉబికి పెందొడ లెక్కి ♦ యుదుటు గన్పడ నిక్కి
యొడికట్టు గదియించు♦నుబ్బురంబు
ముద్దిచ్చి లాలించి ♦ మొనగుబ్బ లానించి
[1]బిఱబిఱ గమకించు♦నెఱతనంబు
పొగ రాని తెగఁబూని ♦ పొగడపూవిలుకాని
[2]జోడన ల్గొనియెడి♦కోడిగంబు

తే. గీ. కరఁగి కరఁగించి రతులయు♦క్కఱలఁ గెరలి
తనిసి తనియించి చెమటచి♦త్తడిని దడిసి
సుడిసిపడి చల్లఁగా వ్రాలు♦సుదతిమేలు
మఱచెద నటన్న నిఁక నేను ♦ మఱవలేను.

ఉ. కొప్పునఁ బూలు చెక్కి వెడ♦కోపము దీరఁగ మ్రొక్కి తేనియల్
చిప్పిల మోవి నొక్కి నును♦చెక్కిలి ముద్దిడి తక్కి వేడుకల్
చొప్పడ నొక్కి చక్కి తమిఁ♦జొక్కి కవుంగిటఁ జిక్కి చక్కియా
యొప్పులకుప్పచొప్పెఱిఁగి ♦ యూరటఁ దేరుట లింక నెన్నఁడో.

కం. కాంత చిఱుప్రాయమున నే
నంతిపురిం జేర నరుగు♦నప్పుడు తా నా

పా. 1. చిఱునన్న బెడలించు. పా. 2. జాడ నన్గొనియెడి.

యింతులకన్నను ముందుగఁ
బంతులు మెఱయంగ వచ్చి ♦ పైఁబడు వేడ్కన్.

చ. మొలకమెఱుఁగుచన్ను లుర♦ముం గదియించి తొడ ల్గళంబు చే
తులఁ గొని గ్రుచ్చి యెత్తి దయ♦తో మరునిల్లు మొగంబు నాభియున్
సోలయుచుఁ బ్రేమదొట్టి మయి♦జుమ్మని ఘుమ్మని ముద్దువెట్టి వే
తలిమము నుంచునాసొగసు ♦ తన్వి తలంచు నొకో తలంచదో.

సీ. మిన్నఁబొఱిననాఁడె ♦ మేలుమే లుదయించెఁ
దిన్నె లెత్తిననాఁడె ♦ వన్నె మించె
మొగ్గ గట్టిననాఁడె ♦ మోహంబు పచరించె
మొనలు చూపిననాఁడె ♦ ముద్దు గాంచె
బటువు మీఱిననాఁడె ♦ దిటముగా గమకించె
నునుపు గాంచిననాఁడె ♦ ననుపు మించె
బ్రేఁకమై తగునాఁడె ♦ డాక స్సవరించె
జో డైననాఁడె ముచ్చులు ఘటించె

తే. గీ. మగువపాలిండ్లతోడ నా♦మనసు చాడ
నింతయై యంతయై మాఱి ♦ యెంత యగుచుఁ
గంతుసామ్రాజ్య మేలంగఁ ♦ బంతగించె
నాకలికిపొందు నే నెట్లు ♦ లేక యుందు.

సీ. నునుసరాతిగవాక్షము♦లన వచ్చుజాబిల్లి
యుడుకుచేతులకుఁ జే ♦ యొడ్డిరొమ్ము
నలిగటాకునఁ గ్రమ్ము♦వలిగాలిమొలకల
యుద్దవళ్లకు మూల ♦ నొదిఁగి యొదిఁగి
ప్రక్కనుంచుకయున్న ♦ బాసుదారిజవాది
కావలిమోముగా ♦ నళికియళికి
దేరీజలో గుమ్ము♦తీమేలుకస్తురి పు
వ్వులకుమ్ముదుమ్ముల ♦ కులికియులికి

తే. గీ. కలికి తలపోసితలపోసి ♦ కడఁకఁ బాసి
పలికి యళికీరములహాళా♦హాళికి నళికి
మేనిగాసికి వెత లూఁది ♦ దానిమీఁది
దయ యెటుల దాఁతు నెటుల నే ♦ దండు సేతు.

సీ. అలవోక కువిదయం♦దెలపల్కు వినవచ్చుఁ
దడవుగా విన్న ని♦ల్కడకు రాదు
నిలిచిచూచిన బోటి♦నెమ్మనిజిగి దోఁచుఁ
గనుఱెప్ప లల్లార్పఁ ♦ గానఁబడదు
కోరినప్రోయాలి♦గుబ్బ లురము సోఁకుఁ
దాళి చే నంటినఁ ♦ దగుల వేమొ
యూగుబ్బుగాఁ గొమ్మ♦యంగవాసన వచ్చు
నాఁగి మూర్కొన్న వో♦నటమటించు
తే. గీ. నేపునను గ్రోల సఖమోవి♦తీపు సోఁకు
మరలికొన నాల్కఁ జెనకిన ♦ మాయ మగును
మోహభారంబొ విరహంబొ ♦ ముమ్మరంబొ
యే మని తలంతు మదిలోన ♦ నింతిరంతు.

ఉ. ఇంతకుఁ దెచ్చెఁ గంతుఁ డిఁక ♦నెంతకుఁ దెచ్చునొకో వసంతుఁ డా
వంతయుఁ దాళలే నిపుడు♦వంత తనంత దురంత మయ్యె లోఁ
జింత నిరంతరం బటులు ♦ చింతిలిచింతిలి కాంతలీలఁ దా
నెంత కృశించెనో మగువ ♦ యెంత తపించెనొ యేమి యెంచెనో!

చ. కల గనినట్టు లయ్యె నల ♦ కల్కివిలాసము దాని కల్కి య
చ్చెలిని దలంచ నట్టిదయ♦చిల్కనబల్కనఁ మెచ్చుకొందు లోఁ
గలఁగితి జేలపోల్కి నల ♦ కామునిముల్కికి నుల్కియుల్కి యా
చిలుకలకొల్కి యెన్నఁటికిఁ ♦ జిత్తము రంజిలఁజేసి యేలునో.

కం. పడవకయి వచ్చి యిడుమలఁ
బడవళమా తియ్యవిల్తు♦పడవాల్ వగచే

జడిసె మది తడసెఁ గోరిక
లెడసెఁగా చంద్రునికి మాకు ♦ నే మందు నయో.

ఉ. చక్కిలిగింతజోకలకు ♦ సారెకుసారెకు నవ్వఁబోక యే
మొక్కలివీఁక చే నపుడు ♦ ముద్దులు వెట్టిన లోనుగాక తా
మక్కువఁ జూపరాక తొలు♦మాలిమిమేలిమి లేక గోరునన్
పొక్కిలి నొక్కనీక చల♦మోరు నొయారిని జేరు టెన్నఁడో.

ఉ. ప్రాణుల కెల్ల లోకమునఁ ♦ బ్రాణమె హెచ్చగు నేణనేత్ర యా
ప్రాణముకన్న హెచ్చిటులు ♦ ప్రౌఢి వహించినవన్నెలాఁడి నా
ప్రాణము కావఁగోరి కద ♦ భావమున న్నెలకొన్న దైన నా
ప్రాణము ప్రాణనాయికను ♦ బాసిట నిల్చుట పాడి యౌనొకో.

సీ. చక్కెర యన్నింట ♦ జాణ నిద్దాహాంతో
కారి కురుజుతేన ♦ గరిగె పచ్చి
కస్తూరివీణె బం♦గారుతీఁగె యొయారి
జీవరత్నము రాము ♦ చిలుక కన్నె
లేడి కలికి వన్నె ♦ లాఁడి చిత్తరుబొమ్మ
కులుకులగని ముద్దు ♦ గుమ్మ కమ్మ
జాజితేజీకూన ♦ చక్కఁదనమ్ముల
యిక్క తళుక్కను ♦ చుక్క మరుని

తే. గీ. ఢక్క సురతపునుల్ తాని ♦ చొక్కమంగ
బరణి లేగుజ్జుమామిడి ♦ పండు మొలసి
నిలుచుక్రొమ్మించుమురువు వ ♦ న్నిటిచెలువు
దానినెడఁబాసి యీవేళఁ ♦ దాళఁజాల.

కం. అని చింత చేసి వింతగ
దనుజాంతకుఁ డంత నమ్మ ♦ తనమానసమం
దునఁ గొలుఁ వుండెడిచెలిఁ గని
కనికరమునఁ బల్కె నేస్త ♦ కాంద్రు వినంగన్.

ఉ. నమ్మితి నీపదమ్ములు మ♦నమ్మునఁ గ్రుమ్మదుఁ గమ్మతమ్మివిల్
రెమ్ముచుఁ గమ్మవిల్తుఁడు మ♦రీమరి గ్రుమ్మిన సొమ్మసిల్లితిఁ
ఘుమ్మన వీడియం బొసఁగి ♦ గ్రక్కున నక్కునఁ జేర్పరాద నే
కొమ్మ యదేమి నీకరుణఁ ♦ గోరక యూరక యుండనేర్తునే.

కం. నేరక యీవిధమున నే
నూరక యుండఁగ నయో వి♦యోగంబుననే
కోరక నీ వెటు లుండెదు
వారకమా మనలవలపు ♦ వనజాతముఖీ.

చ. కెల పొకమాట దీసి గిలి♦గింతలు రంతుల నుబ్బఁజేసి మై
యలఁతలు దీర డాసి బిగి♦యారఁ గవుంగిటఁ దోసితోసి క
గ్గొలుకులు దేలవ్రేసి తమి♦గుబ్బతిలం జెయివేసి యుండుటల్
తలఁచిన గుండె ఝల్లుమని ♦ తా నదరీ బెదరీ తలోదరీ.

సీ. ఊడిగంబులు చుట్టు ♦ నున్నారు గాని యో
యతివ నీచెలి యొక్క ♦ తైన లేదు
సరిగెకట్టునకాసు♦తెర యున్నదే కాని
రమణి నీసరియైన♦ ప్రతిమ లేదు
కలువపూవులమేలు♦కట్టు లున్నవి కాని
సుదతి నీయురచొక్కు♦చూపు లేదు
రుటమైనహంసంబట్టు♦బటువు లున్నవి కాని
వనిత నీచంటిగుం♦పెనలు లేవు

తే. గీ. ఏమి సేయుదు నే మందు ♦ నెచట నుందు
నెవ్వరిని వేఁడుకొందుఁ బొం ♦ దెందుఁ జెందు
నంత యెద మెండుకొనునట్టి♦ వట్టిదంపు
చేయఁగా వ్రాసెఁ దలవ్రాఁత ♦ చెనటిధాత.

చ. మరురణమందు నెగ్గి మును ♦ మంచము డిగ్గినఁ జేతివల్వ నే
దురుసున రెమ్మినం గినుక♦తోఁ గని నాతోడ వ్రాలి దుప్పటీ

చెఱఁగున మేను గప్పుకొని ♦ చింతిలి [1]నావదనంబుఁ జూచి క్ర
మ్మఱ నగి యార్చునీసొగసు ♦ మానిని యింకొకనాఁడు గల్గునే.

సీ. పూపచన్నులు కేలఁ ♦ బుణికి పట్టెడువేళ
నదరంటఁ గొనగోట ♦ నదుమ వెఱతుఁ
జక్కెరకెమ్మోవి ♦ చవిఁ జూచుతఱిఁ దావి
చొక్కుచు మొనపంట ♦ నొక్క వెఱతుఁ
గులుకు పుట్టఁగఁ గొంత ♦ కొనగోర గిలిగింత
తనువుచో మర్మముల్ ♦ చెనక వెఱతు
నలమి పై రెద నుంచి ♦ యాదరింపుచు మించి
బిగియారఁ గవుఁగింటఁ ♦ బెనఁగ వెఱతుఁ

తే. గీ. బరువము లెఱింగి యీరీతి ♦ వెఱచి వెఱచి
సేవఁ జేసితి నింక నీ ♦ చిత్త మెఱిఁగి
కొలుతు దయఁ జూడు రసదాడి ♦ విలుతుచేతి
తలిరు జముదాడి క్రొవ్వాఁడి ♦ తలిరుఁబోఁడి.

మ. కుచము ల్చేతులు వియ్య మొందఁ బులక ♦ ల్గుల్కొండ నందంద చే
రుచు మైఁ జేఱుచుఁ గన్యరో మనము నే ♦ ర్పుల్ చెందఁ బూల్చింద నా
స చెలంగన్ మది పొంగఁగా నెమరుమం ♦ చా లెక్క యుగ్యాల లూఁ
గుచుఁ బై నాఁగుచుఁ బల్కొన ల్మడుపునో ♦ కుక్కల్ టెక్కులింకెన్నఁడో!

చ. వికచపయోజనేత్ర యొక ♦ వేళల నెమ్మొయి జుమ్మనంగ నే
రక తమి నందు జీర నడ ♦ వ్రాలుచు సోలుచుఁ బ్రేమఁ దేలుచున్
పకపకనవ్వి కే లొడసి ♦ పట్టుచుఁ దిట్టుచుఁ జెక్కు గొట్టుచున్
చికిలికడానిపై సరము ♦ చేసిన దెం తని చింత చేసెదన్.

కం. అది సొగ సౌ నది మన సౌ
నది నయ మౌ నదియె తాళు ♦ మది నిలుకడ యం
చెదు రెత్తుచుఁ దమి హత్తుచు
ముదితా నీవెపుడు సురత ♦ మున మెచ్చెదవో.

---

పా. 1. నావదనంబుఁ బూని.

సీ. కాపురం బాద్వార♦కాపురవర మయ్యె
నునికి నీరతనంపు♦మనికి యయ్యె
గీము నీపడకింటి♦మోము మేడల నయ్యె
తావు నీచనుదోయి♦తావు లయ్యె
నిమ్మ నీమెయితావి ♦ గ్రమ్మమాళిగ యయ్యెఁ
బజ్జ నీవు వసించు♦సెజ్జ యయ్యెఁ
దావలం బెన్న నీ ♦ కేవలాదృతి యయ్యె
నెళవు నీనునుఁజూపు♦సుళువు లయ్యె
తే. గీ. వెలఁది దైవంబు మాయ గా♦వించి మించి
పడనగొడవలు దలపెట్టి ♦ కడఁక పుట్టి
యట్ల నను వీడఁజేసిన♦యందువల్లఁ
గటకట బిడారుగా నయ్యెఁ♦గా గుడారు.

సీ. అయ్యొ పళ్లెము వెట్టి ♦ రని పల్కు నొక్కర్తు
వనిత కాచుకయున్న ♦ దను నొకర్తు
పాలును రసదాడి♦పండ్లిడె నను నోర్తు
ననపాన్పు హావణించి ♦ రను నొకర్తు
ముడిపూవులును గంద♦వడి యుంచి రను నోర్తు
విను నఘురే యూరెు ♦ నను నొకర్తు
విద్యల నెంద్రాఁక ♦ వినుబాళి యను నోర్తు
మన సెక్కుడను సామి ♦ కను నొకర్తు
తే. గీ. పరిజనుల నిండ్ల కనుపఁగాఁ ♦ బలుకు నోర్తు
తనర వరుసలు దెప్పించు ♦ మను నొకర్తు
నందు హెగ్గడికత్తె లి♦ట్లందు రిందుఁ
జెలియ మగకాపురం బెంత ♦ చేసెఁ జింత.

సీ. తమలంబుమార్పుల♦తమి యుబ్బు గెరలించి
చూపుమార్పులను గ♦చ్చుల నటించి
తోకుకుచేమార్పుల ♦ దుడుకులు వచరించి
తొడసందుమార్పులఁ ♦ గడిమి నించి

మోవిమార్పులఁ గొన్ని ♦ ముద్దులు పావళించి
ప్రక్కమార్పులఁ గొంత ♦ పెక్కు మించి
కౌఁగిటిమార్పుల ♦ గమకముల్ పుట్టించి
పడకమార్పుల నిండు♦కడఁక గాంచి
తే. గీ. చేరిమఱి కేరజమ్ముల ♦ గేరి తూరి
తూరి యొకదారి బకదారి♦దారి మీఱి
యులికి పల్కుచు మన మపు ♦ న్నవితము
మదిఁ దలఁచ గుండె యదరీని ♦ మరుపతాణే.

ఉ. పుత్తడిబొమ్మ నీవు సుర♦పొన్నలపొన్నలపూలు గోయఁ జే
యెత్తిన గుబ్బ యుబ్బునవు♦డే నడుమ్ల వడి నుల్కి కుల్కుతో
నుత్తర మీఁక నెచ్చెలియ♦లున్నెడ కేఁగుచు వారిఁకోన చే
ఘొత్తఁగ నీదు తే టచట ♦ నేమొకొ యంటి న దివ్య డెన్నెదల్.

కం. ఎంత నుతియింతుఁ గలలోఁ
గాంతును గమకింతు వేడ్కఁ ♦ గాంతును మఱి మే
ల్కాంతుఁ బలవింతుఁ గాఁగాఁ
గంతునిచే రంతు తాళఁ♦గలనా లలనా.

సీ. గబ్బిమన్నునుదోయి ♦ గజనిమ్మపండ్లొత్తి
తనుగతశ్రమవారి♦ధార లెత్తి
కమ్మనివీడెంపు♦కవణంబు హత్తించి
యెలనవ్వుచలువపొ♦త్తుల బిగించి
పచ్చగాజులడాలు ♦ పసదారఁ బట్టించి
లలితసంకుమదత్తై♦లంబు నించి
రహిమీఱఁ జూపుక♦ప్రపువత్తు లెనయించి
పదము లత్తుకజోక♦పట్టు పూన్చి
తే. గీ. యెమ్మెతోఁ గ్రమ్మ వలరాచ♦కమ్మతమ్మి
గుమ్మతీగమ్ముబొమ్ముగా♦యమ్మ మాన

మానవతి! వెఱ్ఱితన మీవు ♦ పూన కున్న
నిలువరింపదు ప్రాణమ్ము ♦ నిజమునుమ్ము.

తే. గీ. ఇంతి లోఁజూపు నిల్పి ని ♦ న్నాఁచియెంచి
యుసురు మని యాఁచి వెతఁ దల ♦ యూఁచియూఁచి
కాంచి శృంగారదేవత♦గాఁ దలంచి
నోమి నను లూటి చేసెద ♦ వేమి బోటి.

కం. నిను నేఁ గలయం గోరఁగ
నను నీ వెడబాఁసి యుంట ♦ నాయం బగునే
తనువులు వేఱై నను మన
మనసులు చెలి యేక మగుట ♦ మఱచితి వేమే.

ఉ. ఏమని హెచ్చరింతు నిఁక ♦ నెంతని కంతునిబాము లెంతు నా
యామనిచేతిరంతు లహా♦హా యెటు లాత్మ గణింతు నీదుపాం
దేమఱినట్టు లయ్యె మది♦నెంతయు వింతలు సేయుచున్నవే
తామరసాక్షి యక్షులకుఁ ♦ దావకరూపవిలాససంపదల్.

సీ. వింతవింతగ నావు♦లింతలు గ్రమ్ముచో
మొలనూలిగంటలు ♦ పలుకరించుఁ
గోర్కులు తెరలెత్తి ♦ కొనసాగి క్రమ్ముచో
గుబ్బలహారముల్ ♦ గులుకరించు
సెక దీర చెక్కులు ♦ ముకుళించి క్రమ్ముచో
తళుకుగాజులనాదు ♦ తొలకరించు
నరగింట నంటి ని♦ద్దురమబ్బు గ్రమ్ముచో
నులుకుపల్కుల మేను ♦ పులకరించు

తే. గీ. నించుతమి మించువెత యగ్గ♦లించురుటము
దిటము చలియించుఁ జెలికోర్కి ♦ పుటమరించు
దేవురించును మది చూపు ♦ జేవురించు
నెటులు వేగింతు నెటులు నీ♦సటలు గాంతు.

కం. వేసరి నీవిరహంబున
వేసవికిం జిక్కుతరువు♦విధమున నిపు డ
ర్యో సోమరినై స్రుక్కితి
నీసారదయారసంబు ♦ నించవె చెలియా.

సీ. ఉవిద నీకెమ్మోవి♦చవులెంచి చవు లెంచి
కండచక్కెరమీఁదఁ ♦ గసరు పుట్టె
వెలఁది నీమాటలు ♦ వివరించి వివరించి
జుంటితేనియమీఁదఁ ♦ గంటు దోఁచెఁ
బడఁతి నీపాలిండ్లు ♦ పరికించి పరికించి
దాలిమ్మపండ్లపై ♦ బాళి దొరఁగెఁ
దరుణి నీచిఱునవ్వు ♦ తలపోసి తలపోసి
యారఁగాఁగినపాలు ♦ నరుచి మించె

తే. గీ. జలజలోచన నీమేను ♦ తలఁచి తలఁచి
యపుడు చిలికినవెన్నపై ♦ హవుసు మానె
నొక్కదిన మొక్కయుగముగా ♦ నున్న దైన
నేల నామీఁద ననఁబోఁడి ♦ యింత మోడి.

సీ. మొక్కలిదొరలచే ♦ మ్రొక్కించుకొనువాఁడ
ముగుదరో నీకు నే ♦ మ్రొక్క నెంతు
గడిమన్నెవా రూడి♦గము సేయఁదగువాఁడ
నువిద నీపాదంబు ♦ లొత్త నెంతుఁ
బరులచేఁ గానుకల్ ♦ పట్టించుకొనువాఁడ
భామ నీతమలంబుఁ ♦ బట్ట నెంతు
నరులచేఁ బావడల్ ♦ హావణించుకొనువాఁడ
వెలఁది చేలను నీకు ♦ వీవ నెంతు

తే. గీ. నొడిసి మరునంపటులచేత ♦ మిడిసిమిడిసి
తడసి ధైర్యంబు నిలుపఁబో ♦ కెడసియెడసి

యడసి యే నిన్నుఁ జేరమి ♦ జడిసిజడిసి
పడఁతి యీతేప మది లజ్జ ♦ విడువుఁ జూప.

సీ. పసిఁడికుండలు గాంచి ♦ పాలిండ్లుగా నెంచి
పదరి చేతులకొద్ది ♦ నదుమఁబోదుఁ
గెంపుబేసరి గాంచి ♦ కెమ్మోవిగా నెంచి
మొక్కంట మునిపంట ♦ నొక్కఁబోదుఁ
జీనియద్దము గాంచి ♦ చెక్కిలిగా నెంచి
ప్రేమ మీఱఁగ ముద్దుఁ ♦ బెట్టఁబోదుఁ
గమ్మతామరఁ గాంచి ♦ నెమ్మోముగా నెంచి
మనసారఁ దావి మూ♦ర్కొనఁగఁబోదు

తే. గీ. నిలిపి పలికెడుస్వరకూకి♦మెలుపు గాంచి
వలచి మణితంబుగా నెంచి ♦ పలుకఁబోదు
నింతి నీమాయొ మరుమాయొ ♦ యెఱుఁగలేక
యకట యీరీతి భ్రమసి నే ♦ వెకలినైతి.

మ. వనితా ముత్తెపుపంటివింటిమొగలీ♦వజ్రీఁడు హా యంచుఁ గ్రొ
న్ననలేఁదేనియబేజుమాల్ చిగురుఖం♦డా గుమ్మ యొక్కమ్మ డిన్
కనుఱెప్ప ల్ముకుళింప డెంద మదరన్ ♦ కంపంబు పై నొప్పఁ బ
ల్క నగన్ మేల్కనఁ జూడఁగూడక రసా♦లం బంటి కేల్ ముట్టితిన్.

మ. కడకంటన్ ననుఁ జూచి యేచి మదికాఁ♦కల్ దీర్చి మన్నింపవే
గడెసే పైనను తాళఁజాలఁ జెయి సోఁ♦కన్ తగ్గు నీసిగ్గు నీ
తొడనిగ్గుల్ నడజగ్గు నావలపు దం♦తుల్ వెట్టు నీగుట్టు నీ
యొడికట్టున్ జనుకట్టు నెంచి మిగులా♦నుప్పొంగెడి న్వేడుకల్.

కం. [1]అటమీఁదటిదుర్దశ నే
నెటువలె వివరింతు సీర♦జేక్షణ నీవే
దిట మొనరింపక యుండినఁ
గటకట నా కెవ్వ రింకఁ ♦ గాఁగలవారల్.

---

పా. 1. అటమీఁదటిదశ వశమే.

సీ. ప్రక్కలోఁ బవళించి ♦ పదము పై పావళించి
యచ్చోటు గదియించి ♦ పశాసు మించి
జిగిగుబ్బ లానించి ♦ బిగియ సం దొనరించి
పెదవికెంపులు నించి ♦ బెద రణంచి
మోవిచ్చి తేలించి ♦ ముద్దాడి లాలించి
ముందుగాఁ గదియించి ♦ మోహరించి
యలసి నీ వలయించి ♦ చెలఁగి న న్నెలయించి
పుంభావ మొనరించి ♦ బుజ్జగించి

తే. గీ. వేగ నభిముఖవై తోన ♦ విముఖ మగుచు
భ్రమణ మొనరించి రమణఁ బ♦రా కటంచు
మురువుతో వ్రాలి నీమేని♦యొరపు లెల్ల
నింక నొకసారి దయసేయ♦వే యొయారి.

కం. ఉమ్మలిక మయ్యెఁ జామా
కొమ్మా లతకూన ముద్దు♦గుమ్మా నారీ
నమ్మితిఁ బల్కు మొయారీ
యి మ్మగునామీఁది ప్రేమ ♦ యేమాయె నయో.

సీ. చల్లఁగా మనసు రం♦జిల్లఁగా నీచేత
వెలఁదిరో యెపుడు నే ♦ వీణె విందుఁ
బొందుగా వీనుల♦విందుగా నీచేతఁ
గలికిరో యెప్పుడు నేఁ ♦ గథలు విందుఁ
దేటగాఁ దేనెచి♦ట్టూటగా నీచేత
నతివరో యెపుడు ప♦ద్యములు విందు
హారువుగా బకదారి♦మురువుగా నీచేతఁ
గొమ్మరో యెపుడు ప♦ల్కులను విందు

తే. గీ. ననికి దళకర్త నంపక ♦ యకట నేన
యేల వచ్చితి వచ్చిన♦యింతి నిన్నుఁ

దోడితేనట్టిఫలము దో♦డ్తోన కలిగె
నెటులు నేఁ దాళి భరియింతు ♦ నీవిరాళి.

కం. అన విని చెలికాం డ్రందఱు
ననునయవచనముల నించి ♦ యలరించి భయం
బు నయంబు దగఁ ఫణీశా
యిని కలవింకుంచు విన్నఁగ ♦ నిట్లని రంతన్.

సీ. మెరవడిగా నీతి♦సరళిఁ దెల్పెడుమంత్రి
జనులతోఁ గార్యయో♦జనలు లేక
రాయసమ్ములవారు ♦ ప్రౌఢులై వినుతించు
దినసరివర్కు నల్ ♦ వినుట లేక
మొలమిని ముందుగా ♦ దళకర్తలను బిల్చి
యట నిటఁ బంపువె♦ట్టుటలు లేక
బలిమిగా నుండు ను♦క్కళమువారికిఁ దెల్పు
టకు వేత్రులను పంపు♦టలును లేక
తే. గీ. వృష్ణిభోజాధివిభునిబి♦రీన మైన
శిబిర మొనగూడఁ జతురంగ♦సేనతోడ
నెంతయును హెచ్చి యసురపై ♦ నెత్తివచ్చి
కటకట మిటారిఁ దలఁతురా ♦ కంసవైరి.

కం. వలచినవారలు లేరో!
వలపించివారు లేరో! ♦ వనితల నిట్లా
తలఁచుకొని సమరముఖమునఁ
బలవించినవారు గలరె ♦ పద్మదళాక్షా?

ఉ. చూడక చూచినట్లు తమి♦సోలుచు సొక్కుచు మోహ ముంచి మా
టాడక యాడినట్లు కల♦యన్ గమకించి మదిన్ గణించి యా
చేడియతోడిలోక మయి ♦ చింతిలి కార్యము నెంచకుండుటల్
పాడియె తెల్పుమా దయిత♦పాండవ కాళియమకాళితాండవా.

సీ. అంగనామణి యైన ♦ యల్లరుక్మిణి యుండ
యువతి యైనట్టిజాం ♦ బవతి యుండ
ననమానలక్షణ ♦ యల్లలక్షణ యుండఁ
గాంత యైనట్టిసు ♦ దంత యుండ
[1]సువచోభినందన ♦ సూర్యనందన యుండ
నందగత్తియ మిత్ర ♦ విందయుండ
ననిశసేవోన్నిద్ర ♦ యగుభద్ర యుండంగ
నాథాశయజ్ఞ యా ♦ రాధ యుండ
తే. గీ. మఱియు వేవేలగరితలు ♦ మానవతులు
స్వామినగరను గల రైన ♦ నారిలోన
నెవ్వతెఁ దలంచ కయ్యయో ♦ గవ్వ యైన
సత్యఁ దలపోసి చాల వా ♦ చార నేల.

ఉ. అప్పుడె సామివెంట నమ ♦ రారిగయొనర్చురణంబుఁ జూడఁగాఁ
గప్పురగంధి వత్తు నన ♦ గ్రక్కున ర మ్మన కింకి నీడ కీ
విప్పుడు రాఁదలంచితివి ♦ యొంతయుఁ బూవిలుకాఁడు మాయచేఁ
గప్పుచు [2]గప్పుచి ప్పనుచుఁ ♦ గల్వలకోరులు కుప్పళించిరన్.

సీ. వెలఁదివాతెర యాను ♦ వితముగా నీమోవి
నీవె యానుచు గ్రుక్క ♦ నించుసొక్క
తరుణిఁగౌఁగిటఁ జేర్చు ♦ హారువున నీబొమ్మ
నీవె కౌఁగిటఁ జేర్చు ♦ నిండుతక్క
అతివకాళ్లకు మ్రొక్కు ♦ నట్లు నీపదముల
నీవె వ్రాలుచు నంటు ♦ నీటుమ్రొక్క
పడఁతిచెక్కులు చీరు ♦ వడువున నీచెక్క
నీవె చెనక గోర ♦ నినుచునెక్క
తే. గీ. నిందుముఖి సందుచేసిన ♦ యంద మొంద
నీతొడలు నీవె కదియించు ♦ నేర్పుటెక్క

పా. 1. సువచనానందన. పా. 2. గప్పుతెప్పనుచుఁ.

నిక్కువంబుగఁ గంటి మెం♦దేనిఁ జూడ
మవని నీ కేటికింక యా♦దవకులాంక.

సీ. సుదతిగుబ్బలమీఁద ♦ సుఖయింపుచుండఁగాఁ
దెలిరైక తప మెంత ♦ సలిపెనొక్కొ
తరుణితొడలమీఁద ♦ మెఱయుచునుండఁగాఁ
బావడ యేపూజఁ ♦ బ్రబలెనొక్కొ
పొలఁతిమే నెల్లఁ గ♦ప్పుక యుండఁ జెంగావి
చీర యేపుణ్యంబు ♦ చేసెనొక్కొ
యువిదవాతెర నాని ♦ యుండంగ ముక్కఱ
నునుముత్య మేనోము ♦ నోమెనొక్కొ

తే. గీ. రమణిఁ దనమీఁదఁ బొరలుకుం♦కుమపుఁబఱపు
బళిర యెంతటిభాగ్యంబుఁ ♦ బడసెనొక్కొ
యనుచు నేవేళ నో రత్తి ♦ యుబుచె దేల
యకట చెలిపొందు గోరి మో♦హకటవైరి.

సీ. బలిమిచేఁ గేల్తన♦పాలిండ్ల నుంచుక
లేమ కులుకుచు నెఱ ♦ లేకయున్న
మాఱి పంటఁ దెలనాకు♦మడుపు పందుకొ మ్మని
యుత్పలేక్షణతోడ ♦ నుండ కున్నఁ
దెలిచల్లడముమీఁది♦ మొలకట్టు నిమురఁగా
నరచూపుతో నింతి ♦ మురియ కున్న
జన్నులపైపైఁట ♦ జాఱఁగా నెడ వ్రాలి
హరిణాక్షి యపుడు మై ♦ నొరయ కున్న

తే. గీ. ననుసుళువుదండిసూరెపా♦నుపునఁ బండి
యూరకే మేలుకొని యుండి ♦ యుండలేక
భామ యోరామ యోసత్య♦భామ యనుచుఁ
గలువరించెద వేమి యో♦కొలముసామి,

కం. చెలువం దలంచ బవరము
చెలు వంతయు నిలిచె గోప♦శేఖర తోడ్తో
వలవంత నీదుమదిలో
బలవంతం బయ్యెఁ గంతు♦బవరము లేమిన్.

ఉ. తిన్నని మోవి విం దొసఁగి ♦ తీరుగ గుబ్బలజోడు దార్చి యా
యన్నులమిన్నఁ జేర్చి తన ♦ యంగబలంబునఁ గూర్చి యార్చి ని
న్నన్నిట సేదదేర్చి నగి ♦ యందపుజంకెనచూపుకోపులన్
మన్నన సేయకున్న వన♦మా యసమాయుధుబారి గెల్వఁగన్.

చ. వనజదళాక్ష నీమనసు♦వచ్చినయ ట్లవుఁగాక నిన్నుఁ గా
దనియెడువారమా కలికి ♦ యందఱిలోఁ దరితీపులాఁడి లోఁ
జనవరి మాటకారి కను♦సైగల నివ్వలపించుబాల యా
వనితను బాసి తాళఁగల♦వా యలవా టటువంటిదే కదా.

ఉ. అజ్ఞత మున్ను నే మెఱుఁగ♦కాడుట కోడుటగాఁ దలంచు స
ర్వజ్ఞుఁడ వీవు లోకమున ♦ స్వామి యెఱుంగనికార్య మేమి నీ
ప్రజ్ఞకు శేషుఁడైన సరి♦రాఁ డటు గావున మార్గమందు నీ
యాజ్ఞలు హెచ్చ నిచ్చుటికి ♦ నాసతిఁ బిల్వఁగఁబంపు మింపుగన్.

కం. చెలిఁ బిలువఁబంపవలె నను
చెలికాండ్రను జూచి సన్న ♦ సేయుచు వగగా
నలపంకజనయనునితోఁ
గలవింకుం డనియె హాస్య♦కలనం బెసఁగన్.

కం. నలినాక్ష విరహ మనఁగా
నలుపో తెలుపో యి దేటి♦నటనలు బళిరా
నలుపైనఁ జీఁకి టేదియొ
తెలుపైన న్వెన్నె లేది ♦ తెలిసిటు చెపుమా.

కం. మామగువ నెపుడు దలంచిన
మామది నొకచింత లేదు ♦ మాకున్ మీకున్

కాముఁడు వే జాయెనో
భూమిని గంసారి యిన్ని♦బూమెలు గలవే.

కం. మదిరాక్షి పేరు నుడువక
మొదటనె రుక్మిణియు వినిన ♦ మోసం బగుఁగా;
యదె ప్రద్యుమ్నుఁడు వచ్చెను
పదిలము పదిలంబు వికచ♦పంకజనయనా.

సీ. చామ యంటి వ దేమి ♦ సామి చేలను గాక
చామ యీశిబిరంబు♦చాయఁగలదె
లతకూన యంటి శ్రీ♦పతి తోఁటలోఁ గాక
లతకూన పటకుటీ♦వితతిఁ గలదె
కొమ్మ యంటివి హరి ♦ కుజములందునె కాక
కొమ్మ యాయోధన♦క్షోణిఁ గలదె
[1]నారి యంటి వ దేల ♦ శౌరి వింటను గాక
నారి నాసీరకో♦ణమునఁ గలదె
తే. గీ. ముద్దుగు మ్మంటి వది యేమి ♦ ప్రొద్దు పోదె
మొదవుచంటను గాక యిం ♦ దొదవ దరుదు
చెంద మాటాడుదురె యిట్టి♦మందెమేల
మందమూ చందమూ గొల్ల♦చందమామ.

సీ. ఏసాధ్వికోసమై ♦ యిలను సత్రాజిత్తు
గుట్టు పోనాడిన♦ట్టు గలిగె
నేపుణ్యవతి నెంచఁ ♦ బృథ్వీశ్వరులలోన
నెలుఁగురాయల పట్టి ♦ నేల వలసె
నేభాగ్యవతిఁ గోర ♦ నినుఁ డిచ్చుమణికిన్నె
తొలుత నీపై వట్టి♦దూఱు పుట్టె
నేసతిఁ బెండ్లాడ ♦ నెనయ రుక్మిణిచేత
వడిసుళ్ల నేప్రొద్దు ♦ జడియవలసె

పా. 1. నారి యంటివి మేలు♦.

తే. గీ. సవతె వరుమానసము జాలి ♦ నిడినదానిఁ
దలఁచి యిల వ్రాలి సోలి చిం♦తిలఁగవలసె
నట్టిసాత్రాజితిఁ దలంచ ♦ నమగఁ గాంచ
నేల యీవేళఁ జాల గో♦పాలబాల.

సీ. కేకవేయుచు సారె ♦ కెరలి నవ్వఁగవచ్చు
నునుమోవిఁ బలుగెంపు ♦ లునుపవచ్చు
గోటికొద్దిని నొక్కి ♦ గుఱుతు లుంచఁగవచ్చు
నానమీఱినమాట ♦ లాడవచ్చుఁ
గుంకుమనిగ్గైన♦కోక గట్టఁగవచ్చు
దండుకుఁ దోతెంచి ♦ యుండవచ్చు
బయటను కొల్వుండి ♦ పాడించుకోవచ్చుఁ
దిరువాళ్ల జతగూడి ♦ తిరుగవచ్చుఁ

తే. గీ. గాన వెలయాలు గల్గ లో♦కమున మేలు
గలుగు నెటువంటివాని కా♦కతలు మాని
పడవకై వచ్చినట్టియీ♦యెడల వట్టి
గొడవ యిల్లాలిపై బాళి ♦ గోపవరాళి.

కం. వెలచెలికి సామి వలచినఁ
గలుగుఁ జను వెల్లఁ దాపి♦కాంద్రకుఁ దోడ్తోఁ
ఫలియించు పూఁాంతకారుల
తలఁపులు విటజనులశిక్ష ♦ తామరసాక్షా.

ఉ. సామరు లూడిగాల్ నృపతి♦చంద్రులు రౌతులు పైనవజీర్లు పే
రామున నిచ్చటం బటగృ♦హమ్ముల నిమ్ముల నాగవాసపుఁ
లేమల పేఱువేఱ తగి♦లించుక ముచ్చటఁ గూడి యుండుటల్
సామి యదేమి దెల్పుదును ♦ సంతతముం గనుపండు వయ్యెడిన్.

సీ. బాలుఁ డౌచును నిన్ను ♦ లాలించురాధను
కాపుఁ జేసినయట్టి♦గాయకంబు

నీరాటకై వచ్చు♦నీరజాక్షులగుట్టు
అట్టుచేసినయట్టి♦దిట్టతనము
నన్నంబు దెచ్చిన♦జన్నంపుగరితలఁ
గాటు మేపినయట్టి♦నీటుతనము
గొల్లపల్లెల నున్న♦కొమిరెల వలపించి
దూఱు చేసినమాయ♦దారితనము

తే. గీ. మఱచి ప్రాకృతజనులట్లు ♦ వెఱచివెఱచి
వసుధఁ బరకాంత నొల్లని♦వానివలెనె
నిచ్చ నిల్లాలిపై బాళి ♦ యెంచ నేల
యేల పసిగాపురాజ నీ ♦ కిట్టిరోజ.

మత్తకోకిల.

భండనంబున దైత్యుఁ గొట్టఁగఁ ♦ బాళిమ ల్వెడియింపుచుర్
దండు సేయుచు నుండఁగాఁ బ్రమ♦దామణిర్ సతిఁ దెత్తురా
నిండుజవ్వన మబ్బుగుబ్బలు ♦ నీటుచూపులు మీఱ నీ
యండ నుంచుకయుండఁగా వెల♦యాంద్రు కర్వయినారకో!

ఉ. గామిడిదైత్యునింటఁ జెఱ♦గా వసియించుపదాఱువేలకాం
తామణులర్ గ్రహించుటకుఁ ♦ దన్విని దీమము చేసి తెచ్చెదో
కాముని వేఁటలాడఁగ మె♦కంబుల కెల్లను వేఁట యిట్టి లే
దీమపుపుల్గు పుల్గులకుఁ ♦ దే గమకించినబోయకై వడిర్.

సీ. సారంగి కనకాంగి ♦ చక్కనిరత్నాంగి
బాల యంబుజపాణి ♦ నీలవేణి
దమయంతి యపరంజి ♦ కమలాక్షి మెలనాగ
కావేరి యింద్రాణి ♦ పూవుఁబోణి
బంగారుతీఁగె రూ♦పవతి కళావతి
చిత్రాంగి శశిరేఖ ♦ చిత్రరేఖ
మదనమంజరి యిందు♦వదన కోమలవల్లి
మదహాత్తి కల్యాణి ♦ మధురవాణి

తే. గీ. యనఁగఁ బొగ డొందు వెలయాంధ్ర • యందు నొకతెఁ
దళుకుగలదానిగాఁ జిన్న • దానిగాను
పొంకముగ నేర్పరించి య • లంకరించి
తోడి తెచ్చెద నీదండఁ • గూడియుండ.

వ. అనిన విని కోపంబు నెమ్మనంబునం గ్రమ్మఁ గ్రమ్మవిలుకానిఁ గన్నచక్కనిసామి యేమిరా పాపజాతి నీవు బాఁపనజాతి నెటువలెఁ బుట్టితివో కాక, నీవునుసరికాకఘూకరుతమ్ములు నీభాషణమ్ములునుసరి యనేక లోకుల దూషించి నవ్వనీకు నేలోకమ్ము మీఁదుగట్టియున్నది? కన్నదియు విన్నదియుంగాదు నీవగ యేవగ నేవగించిన వికృతవదనుండవై యెంత వారినైన సరకుసేయవు విగతలజ్జుండవై యేపనికిని రోయవు మేలుమేలని యపగతశంకుని నాకలవింకునిం గని యిట్లనియె.

కం. రాజసభ నుచిత మెఱుఁగక
వాఁ జెడి తోఁచినవి పిట్ట • వలెఁ బ్రేలెదుగా
యేజాతినరులఁ గానము
నీజన్మం బిటుల నిట్ల • నే వేగెఁగదా.

కం. ఒకవేళఁ గూనిరాగము
లొకవేళ న్వెకలినవ్వు • లొకవేళను పొం
దిక లేనిచాడిగోణఁగులు
వికటపుమఱుగుజ్జ నీకు • విధి దయచేసెన్.

కం. తర మెఱిఁగి పలుకుటలు నీ
తరతరమున లేని వాట • ధర నెఱుఁగరొకో
దొరగరితలవిరహమ్ములు
వెఱపులు నీ కేటి కింక • విడు కలవింకా.

ఉ. ఒప్పులకుప్ప లౌ సతుల • నొప్పఁగఁ జేరుచుఁ బంతు మీఱుచున్
ముప్పిరిగొన్న మోహమున • ముచ్చట లాడుచు నిచ్చఁ గూడుచున్
దెప్పలఁదేలురాజులకుఁ దెల్విడి • బల్విడిఁ గూడు నాజ్యమున్
పప్పును మెక్కపల్లఱపు • బాఁపని కేమయినాను తెల్పునా.

చ. ఎఱుక గలట్టివానివలె ♦ నే పని కడ్డము వచ్చి తూటి లో
గరువము హెచ్చి నిచ్చలును ♦ గామిడివై మమువంటివారితోఁ
బరుసపుమాట లాడెదవు ♦ బాఁపని కేనుఁగుబుద్ధి చాలదో
గరితల నెన్ను వేళ వెల♦కన్నెలవన్నెల నెన్నఁ బాడియే.

కం. జాలము మందులపొందుల
జాలిం బడఁజేసి తాళఁ♦జాల మటంచున్
తేలింతురు [1]వెలజంతలు
గాలింతురు చేతిసొమ్ము ♦ గడెవడిలోనన్.

కం. వల పోకచోఁ బిలు పోకచోఁ
బలుకులు వేఱొక్కచోట ♦ భావం బొకచో
వెలయించు వెలమిటారుల
వల కగపడి [2]మోసపోవు♦ వారలు గలరే?

కం. మే లెంతురు కులకాంతలు
తేలింతురు రతులఁ గొంకు ♦ దీర్చినకొలఁదిన్
పాలింతురు కులధర్మము
తాలిమి పచరింతు రెంత ♦ తహతహ యైనన్.

చ. అహరహ రేధమానశుభ♦మన్వయవృద్ధికి సాధుబుద్ధికిన్
విహితము ప్రేమభావనకు ♦ విశ్రుతకీర్తికి నున్కిపట్టునై
యిహపరసాధకం బగు కు♦లేందుముఖీసుఖ మెంతవానికిన్
బహుళతరజన్మపుణ్యపరి♦పాకమునన్ ఫలియించు నెంచఁగన్.

సీ. దాక్షిణ్యములగీము ♦ లక్షణంబులదీము
వ్రతములయొరగల్లు ♦ రతికి నిల్లు
నెఱతనమ్ములతావు ♦ నిక్కువమ్ములప్రోవు
కలిమికి దాపు భా♦గ్యములకోపు

పా. 1. వెలయింతులు. పా. 2. మోసపోవు♦వారుం గలరే.

వినుతికి విడిపట్టు ♦ వినయమ్ములకు గుట్టు
కలఁకకుఁ గెళవు కీ♦ర్తులకు నెళవు
పతిభక్తికి బిడారు ♦ సుతరత్నపుఁగొటారు
ధర్మంబులకు మూట ♦ దయకుఁ గోట
తే. గీ. యనుచు నందఱుఁ గొనియాడ ♦ నతిశయించు
కులసతిని జేరి యన్నింటఁ ♦ గొంకు దీరి
యాత్మ సుఖియించు నేధన్యుఁ ♦ డట్టివాని
కడఁక చెలువొందు నెందు నీ♦పుడమియందు.

కం. చెలివలపును నావలపుఁ
దెలియక నీ విటులు వదరి♦తే నే మగు నీ
తలఁపులు నీవెడపల్కులు
కల వింకా కొన్ని విడువు♦గా కలవింకా.

వ. అనిన విని చకితభావుండై యసంగతవచనజనితకళంకుం డగుకల వింకుండు విచ్చలవిడి పెచ్చు ప్రేలక ప్రుక్కి గచ్చులు దక్కి రిచ్చవడి ప్రుచ్చువలెఁ బులుకుపులుకునం జూచుచుండె నంతఁ గంసాంతకుండు మఱియు వేదండగామినీవిరహవేదనాదోధూయమానమానసుండై తనయిం గితం బెఱింగి వినయంబునఁ బెనంగు ననుంగుచెలికాంద్రుఁ గనుంగొని యిట్లనియె :—

చ. కనికర మెంత వింతనుడి♦కారపుమాటలనీటు లెంత నె
మ్మనమునఁ బ్రేమ యెంత జిగి♦మాయనిమేనివిలాస మెంత నా
మనసున నున్నవంతమును ♦ మర్మ మెఱింగి కరంచు టెంత యే
వనజదళాక్షు లాసమద♦వారణయానకు సాటి వత్తురే.

చ. దుసికిలినట్టిపోఁకముడి♦తో వసివాడినమొగ్గంబుతో
మసలెడిచూపుతో మెఱుఁగు♦మాసినగుబ్బలకుంకుమంబుతో
ముసిముసినవ్వుతో రతుల♦ముచ్చట లాడుచుఁ బైఁటకొంగుచే
విసరుచునున్నయన్నెలఁత ♦ వేడుక నేఁ డొకసారి కల్గునే.

చ. అలరులశయ్యమీఁద జల♦జాననఁ దానుచు నేనుఁ గూటమిన్
మలయుచు నుండునో, జెఱఁగు♦మాసిన నుల్కుచు లేచి కుల్కుచున్
వలువ ధరించి యిత్వడలి ♦ వాలికచూపుల నాదుదుప్పటిన్
దొలఁకెడుచిన్నిచెయ్యివలనుఁ ♦ దోఁచమిఁ జేసిన డెంచ శక్యమే.

చ. ఎనసినపిమ్మట న్నిలిచి ♦ యో కయిచేసికొనంగఁ జూచి తా
వెనకరుమాల గట్టుటకు ♦ వెన్కకు వ చ్చురవ్రాలి వెన్నుపైఁ
జనుమొన లాని యానినప♦సం దమి రేఁచుమెఱుంగుఁబోఁడి నె
మ్మనమున నెన్నునో మరుఁడు ♦ మాటికిమాటికి లూటి సేయఁడే.

చ. మురువుగ నిల్చి యవ్వలఁది ♦ ము న్నొకనాఁడు తలంటుచున్నచోఁ
గరములు నూనెగా నడప♦క్షత్రియ యిచ్చువిడెంబు గై కొనన్
దొరయక దానిఁ బొమ్మనుచుఁ ♦ దోడనె పుక్కిటివీడె మాని బి
త్తరము తలంటుతాళగతిఁ ♦ దప్పనితత్తర మెన్న శక్యమే.

చ. సొగసుగ నేఁ దలంటి మెయి♦జొమ్మన నూనె నలుంగువెట్టి నా
వగలను గుల్కుబోటివలు♦వం జనుదోయి మఱుంగు సేయుచున్
సగము తలంటు దోయి యని ♦ చానలు దెల్పిన నియ్యకొంచు నా
మగువలఁ బొమ్మటన్న కను♦మైసరి నేసరిఁ బోల నేర్తునే.

మ. జడిగొన్నోర్కుల నింతి తాను మగవే♦షం బూని నువ్వింపిణీ
జడలన్ పాపిట రావిరేక జిగి హె♦చ్చన్ గొప్పు పొంకించి య
య్యెడ నాయాఁటతనంబు చూచి నగి పో♦యి న్నన్ను లాలించి యొ
క్కుడుపీఁకన్ మగపంతముల్ సలుపుచె♦క్కుల్గిల్లు టిం కెన్నఁడో.

సీ. చనుమొనల్ కనుఱెప్ప♦లనె యప్పళించినఁ
దెర సేయుకన్నులు ♦ తేలవేయు
గళముపల్మొనలచే ♦ గిలిగింత గొనఁజేయ
గరుచెక్కు మురియాడు♦గఱచి చొక్కు
నునుదోఁశ లదరంటఁ ♦ గొనగోరులను జీరఁ
బొఱలించు సందిట ♦ గుఱుతు లుంచు

ముని వ్రేళ్ల నునుపోఁక♦ముడి నెమ్మి రెమ్మినఁ
జలపట్టు నెంతయు ♦ సెలయఁ గొట్టు

తే. గీ. సువిదితమి యెంతొ క్రియల నౌ♦నుచిత మెంతొ
మనసువగ యెంతొ నామది♦మమత యెంతొ
యే మని నుతింతు నెం తని ♦ ప్రేమ గాంతు
విధికి నేమందుఁ జెలి నెట్లు ♦ విడిచి యుందు.

సీ. మణితంబు సేయుచో ♦ మరుఘక్కఁ దలఁపించుఁ
బలికిన మౌగ్ధ్యంబు ♦ నలవరించుఁ
గేక వేసినఁ గంచు ♦ గీచినవగ నించుఁ
బడము పాడిన సిగ్గు♦నఁ దల వంచుఁ
బైకొనుచో దొర♦పాడిజ గనుపించుఁ
బవ్వళించిన లంకె♦పాటు నించు
రాకొట్టుచో వింత♦రక్తి నౌ ననిపించు
ర మ్మన్న వినయంబు ♦ గ్రుమ్మరించుఁ

తే. గీ. బ్రౌఢియును గోలతనమును ♦ బరఁగ నిట్లు
నన్నుఁ జెలి మోహమున డాయు ♦ నయముఁ జేయు
నట్టిప్రాణేశ్వరిని బాసి ♦ యలఁత నిట్టు
లలవరింతు నయో యెట్లు ♦ నిలువరింతు.

సీ. అతివచక్కెరమోవి ♦ యాన జిహ్వ దలంచు
సుదతిమోమున నుండఁ ♦ జూపు లెంచు
నారిపొక్కిట ప్రేలు ♦ నడయాడఁగా నెంచు
గోరు లింతిపిఱుందుఁ ♦ జేర నెంచు
మించుఁబోఁడిని కౌఁగి♦లించ బాహువు లెంచుఁ
జానపల్కులు విన ♦ వీను లెంచు
వనజాక్షి మోము మూ♦ర్కొనఁగ నాసిక యెంచు
వనితచన్మొన లాన ♦ వక్ష మెంచుఁ

తే. గీ. గాన ని ట్లంగములు పరా♦ధీనవృత్తి
నానినటు లైన మరునైన ♦ నసురనైన
నతనుసంగరమున నుల్ల ♦ మతిశయిల్ల
నెటులు గెలిచెదనో కాక ♦ యింతిలేక.

మ. ప్రమదారత్నముఁ జూడకున్న నవలా♦పాదాబ్జపాంసుచ్ఛటా
క్షమ లేఁజెమ్మటజాలునా సలిలముల్ ♦ చారుస్మితజ్యోత్స్నఁ దే
జము నిట్టూర్పున గాలి కౌనున బయల్ ♦ సంధిల్ల జీవంబు జీ
వము నేకంబు ఘటించుఁగాని సమర♦వ్యాపార మింకెంతునే.

కం. నావుడుఁ జెలికాం డ్రావసు
దేవాత్మజుఁ జూచి యతని♦తీరును నవలా
రావలె నటన్నతలఁపును
భావంబున నెంచి మగుడఁ ♦ బల్కిరి వేడ్కన్.

కం. దేవరయానతి మదిలో
భావించిన యుక్త మగును ♦ పద్మదళాక్షీ
తావి నెడఁబాసియుండెడి
పూ వెందును నట్ల కాదె ♦ భువి నీనడకల్.

కం. చంద్రు నెడఁబాసి యుండునె
చంద్రిక చంద్రికను బాసి ♦ చరియించునొకో
చంద్రుం డిపు డాకై వడిఁ
జంద్రముఖియు నీవు నెనసి ♦ చరియించుగతుల్.

కం. నీ మమత తెలిసెనేకద
భామామణి యచట నెంత ♦ పలవించునొకో
మీమనసులు మీవలపులు
కాముఁ డెఱుఁగుఁగాక యొరులు ♦ కానంగలరే.

కం. నావుడుఁ జెఱున వ్వొలయఁగ
భావజజనకుండు వికచ♦పద్మదళాక్షిన్

రావింపఁగోరి యుండఁగ
నావేళను జనుల కెల్ల ♦ నద్భుత మెసఁగన్.

సీ. బంగారుచెంగావి♦పావడలమెఱుంగు
బయ లానునట్టినె♦మ్మేయిబెడంగు
పచ్చరాపలకడాల్ ♦ రచ్చఁ బెట్టెడిచిన్ని
పొసఁగెడిఱెక్కల♦పసరువన్నె
కపురొందునింద్రనీ♦లపుపొగరు లెసంగు
శిరసునఁ దగుకర♦జిగిహారంగు
నలుదెసలందు సం♦దపుముత్తియపుముగ్గు
చల్లెడియుదరంబు♦తెల్లనిగ్గు

తే. గీ. నెఱపసపునీటిచాయలు ♦ నిక్కుముక్కు
బెరయ నున్నట్టుమాటికి ♦ తిరుపు గట్టి
చేరి యటమీఁద శౌరిముం♦జేతిమీఁద
వ్రాలె రహిఁ జిల్క నొకపచ్చ♦వన్నెచిల్క.

చ. అటువలె వ్రాలి యంతఁ జిగు♦రాకుకటారివజీరుతేజి యు
త్కట మగుసత్యభామచెయి♦తావి నునుంబస పంటె ఘుమ్మనన్
చిటిపొటిఱెక్కలెమ్మెరల♦చే వడి దేరినదానవారితో
నిటు లనె నీళమాళిగళ♦దిందుసుధామధురోక్తి వైఖరిన్.

ఉ. సామి జొహారు నీ కసుర♦శాసన నీపదదర్శనంబుచే
నీమెయి నామది న్మిగుల♦ హెచ్చినధన్యత గల్గె నయ్యె నే
నామున సత్యభామకర♦మందు వసింతు మృగాక్షి నన్ను నెం
తే మదిఁ బ్రోది సేయుటలు ♦ దేవరచిత్త మెఱుంగునేకదా.

కం. అకలంకచరిత నీకున్
శుకవచసం బింపు గనుక ♦ సుదతీమణి యా
త్మకథలు దెలుపు మనన్ నే
వకజనమందార చేర ♦ వచ్చితి నెలమిన్.

తే. గీ. నిన్ను వరియించఁగా నెంచి ♦ మున్ను సత్య
భామ యుద్యానమున గౌరి♦నోము నోప
నంబ ప్రత్యక్షమై కోర్కె ♦ లతివ కొసఁగి
కృప వెలయ నన్ను నొసఁగి తా ♦ నిట్టు లనియె.

మ. చెలి యప్రాకృత మీశుకంబు వినుమా ♦ చేదోడువాదోడునై
తలఁపుల్ నీకు ఘటించు నౌ నకలవి♦ద్యాశాలి యస్మద్దయా
కలనం బేర్పడుమేటి యీపులుఁగు నిం♦క న్నీవు చేపట్టినన్
కలుగు న్నీకును నిన్ను నేలుదొరకుం ♦ గల్యాణసాఫల్యముల్.

కం. అని గౌరి తనుఁ గటాక్షిం
చినది మొదలు సత్యభామ ♦ చేకొని నన్నున్
తనపై దోడువలెం బ్రో
చును మఱి ప్రాణంబుకన్న ♦ సొంపుగఁ జూచున్.

సీ. అమృతమధ్యమునఁ జె♦న్నార నుండెడుమాకు
నీచొటికడలిపీ ♦ డేమి యరుదు
తనరురత్నద్వీప♦మునను ద్రిమ్మరెడుమా
కెన్న జంబూద్వీప ♦ మేమి యరుదు
పైఁడికడిమితోఁ♦టనీడఁ జేరినమాకు
నెలమావిక్రీనీడ ♦ లేమి యరుదు
కనకపద్మంపువా♦సనలు గనెడుమాకు
నితరవర్ణసుగంధ ♦ మేమి యరుదు

తే. గీ. పరమశివసభఁ బార్వతీ♦పాణిముఖర
వేణువీణానినాదంబు ♦ విన్నమాకు
నిచటిమనుజులసంగీత ♦ మేమి యరుదు
గాన సాధారణశుకంబఁ ♦ గాను నేను.

చ. గడియ కనేకపద్యములు ♦ గ్రక్కున నే రచియించఁ జూచి యా
వడి నుడువం దలంచి గౌర♦వంక కడున్ బొమ నిక్కఁజేసి వా

దడిపిన నవ్వి నీదుకవి♦తల్ రచియించిన నట్టు లుండునే
బుడిబుడి బట్టికాఁడు కును♦బుద్ధులు గైకొను నంబవెంబడిన్.

చ. హరునకు నద్రికన్యకకు ♦ నప్పుడు మేలపుటల్క గల్గినన్
వెఱవక చెంతఁ జేరి కడు♦వేడుక నిద్దఱ నూరడించి క్ర
మ్మఱ నలజోడు గూడి నెఱ♦మక్కువ నుండ ఘటింతుఁ గాన న
బ్బురములె లోకమందు నను♦బోఁటికిఁ దక్కనరాయబారముల్.

తే. గీ. అవని నీసత్యభామయు ♦ నంబుజాక్ష
నీవు మాపాల గిరిసుతా♦ నీలకంఠు
లగుట మిముఁ గొల్వవలె నను♦నాస వొడమ
సామి చేరితి నీమీఁద ♦ శరణ మనుచు.

చ. ఇది యిటు లౌఁగదా యదుకు♦లేశ్వర తావకపాదసేవ న
భ్యుదయము గల్గె మాకు నసి♦తోత్పలనేత్రకుఁ గార్యసిద్ధియున్
మొదటనె కల్గెఁ గావునను ♦ ముచ్చట హెచ్చఁగ నింతికోసమై
వదలనివీఁక నేఁ దెలుప♦వచ్చినకార్య మొక్కింత దెల్పెదన్.

చ. శకునముఁ జూచి నీ వవల♦సాగినపిమ్మట మేడ డిగ్గి యా
చకితకురంగనేత్ర మది♦చాపలమున్ భ్రమయున్ శ్రమంబు లోఁ
దుకతుకపై సెకల్ చెమట♦తుంపురులుం గెరలంగ నూర్పు లూ
రక నిగుడంగ గుండె యద♦రంగఁ దరంగదపాంగబాష్పయై.

కం. తడఁబడునడలున్ గడగడ
వడఁకెడిమొడలుం గడంక♦వడుచూపులు ని
ల్కడలుం గడలుకొనం జెలు
లాడికమ్మునఁ దోడితేఁగ ♦ నుపవనసీమన్.

తే. గీ. కాఁక సోఁకినపైఁడిశ♦లాకవలెను
కలఁకఁబాఱిన వెన్నెల♦మొలకవలెను
జిగురుకండెను దగిలిన♦చిలుకవలెను
కోమలి విరాళికిని జిక్కి ♦ గుట్టు దక్కి.

కం. బెగడుచుఁ దనమదిఁ దెగడుచు
నగణితమోహమున నుపవ♦నాంతరసీమన్
చిగురుతివాసున జిగి దగి
సొగ నగువిరిసెజ్జఁ బొఱలు♦చుం బలుమాఱున్.

కం. నీరూపు నీవిలాసము
నీరేకయు నీదురతుల♦నేర్పును మదిలో
నూరక తలపోయుచు మది
దీరక చెలు లెల్ల నేద♦దేర్చుచునుండన్.

శా. ఇంకా మేలిమితోడ నుండదుసుమీ ♦యేణాక్షి యేణాంకమీ
నాంకాతంకవిశంకటప్రసవప♦ర్యంకస్థలిన్ గంధవా
హాంకూరాహతి సోలి వ్రాలి భవదీ♦యధ్యానసంధానని
శ్శంకప్రక్రియఁ దేలితేలి విరహ♦జ్వాలాకరాళాంగియై.

కం. వగుచు న్మాటికి విధికిం
దెగుచుం జెలి యుండియుండి ♦ తెఱవల కెల్లన్
మొగుచుం జేతులు మనమునఁ
దగుచుమ్మలుచుట్టు విరహ♦తాపముకతనన్.

సీ. వనమాలి యిదె వచ్చెఁ ♦ దనమాలిమి నటంచు
ఘనమాలికను జూచి ♦ కలువరించుఁ
గనఁజాలునిలఁదళు ♦ క్కనఁ జాలుజిగిమించుఁ
గని జాళువాచేల ♦ యని తలంచుఁ
గరవీరములఁదేఁటి♦మొఱ వీరగలిపించు
మురళీరవం బని ♦ మోహ మొంచు
ముద మూని తెలియ కం♦గద మూని చలమించు
నెదమానికం బని ♦ యిచ్చగించుఁ

తే. గీ. దెలిసి వెఱఁగంది యెదఁ గుంది ♦ పలువరించుఁ
దలఁపునను డాసి కను మూసి ♦ కలువరించు

మరునిచే నున్నపొన్నపూ♦దురుసుకిరుసు
చెనకులకు నోడి ధృతి వీడి ♦ చిగురుఁబోఁడి.

చ. వనజదళాక్షి గోల యదు♦వల్లభ దుర్లభతావకాంఘ్రిసే
[1]వనజనితానురాగభర♦వర్ధదనంగదశాకృశాంగియై
వనరుచునున్న దింతులను ♦ వంతలఁ బెట్టుట పాడి యౌనె యే
పని యెడఁ గల్గినా చెలులఁ ♦ బాయనివై పున నుండఁగాఁ దగున్.

తే. గీ. ఏమి తెల్పితినో యని ♦ యెంచవలదు
బాల యిఁక నొక్కక్షణ మైనఁ ♦ దాళలేదు
ద్వారకకు నంపఁదగునట్టి♦వారి ననిపి
చంచలాక్షిని వడిగ ర♦ప్పించవలయు.

చ. మన విటు లేను దెల్పి తను♦మానము సేయక చిత్తగించు నా
ఘనతయు నాప్రసిద్ధియు జ♦గంబున నంద ఱెఱుంగఁగా మదిం
దనియక చెందుచు న్నవసు♦ధారస మొక్కఁడునాదుపల్కులన్
విని తల యూఁచనట్టిపృథి♦వీవరు లెవ్వరు కంసశాసనా.

వ. అని యివ్విధంబున విన్నవించిన పంచవర్ణకీరంబునకు సంతసించి మఱియును వినుతించి మగుడ ననిచి యంతకుమున్న తనకు సమయోచితాలాపంబులఁ బ్రొద్దుగడపిన సమీర మయూర సారంగ కలహంస కలరవ సురభి శశాంక మకరాంకముఖనిఖిలపరిజనంబులంగాంచి వీరు తమపేరు వాసికి వేఱు వాసి యుండక తమ యింగితం బెఱింగి పలికి రని విజయమాద్రేయసైనేయులం జూచి మందలించి కందళించినయానందంబు గ్రందుకొనఁ దమచిత్తంబులు చల్లఁజేయువాఁడు వీఁడెయని చిత్తజావతారమహాకారుం డగు రుక్మిణీకుమారుం గాంచి సకలకళాభిరామయగు సత్యభామం దోడితెమ్మని నియోగించి యంభోధితరణంబు నతిత్వరితాభిగమనంబు నుద్దేశించి యుచితచిరత్నం బగునొక్క శిరోరత్నంబు నిచ్చి యచ్యుతుం డనిపె ననిపిన యప్పు డారత్నం బద్భుతంబుగా ననర్ఘ్యమణిఘృణిధోరణీదేదీప్యమానం బగునొక్కదివ్యవిమానంబై పొల్చె. పొల్చిన నందు నిలిచి-

---

పా. 1. వనజతాంతరాగ.

ప్రద్యుమ్నుఁ డాకీరంబుబడి వాగెగా ముందఱ రాఁగ వేవేగ నంభోనిధానంబు తరించి ద్వారకాపురంబు ప్రవేశించి యరదంబు హజారంబుచెంగట నునిచి నిరంతరసమేధమానకల్యాణంబగు దివాణంబునం దగుకక్ష్యాంతరంబులు గడచి యలవడనడఁచి కంసశాసనానురాగసాగరంబు గట్టుపొఱలినవగఁ దగుమానికంపుజిగిచెందిరంబుచేఁ దిరంబగు సత్యభామామందిరంబు దరిసి యచట నేమి యలబలంబు లేమి యరసి యనుకలశిశిరవస్తునికరాదాన సమున్నిద్రగజగామినీజనయాతాయాతగమన సూచితసరణిఁ దదీయోపవనాతంబు చేరం జని యచ్చటవేచి యంతటఁ గలయంజూచి వాడినకువలయంబులును, వీడినమృణాలవలయంబులును, చిటిలినరత్నహారమ్ములును, పెటిలినగంధసారమ్ములును, కగ్గినకర్పూరమ్ములును, తగ్గినయుశీరమ్ములును, ఉడిగినసమరసపూరమ్ములును, నుడుకెత్తినతుషారమ్ములును, దొరఁగిన వకుళమ్ములును, సొరగిన కమలముకుళమ్ములును, జడిసిన యాళీజనమ్ములును, కెడసిన కుసుమవీజనమ్ములును, రిత్తలైనచలువకలువపూసింగాణులును, గుత్తులువీడి పొడిపొడిగ రాలినసుపాణులును పరికించి యచ్చెరువుగా నెంచి యందు చవిజాతిరాతిచందపొందికల నందగించియున్న కడవన్నెతిన్నెకడల నెల్లెడలఁబెల్లుగ మల్లడిగొని యుల్లలిల్లుపుప్పొళ్లఁజల్లనగు మల్లెపూసెజ్జఁ బవ్వళించి దిటమ్ము ఘూర్ణించి తనపజ్జ బుజ్జవమ్ముగ నుజ్జగించిన సజ్జగవుగొజ్జంగినీటితుంపరలు పెంపరలుగాఁ జిలుకునలుకుడుగులుకునిగనిగని పొగరుతొగరు తొగచిగురువగచిమ్మనఁగ్రోవులదీవుల నింపుజలసూత్రపు ప్రతిమలనుండి దండిగ నిండియుండి జాళువాడాలు జాలువాఱ నిచ్చలపు పచ్చలరవలనిగనిగలు గీలుకొనుకీలునెమ్మిపించంబులఁ గ్రమ్ముతెమ్మెరలనికటమ్మున నాడాడ నాడునేడాకులయనంటికపురపుదుమారమ్ములు ఘుమ్మనఁ దనపయిం గెరలం బొఱలుచు వియోగభరోపప్లవంబునఁ దెరలుచు నంబుజాక్షుదివ్యతూతరంగితాంతరంగయు ననవరతగళదవిరళబాష్పధారాళధారావిరచితాపాంగయు ననుక్షణజాయమానసంతాపయు నాయల్లకదశాతిదీనవిలాపయు నాళీజనకృతోపచారయు నలసభారవిలుప్తసంచారయు సంతతవియోగసంజనితసంభ్రమసముద్దామయు నగుసత్యభామను గాంచి నమస్కరించి కృష్ణాభిహితసందేశంబును దదీయవిరహావేశంబు నంతయు నెఱిఁగించి

యంగనాజనసమేతంబుగా నాయుపమాత నాదివ్యవిమానారూఢం గావించి తోడితెచ్చె నప్పు డాయసమానవిమానవిలసమానకాంతిసంతతి దిగంతంబుల వింతవింతగా నకాలసంధ్యారాగంబుడంబున విడంబింప సొంపునం జూచి యవ్విధంబు కంచుకిజనంబు వచ్చి హెచ్చరించిన నచ్చెరువున నగ్గిరిధరుండు దిగ్గన లేచివచ్చి మచ్చెకంటి యున్నవిమానంబు చూచి యచ్చటి నఖిలజనంబులు తొలంగ బరాబరి సేయించి పరిజనంబుల నవల ననిచి యెదురుకొని మదిరలోచన కేలు కేలునం దాటించి యానావరోహంబు సేయించి వదనారవిందమ్మున మందహాసమ్ము గ్రమ్మ వశావశంవద విలాస బంధురం బగుగంధసింధురంబుచందంబున మందమందగమనంబున వచ్చి యనంగసంగరతరంగితాంతరంగంబులు హెచ్చి శశాంకముఖియుం దానును పర్యంకంబున వసియించె నంత.

తే. గీ. తల్లిదండ్రులమనసులు ♦ చల్లఁజేసి
తన యునికికేఁగె రుక్మిణీ♦తనయుఁడటులు
మఱియు హరివేడ్క చెల్లించి ♦ మనుత మించి
యతనిసిగబొందుపైఁ జెంది ♦ యంద మొందె.

ఉ. అంగనవెంట వచ్చినమ్మృ♦గాయతలోచన లందుఁ బొందుగా
నంగజుతండ్రికిన్ జలరు♦హాక్షికి నూడిగముల్ ఘటింపుచున్
చెంగట నిల్చి తత్కరుణ♦చేకొని సైగలు దెల్పి సొంపు మీ
ఱంగఁ గ్రమాన వేఱొకన♦రాతిమఱుంగున కేఁగి రర్మిలిన్.

కం. ఆనాతిఁ గలసి పలుమఱు
నానావిధరతులఁ బ్రియము ♦ నయ మెనయంగా
నానందనందనాగ్రణి
యానందాంభోధి నోల ♦ లాడుచు నుండెన్.

వ. తదనంతరకథావిధానం బెట్టి దనిన.

మ. ప్రథితప్రాభవ ప్రాభవన్మృదుగుణ♦ప్రాగ్భార ప్రాగ్భారతీ
ప్రథితాచారణ చారణస్తుతయశో♦భారా సభారాసహా

తృథసేనారవ నారవర్యపటలీ♦పార్థక్య పార్థక్యయో
ధధరాయావళ యావకన్నిజమహా♦దారాంకదారాంకగా.

కం. అంగజసదృశాకారా
సంగరతలనిరుపమాన♦శౌర్యవిహారా
లింగాంబికాకుమారా
శృంగారరసప్రధాన♦శీలోదారా.

కం. హాటకితస్మరగుణపద
పీటంకృతిగీతివిజయ♦వేంకటదేవా
పీటీరసహారభపరి
పాటీరమ్యగుణచంద్ర ♦ బలినిస్తంద్రా.

మాలినీవృత్తము.

అధరితపరరాజా ♦ హారిచక్షుఃపయోజా
ప్రథితభుజమహాజా ♦ భవ్యసాహిత్యభోజా
బుధజనసురభూజా ♦ భోగలీలాబిడౌజా
విధుతరిపుసమాజా ♦ వీరసామ్రాట్తనూజా.

పంచచామరవృత్తము.

చరాచరాధిరాజవీర♦జాలవానకేళికా
దరా ధరాధగారిభోగ ♦ ధైర్యధూతమేరుమం
దరా ధరాధరాచకీర్తి ♦ దారదస్యుమీనదీ
వరావరావరాత్మగంధ♦వారణాంచితాంగణా.

గద్యము.

ఇది శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ జ్ఞానప్రసూనాంబికా కృపావలంబవిజృంభమాణసారసారస్వతసుధాతరంగ లింగనమఖివెంగనామాత్యవంశపావన విరచితవిద్యాధిదేవతాసంభావన దక్షిణసింహా

సనాథ్యశ్రుతిరుమలక్ష్మాకాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుళుచ్ఛ
సితచ్ఛత్ర చామరకళాచికాకనకాందోళికాదిరాజోపచార ధీరజనహృద
యరంజకవచోవిహారవల్లకీవాదనధురీణవర్ణగీతాదిగాం
ధర్వస్వరకల్పనాప్రవీణ కామాక్ష్యంబికానాగనకవి
రాజనందన కలితసకలబాంధవహృదయానందన
శ్రీకర కవితాకర సుకవిజనవిధేయ శ్రీ కామే
శ్వరనామధేయప్రణీతం బైనసత్యభామా
సాంత్వనం బనుమహాప్రబంధంబు
నందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.



# సత్యభామాసాంత్వనము.



## చతుర్థాశ్వాసము.



శ్రీ జృంభితాంబురుహారే
ఖాజనకకటాక్ష యాది♦గర్భేశ్వర నా
నాజననుతవితరణ వి
ద్యాజితరాధేయ ముద్దు♦లక్ష్మరిరాయా.

తే. గీ. అవధరింపుము జనమేజ♦యక్షితీశ్వ
రునకు నావ్యాసమునిశిష్యుఁ ♦ డనియె నిట్లు
శౌరి సాత్రాజితిని జేరి ♦ చనువుమీఱి
యుబ్బరంబునఁ దనియక♦యుండువేళ.

ఉ. అయ్య పరాకు సామి నర♦కాసురుఁ డంపఁగ వచ్చినట్టి పెన్
డయ్యపువేగరిం బెనఁచి♦త్రాటను గట్టి గుడారువాకిటన్
గుయ్యకు మంచు నో రదిమి♦గుప్పుచు మీనగరింటిచారు లో
యొయ్యన వచ్చినా రని మృ♦దూక్తులఁ బెంపుడుచిల్క పల్కినన్.

చ. తనిసినవేళఁ జూచి మఱి ♦ దవ్వులనే పొడకట్టి నిల్చి మీ
కనుఁగొనసన్నమన్ననలు ♦ గన్గొని చిత్త మెఱింగి ఱెక్కలన్
నినుచుక చిన్నిక్రొంబసిఁడి ♦ నిద్దపుటందెలు గిల్కుగి ల్కనన్
చనవునఁ జిల్కు వచ్చుటలు ♦ సారసనాభ విచిత్ర మయ్యెడిన్.

చ. ఒడికముగాఁగ మై యణఁచి ♦ యొరగఁ జేరఁగ వచ్చివచ్చి యొ
క్కెడ నెడ గల్గ నిల్చి క్రియ♦యేర్పడఁ గార్యము ముక్తకంబుగా
జడియక మేలు గల్గఁగను ♦ సంగతి తప్పక చాల కింపుగాఁ
గడఁక వహించి పల్కుచిలు♦కన్ జిలు కంచు గణింప శక్యమే.

తే. గీ. పలుకుపలు కెల్లఁ జల్లనై ♦ ప్రౌఢి మీఱి
మీకు విజయంబు గోరెడి♦మేలువలన
నవని నీచిల్క వారి యాట ♦ యరుదె నీదు
పేరువా సెందు లేదొకో ♦ బిసరుహాక్ష.

చ. మిము నెడఁబాసి యున్నతఱి ♦ మే లొనగూడఁగ డాసి నాదుహృ
త్కమలము చల్లఁజేసి నయ♦గారపుమాటలఁ దేర్చి నన్ను నీ
సముఖముఁ జేర్చి నీమదికి ♦ సంతసము ల్గలిగించినట్టి కీ
రముఁ జెయివట్ట కేటికిఁ బ♦రా కొనరించెదు కంసశాసనా.

మ. అని సాత్రాజితి పల్కినన్ నగి పయో♦జాక్షుండు మై దువ్వి చి
ల్కను చేపట్టి నవాతు మేపుచును బా♦లారత్నముం దానుఁ గొ
లువ్వనర్చి వచ్చి కడానిరేకుపనిబె♦ళ్కుల్ గుల్కుప్రాఁగొప్పు త
ళ్కును కానీపనిపీఁటపైఁ జెలువుతోఁ ♦ గూర్చుండి పిల్పించఁగన్.

ఉ. వేగ సరాతి దాఁటి మఱి ♦ వింతశ్రమంబు తగన్ దివాణపు
న్వేగరులుం జమూపతులు ♦ వీరులు గుంపులు గూడి దయ్యపు
న్వేగరి ముందఱ న్నిలిపి ♦ వేమఱు మ్రొక్కుచు వీఁడు బాళెపున్
బాగులు మాయఁ గన్గొనఁగఁ ♦ బట్టుక వచ్చితిమయ్య నావుడున్.

తే. గీ. శౌరి విస్మయమునఁ జూచె ♦ సారె కతని
చూపు సోఁకిన దయ్యంపు♦రూపు మాని

చొప్పు మార్చినగతి వింత♦సొబగు మీఱఁ
దాల్చె నెప్పటిబాఁపన♦తనువు వాఁడు.

కం. అప్పుడు హరి వెలుఁగందుచుఁ
గప్పురగంధియును దానుఁ ♦ గడు మోదముతో
నప్పాటుఁబ్రహ్మవర్చస
మొప్పారుట యోర్చి మదిని ♦ నూహింపంగన్.

ఉ. చిత్త మెఱింగి యి ట్టనియె ♦ శ్రీపతితో వెడవింటిపాదుపా
తత్తడి, సామి వీఁడు ముని♦దయ్యపురూపున వచ్చి యిప్పు డీ
యుత్తమవర్ణలీలఁ దగ♦నుంటకు హేతువు గాఁగఁ దత్పురా
వృత్త మొకం డిలం గలదు ♦ వింతగ నే నది విన్నవించెదన్.

కం. అతులకుతూహలఖని యై
యతులకు గృహమేధిజనుల ♦ కావాసం బై
తతసాధుతపోఽరణి యై
శ్రుతసారణి యనెడియూరు ♦ శోభిలు జగతిన్.

కం. ఆయూర నొక్కవిప్రుఁడు
మాయూరగరున్నిభాంశు♦మంతుఁడు దాంతుం
డాయతమతి యతిశాంతుఁడు
హాయిగ మను నుచితవృత్తి ♦ నచలుం డనఁగన్.

ఉ. ఆయచలాహ్వయుం డెపుడు ♦ నంబురుహోదరపాదపూజనో
పాయము సంఘటిల్ల ముది♦ప్రాయమునందు స్వకీయజాయ యా
మాయయెడ స్రహి న్వికట♦మారుని శ్రీనలు నీలునిం గజున్
గాయజతుల్యమూర్తుల వి♦కల్మషకీర్తులఁ గాంచె నల్వురన్.

కం. రయమున వా రందఱు న
ధ్యయనాధ్యాపనవిధమ్ము ♦ లన్నియు నేర్చ
న్వయమునకు వన్నె దెచ్చిరి
నయనానందం బెసంగు♦నలువు చెలంగన్.

తే. గీ. అతుల పటుతరపాండిత్య ♦ మమరనుతులఁ
గాంచి మాయాసమేతుఁడై ♦ ఘనతఁ దండ్రి
పరువము లెఱింగి తగినట్టి♦బంధుజనుల
యిండ్లబాలామణులఁ దెచ్చి ♦ పెండ్లి చేసె.

మ. కృతపాణిగ్రహులై కుమారకులు కూ♦ర్మిం దల్లియుం దండ్రియున్
సతతంబున్ దముఁ బ్రోది సేయఁ బ్రజ మె♦చ్చన్ సర్వకార్యస్వతం
త్రత నిట్లన్ వహియించి కేశవసప♦ర్యాస్నానదానమ్ములన్
శ్రుతిఘోషం బతిభ్రమోదమును నెం♦చుస్వీకవర్తింపఁగన్.

తే. గీ. తరువు లన్నియు ననఁబొరు♦మురువు దెచ్చు
గచ్చు హెచ్చంగ నామని ♦ వచ్చినటులు
ధరణిసురనందనులకు నం♦దఱికి బాగు
మెయిసొగసు దేరునూనూఁగు♦వయసు వచ్చె.

కం. జవ్వన మిటువలెఁ దమమై
నివ్వటిలం గొన్నినాళ్లు ♦ నెలఁతలుఁ దాముం
బువ్విలుతుకేళి నందఱు
మవ్వంబునఁ దేలి రంత ♦ మరు విధివశతన్.

కం. గార్హస్థ్య ముడిగి పురిలో
నర్హాచారంబు మాని ♦ యంబాజనకుల్
గర్హింప నన్వయోచిత
బర్హిర్విధు లెల్ల మాని ♦ పాపాత్మకులై.

మ. చరియింపంగఁదొడంగి రందుఁ బరిపా♦సశ్రేష్ఠుఁడై జ్యేష్ఠుఁ డా
పెరిమెం బట్టి కథ ల్వచింపుచుఁ దనుం ♦ బిల్పించుఁ బిల్వంగ ని
ద్ధరఁ బెంపొందెఁ దృతీయుఁ డోహటపువిం♦తల్ చూపుచుం గుక్కలన్
మరఁగెం జేరెఁ జతుర్థుఁ డంత్యకులభా♦మన్ వేరు సార్థంబుగన్.

కం. అందు ద్వితీయుఁడు తా నతి
సౌందర్యము కుశలబుద్ధి ♦ చతురత్వంబున్

గ్రందుకొనువాఁడ నని సం
క్రందనసుతు[1]నట్లు సవతు • గానక జగతిన్.

మ. తిరుగం గోరి భయంబు దీరి తటినీ•తీరంబునందున్ జలా
హరణార్థంబుగ వచ్చియున్నయెడ స•య్యాటంబు గాటంబుగా
బెరయం దా నెలయించె మన్మథశరో•ద్విగ్నాత్ముఁడై యొక్కతెన్
గరియానం గలవాణిఁ గాంచననిభం • గల్యాణిఁ గంజేక్షణన్.

కం. శ్రీనలుఁ డటు వలయించ
న్మానవతీమణి యడంకు • మాని స్మరధను
ర్జ్యానాదమేదురిత చే
తోనాదితమోహ యగుచుఁ • దొడరె న్వానిన్.

చ. తొడరినఁ జూచి పైఁ బడమ•ద్రొక్కఁగ నవ్వుచు గువ్వ చిక్కెరా
విడువ నటంచు నెంచుకొని • వేమఱు దానికి మేను జుమ్మనం
దడవుచు వెన్కఁ జూచు చొక•దారిని నారిని శీతమారుతం
బెడనెడ వీవఁ బూవుపొద•రింటికిఁ దెచ్చెఁ గరంబు వట్టుచున్.

కం. శుభనాముఁ డైనతాపసుఁ
డిభగామినిచెయ్యి వట్టి • యిూడ్చిన జటివ
ల్లభుగాఁ దలంచి నవసౌ
రభవద్వీటిక గ్రహించె • రసికత మీఱన్.

కం. వీడెము గొను జడముడిదొర
చేడియయధరామృతంబు • చేకొని సురత
క్రీడాపరవశుఁ డయ్యెన్
వేడుక విధుముఖియు నెదురు•వింతలు చూపన్.

సీ. నునుగుబ్బచనుమొనల్ • మునిపంట మొరముచో
నులుకు నెమ్మోయితళుకు • కులుకు లీనఁ

---

పా. 1. నటు కన్నుఁ•గానక జగతిన్.

గోమరు మీఱంగఁ గపో♦లము గ్రమ్మ కఱచుచుఁదో
[1]ననుపొందుకనుమోడ్పు ♦ తనుపు లీన
ముక్కుగోరను కొంత ♦ పొక్కిలినొక్కుచో
మ్రొక్కుచేతులచెక్కు ♦ చొక్కు లీన
నింపుగా విడియంపు♦గుంపెనల్ నింపుచోఁ
గల్గులేఁజిఱుమూల్గు ♦ లెల్గు లీన

తే. గీ. వికచపద్మాక్షి నంతరా♦ళికము గాఁగ
జతురగతి నాని చేయూని ♦ చంద్రకాంత
మణిమయశలాక నలచంద♦మామకరణి
వెడవిలుతుకేళిఁ గరఁగించె ♦ విప్రవరాళి.

తే. గీ. అటులు గరఁగించికరఁగించి ♦ యఘము దీర్చి
హత్తి తొల్లింటిమగనిపై ♦ బత్తి జార్చి
చేర్చి కౌఁగింటఁ గడిదేర్చి ♦ చెలిమి గూర్చి
యతివ తమిఁ దిట్ట నోర్చితా ♦ నిత వొనర్చి.

చ. సకినెలబిళ్ల రీతిఁ బలు♦చందపుటందపుపారువాలపో
లిక వగ నిక్కు డక్కు జవ♦లీల జతుల్ హవణించినట్టు కొం
కు కొసరు మీఱఁగా ములుకు♦గ్రుక్కుల మిక్కిలిఁ జిక్కువాఱఁ జి
మ్ముకసరు గుట్టు నెమ్మెవిడు♦పుల్ మెఱయించె ద్విజుండు తద్రతిన్.

కం. ఇటువలె గలిబిలికళ హె
చ్చుట నట నిర్వ్వరికి మేను ♦ ఝుమ్మన విటునిన్
కుటిలాలక పైకొనియెం
బుట మెగయుకడానికీలు♦బొమ్మయుఁబోలెన్.

సీ. గుదులతోఁ దొడ లాన ♦ నెదురు నాతనిఱొమ్ము
దురుసుగుబ్బలఁ గ్రుమ్మి ♦ త్రోసిత్రోసి
కౌను గొప్పను గేలఁ ♦ గమిచి వాఁ డద రంటఁ
గెళకి సందిలి నొక్కు ♦ నులికియులికి

పా. 1. నునుపొందుకనుమోడ్పు.

తివిరి చెల్వుఁడు లోఁబె♦దవి కాటు తవిలింపఁ
గ్రుక్కియు స్సని చెక్కు ♦ గొట్టికొట్టి
యుబికి మో వాని వాఁ ♦ డూకొన కరఁచొక్కుఁ
గెరలి తిట్టుచు నాడు♦గఱచికఱచి

తే. గీ. మేను పసిమాడఁ దమిఁ గూడ ♦ మెలుపుతోడఁ
గాను జవ్వాడ నవహార♦కలిక లాడ
మరుఁడు జళిపించు గేదఁగి♦కిరుసుకరణి
మురిపెమునఁ బొంగి నటియించె ♦ మోహనాంగి.

కం. చెవిచెంత నోరసిగప్పైఁ
దవిలినకడవన్నె మెఱుఁగు♦తాయెతు లొరయన్
జవరాలిపాదముల కా
యవనీసురుఁ డెఱఁగె మన్మ♦థావేశమునన్.

వ. ఇవ్విధంబునఁ గృతప్రణాముండై భూదేవుండు కిలికించితవతి నొడంబఱిచి యిల్లు మఱపించి యెలమినారజపువగలు గఱపించి యిల్లాలి పద్దుల కెడఁబాపి చల్లని చిగురుమెట్టసొక్కించి తనవగకుఁ జిక్కించి వేశవాటంబున డాయించి వెలిపాళెంబు వేయించి వింతగా నొక విడిది నంతరించి విడిమైదువులచుట్టరికంబు పొంకించి వెలిదేరవల దని జంకించి యేమియు నెఱుంగనియతనింబలె నిజగృహంబునకు వచ్చి వినీతుండునుంబలె నిత్యకృత్యంబులు హెచ్చి పితృసన్నిధానంబునకు వచ్చి సుగుణనిధానంబునుం బోలె నుండె నంత.

సీ. శ్రీమనోహరునభి♦షేకంబు సేయుచో
మగువ మజ్జనమార్చు♦వగలు దలఁచుఁ
బూతాత్ముఁడై దేవ♦పూజ యొనర్చుచోఁ
బూఁబోఁడి గై సేయు♦పొలుపు దలఁచు
వేడ్కతో హరికి నై♦వేద్య మర్పించుచోఁ
[1]జెలి కపోసన మిచ్చు♦చెలువు దలఁచుఁ

పా. 1. సతికి కొసరనిచ్చు ♦ చవులఁ దలఁచుఁ.

దేటయగా హరిపాద♦తీర్థంబు గ్రోలు-చోఁ
దెరవవా తెర నాను♦వెరవు దలఁచు
తే. గీ. దైత్యభేదిపదానుసం♦ధానవేళ
నంగనారతిపారవ♦శ్యంబు దలఁచు
ద్విజుఁ డటులు పాడి మీఱి క్రొ♦వ్విరి లకోరి
చెనఁటిభూతంబు సోఁకఁ దా ♦ సిగ్గులేక.

సీ. పారువాపలుకుల♦తీరు వాటిల దంచుఁ
దొలుపల్కులు గణించు♦తలఁపు మానెఁ
డాళిగోణము గట్టు ♦ బాళి యేర్పడ దంచుఁ
గావిదోవతి గట్టు♦కడఁక మానె
నేవళంబులు దాల్చు ♦ తేవ లలర వంచుఁ
దులసిపూసలు [1]దాల్చు♦తొడుసు మానె
గందంబుఁ బూసిన♦యందంబు లే దంచు
బూది మేనునఁ బూయు♦పొల్పు మానెఁ

తే. గీ. గుంటెనలు సేయువారితోఁ ♦ గూడి యుండు
కులుకు చన దంచు సజ్జన♦గోష్ఠి దక్కి
చెనఁటియై పాటుఁ డీరీతిఁ ♦ దనువు మఱచి
తరళలోచనపై మించు♦తలఁపు లెంచు.

సీ. మారుబీరముచేత ♦ బారుబీరము చిక్కి
లెడలించు పెట్టెలో ♦ ముడుపు లాగుఁ
బూఁతసొమ్ములు కొన్ని ♦ పొసఁగించి పూసబొ
ట్టును నింటఁ గలయంత♦యును హరించు
భరతంబు వీణె తం♦బుర నేర్ప్వవలె నంచు
సానికూఁతులయిండ్ల♦చాయఁ బోవుఁ
బొన్నూరికిఁ జదువఁ♦బోదు నను నెపానఁ
దా నున్నపురవీథి ♦ దాఁటి పోవు

---

పా. 1. దాల్చు♦తొడుకు మానె.

తే. గీ. వెడలి వెలయింతికడ కేఁగు♦వేళ మేనఁ
జెలువుగాఁ బూనుపికిలివ♦న్నెలు సడల్చి
యేమి యెఱుఁగనియట్ల తా ♦ నింటఁ జేరుఁ
గొన్నినా ళ్లిట్లు నెమ్మదిఁ ♦ గొంకికొంకి.

కం. చక్కెరవిల్తునిచిక్కులఁ
గక్కసిలం దనదుమనసు♦కాఁకలు దీర్పన్
చక్కనిగుబ్బలమక్కువ
యుక్కలపున్ మనసుతపసి ♦ యువిద కలిగియున్.

శా. ప్రాతస్స్నానముఁ జేతు నన్నెపము మీ♦ఱన్ వేగుజామైనచో
స్వాతంత్ర్యమ్ముగ నిద్రలేచి వెలిత్రో♦వల్గాచి యచ్చోట సం
కేతంబు ల్వెలయంగ జారిణుల క్రు♦క్కించున్ తమిం గూడి యెం
త్రేతృప్తుం డయి యంత యేటి కరుగున్ ♦ నిష్ఠాగరిష్ఠాకృతిన్.

సీ. కలశభవశ్రీలఁ ♦ దలఁచి ప్రసంగించుఁ
గువలయాక్షులచన్నుఁ♦గవలు చూచి
నదనదీయాఖ్యాన♦నటనము ల్మెఱయించుఁ
బడఁతులనెఱికప్పు♦జడలు చూచి
శంఖస్మృతిమహత్త్వ♦శంసలు గావించు
రమణులమేలికం♦ఠములు చూచి
శుకవాక్యమహిమవి♦స్ఫురణంబు మెఱయించుఁ
దరుణులరహిపల్కు ♦ తెఱఁగు చూచి

తే. గీ. తలిరుఁబోఁడులు నీరాట ♦ సలుపునెడల
మందులను జేసి యచటిబ్రా♦హ్మణుల నెల్ల
స్నానములు చేయుకై వడిఁ ♦ దాను నచటి
విప్రులనుబోలె నాధూర్త♦విప్రమౌళి.

కం. గాయత్రి నొడివి ద్విజవరు
లాయెడ మానంబునన్ స♦హస్రావర్తుల్

సేయునెడఁ దాను మన్మథ
గాయత్రీజపము సేయుఁ ♦ గలుషాత్మకుఁడై.

చ. అల జవరాలిపెందొడల ♦ నంటినక్రొంబసపుంబిసాళిని
గ్గులు తెలిచల్లడంబుతుదఁ ♦ గుట్టినబంగరునీలికండెతీ
వెల కెనయై చెలంగుపది♦వేలవిధమ్ములకోడెగాండ్రతోఁ
గలిసి చరించె వాఁడు నడ♦కాకి యనన్ నడువీథిలోపలన్.

మ. బురుసాకుచ్చులతాళిగోళము కళల్ ♦ పొల్పొందనెత్తావిక
ప్పురవీడెంబును మోవికెంపుజిగిపెం♦పున్ జెంపగోరొత్తులున్
మెఱుఁగుంగస్తురిగీరునామములయె♦మ్మెల్ మీఱఁగా మించె న
ప్పురి లేఁబ్రాయపుఁగోడెకాండ్రు తను గుం♦పుగ్గాడి వెన్నాఁడగన్.

చ. చెకుముకిరాయి దూదియును ♦ చిన్నపుపోగర కోవిచెంబు ల
త్తుకజిగిపోఁకపాళె యొరఁ♦దోపినగంటము సూరకత్తి మ
ల్కుకొలికి వట్రువంబుపొర♦లోపలినంబెళ సున్నమాకు లి
చ్చుకముగఁ బూని బోడిగలు ♦ సారెకు మడ్పులు చుట్టియుయ్యఁగన్.

సీ. రదనాగ్రమున మించు♦నుదిరిబంగరుమొలల్
కసిగాటుమోవిపైఁ ♦ బసిమి నించ
నునుజిగిమించునూ♦నూఁగుమీసపురేఖ
మోముపై నొకవింత♦గోము నెఱప
సికమీఁదఁ జుట్టిన♦చెంగల్వవిరిదండ
జిల్గురుమాలపై ♦ జీరువారఁ
దోడెంపునవ్వుల♦తులకించువెన్నెలల్
ముత్యపుసరులపై ♦ ముద్దుగురియ
తే. గీ. మించుమించులమించుగ్రొ♦మ్మించునెఱయఁ
బదములను గుల్కుబిరడల♦పావ లమరఁ
బంత మెద హెచ్చ సేమంతి♦బంతి పూని
ప్రోడయై క్రుమ్మరుచునుండు ♦ భూసురుండు.

సీ. వీథిలోఁ దిరుగాడు♦వేఁడుకకాండ్రకు
స్త్రీలకుఁ గలహముల్ ♦ తీర్చితీర్చి
యేకాంతమున నున్న♦యించుఁబోఁడుల కెల్లఁ
దీరుగా నామముల్ ♦ దిద్దిదిద్ది
సూళ్లగేరులచాయ ♦ వాలాయముఁ జరించు
చెలులకుఁ బ్రియములు ♦ చెప్పిచెప్పి
తరితీపుచేసి యెం♦తయు రూకఁ జెల్లించు
దూతికుటీరంబు ♦ దూఱితూఱి

తే. గీ. చదువు లెగనాడె నీతులు ♦ పదటఁ బుచ్చె
గురుజనముమాట నిరసించెఁ ♦ గులము ముంచెఁ
బురజనము చూచి నవ్విన ♦ సరకుగొనక
యెగ్గు విడనాఁడు బాఁపన♦యెక్కుటీఁడు.

సీ. పూబోఁడికోలచేఁ ♦ బాదలబయల్ చిమ్ముఁ
జిమ్మి యంతనిలాక♦చేయి మార్చు
మార్చి యెదుట వచ్చు♦మగువలపైఁ దూఱు
తూఱి వెన్కకు వచ్చి ♦ సారె నవ్వు
నవ్వి రుమాలీడ ♦ నవ్వాలివ్వాలఁ జూచుఁ
జూచి చొక్కునఁ దానె ♦ సొంపు మెఱయు
మెఱసి చెంగట వచ్చు♦ నరదికాండ్రను రేఁచు
రేఁచి వారిని కూక♦రించి పోవుఁ

తే. గీ. బోయి తమి హెచ్చి వస్త్రవు♦పొందుఁ గోరి
యవుడె యడపంబు బుడుతచే ♦ నడగ నంపు
నంపి యది యొప్పకుండిన ♦ నదరువెట్టు
మరలి యాసించుఁ డెప్పటి♦[1]తెరువు గాంచు.

ఉ. గాయకుఁ డమ్మహీసురుఁడు ♦ గ్రాంథికుఁడో యని లోకు లెంచ వా
లాయము శాస్త్రముల్ చదువు♦లాగున నొక్కయెడన్ గొణంగుచున్

పా. 1. తెరువు వట్టు.

నాయికరీతియుఁ గళలు ♦ నాయకజాతియు నిర్ణయించు వా
త్స్యాయనసూత్రముల్ రతిర♦హస్యముఁ జూచు నపేతశంకుఁడై.

ఉ. నీటునఁ దాను వచ్చునెడ ♦ నిక్కముచుట్టఱికంబు చెల్వి య
ప్పాటలగంధితో నదరు♦పాటున నూరక యెవ్వఁడేనియుఁ
మాటున మాటలాడఁ గని ♦ మాటికి మీసము దువ్వి యొంటిపో
ట్లాటకుఁ బిల్చు వాఁడు ద్విజు♦లందఱు నచ్చెరువంద నచ్చటన్.

కం. ఆహిరియును మాహురియు బి
లాహిరియును పాడికొని కి♦లార్చుచు గురుదా
నోహారిసాహారి చిమ్ముచు
లాహారి తగఁ దిరుగు నతఁడు ♦ లంజలయుఁ దానున్.

తే. గీ. అటులు విడివడి తిరుగాడు♦నవసరమున
ధరణి శుభనాముఁ డగుజడ♦దారిరాయఁ
డాత్మగృహిణి గ్రహించిన♦యందువలనఁ
గనలి శపియించె రక్కసి ♦ గాఁగ నతని.

కం. కడు శాప మొంది వేఁడుచు
గడగడవడఁకంగ నతనిఁ ♦ గరుణను మగుడన్
జడదారి పల్కె రక్కసి
వెడఁగ చనుము కృష్ణుఁ జూడు ♦ వెఱవకు మనుచున్.

తే. గీ. వెఱపు దీర్చినఁ బాపసి♦విభునియనుగుఁ
దమ్ములకు మ్రొక్కి రక్కసి♦తనముఁ దాల్చి
ద్విజుడు [1]నరకాసురుని జేరి ♦ తిరుగు, నిప్పు
డందె శాపవిమోక్షణం ♦ బతఁడె యితఁడు.

కం. అని ముద్దుచిలుక వివరిం
చినపుడు జోహారు చేసి ♦ శ్రీనలుఁ డంతన్
మనమున సమ్మద మొనరఁగ
వినయమ్మున విన్నవించె ♦ విభుఁడు వినంగన్.

---

పా. 1. నరకాసురుని గూడి♦తిరుగు.

కం. నీపాదదర్శనంబునఁ
దాపముఁ బాపంబు నెడలె ♦ ధన్యుఁడ నైతిన్
శాపవిమోక్షణ మయ్యెను
గోపాలవతంస దైత్య♦కులవిధ్వంసా.

కం. నెరసంజఁదొట్టి యొంటరి
ధరణిం దమిఁ గూడుకతన ♦ దైత్యుండై యా
నరకాసురుండు పుట్టిన
యెరపరికపుగాథ యెఱుక ♦ నెఱుఁగుదువె కదా.

కం. స్థల జల వన గిరిదుర్గం
బులఁ జను ప్రాగ్జ్యోతిషాఖ్య♦పురమున సురకాం
తల నరకాంతలఁ జెఱఁగొని
వెలయున్ నరకాసురుండు ♦విభవోన్నతుఁడై.

మ. జగముల్ బెగ్గడిలన్ నభంబు వగులన్ ♦ శైలంబు లూటాడ మెం
డుగ బ్రహ్మాండము నిండ నుద్భటభటా♦టోపంబు మీఱన్ సురో
రగ విద్యాధర సిద్ధ సాధ్యబలదు♦ర్వారప్రతాపోన్నతిన్
తగు నెంతే నరకాసురుండు రణవి♦ద్యాచండపాండిత్యుఁడై.

సీ. పరిచారకులు గాని♦సురనాయకులు లేరు
చెఱఁ బడకున్న య♦చ్చరలు లేరు
హుజూరుపాటకు రాక♦యున్న జక్కులు లేరు
మణుల నియ్యని యేటి♦మగలు లేరు
వేళఁ గావకయున్న♦విద్యాధరులు లేరు
వరుసలు గొననికి♦న్నరులు లేరు
యుద్ధాలు చే నెత్త♦కుండుసాధ్యులు లేరు
మోపులు మోయని♦మునులు లేరు
తే. గీ. అక్షయపరీక్ష్రతాఘూర్ణి♦తాక్షియుగళ
గండమండలుఁ డగు నర♦కాసురుండు

హాలహాలలీలఁ జెందు బెం♦డాడు వేళఁ
దరళగతిఁ జెందు నీచరా♦చరమునందు.

కం. అకృతకరగ్రహాలు తటి
త్ప్రకరోపమవిగ్రహాలు చె♦ఱంబడి యున్నా
శకలంకచరిత రాజ
న్యకసుతలు పదాఱువేవు ♦ రసురపురమునన్.

ఉ. ఆకమణీలలామము ల♦హర్నిశమున్ నినుఁ గోరుకోర్కె లీ
డేరఁగ దానవేశ్వరు వ♦డిన్ బవరమ్మునఁ గొట్టి వారలన్
ద్వారకయందుఁ జేర్చుకొని ♦ వైభవ మెచ్చఁగ నిచ్చ గెల్చురా
బీరము తోరమై పొసఁగఁ ♦బెండ్లి యొనర్పఁ దలంచు శ్రీపతీ.

తే. గీ. నిశిచరుఁడు గాన తద్భట♦నివహ మెల్లఁ
గొలువ రే యెల్లఁ గొలువుండి ♦ కొంత దీర
పసుర వేగిన నిదురించు ♦ నందువలనఁ
గలుగుఁ బగలింటిపోరున ♦ గెలుపు నీకు.

తే. గీ. అనిన శ్రీనలుఁ గరుణించి ♦ యాదరించి
నవ్యకాంచనపటభూష♦ణము లొసంగి
ముందుగా వాని నుక్కళం♦బున వసింప
ననిచె విజయంబు గోరి య♦య్యసురవైరి.

శా. భాసిల్లెన్ నిజసోదరేందుసుభగం♦భావక్రియావిష్కృతో
ల్లాసోదారముకుందదారకృతలీ♦లాలాస్యసారస్యభృం
గీసంగీతతరంగితాబ్జరుచిభం♦గీజాతరంగోల్లస
త్కాసారాబ్ధితరంగజాలము శర♦త్కాలం బవేలంబుగన్.

సీ. జలదయాతాయాత♦సరణు లన్ని యడంగెఁ
గలహంసకులమంద♦గతు లెసంగెఁ
గెరలి జోడునెమిల్లు ♦ కేకలు చాలించె
రాచిల్కపల్కుల♦రాణ మించె

బెడబెడ మను గొప్ప ♦ వడగండ్లజడి నిల్చె
రసదాడిముత్యపు ♦ మునురు పొల్చె
గూడకొంగలబారు ♦ కూఁతరాయిడి విచ్చె
క్షితి శాలిపాలికా ♦ గీతి హెచ్చెఁ
తే. గీ. కడఁగి సడలుచు మొగిలిపు ♦ ప్పొడులు వీఁగెఁ
గమ్మనెత్తమ్మికలువపూ ♦ దుమ్ము రేఁగె
వింత యిది యెంచ వనెడిని ♦ వ్వెర నటించ
మొనసి నానాఁట వెలుతురు ♦ మొగులుపూఁట.

కం. మీసరములు సమలలితాం
గీసరములు సురభికుంద ♦ కేసరములు స
త్కాసరములు తతజలదని
రాసరములు భాసిలెఁ శ ♦ రద్వాసరముల్.

కం. మెఱుఁగుల పేరిటి ప్రాయపుఁ
దరుణుల నెడఁబాసి విరహ ♦ ధవళిమ గొని త
త్తరమున నడరెడివడువున
బెరయుచు నీరదకులంబు ♦ వెల్వెలఁబాఱెన్.

సీ. హృద్యతరోద్యాన ♦ పద్యలఁ జెలు వొందు
కుందబృందంబులఁ ♦ గొంతసేపు
హారువుగా నొండొంటి ♦ నంటి ఘుమ్మన జంట
గోరంటగుత్తులఁ ♦ గొంతసేపు
నవనీయకాసార ♦ నవసారభోదార
కువలయవనసీమఁ ♦ గొంతసేపు
పొంగారుమస్తుటే ♦ నుంగుకస్తురిగబ్బు
గుబ్బతిల్లెడిచెంతఁ ♦ గొంతసేపు
తే. గీ. కొలువు సేయుచు విహరించు ♦ కోడెతేఁటి
గుమురు కొమెరలతో వేడ్కఁ ♦ గూడి యాడె

సమ్మదమ్మునఁ గమ్మనై తమ్మితేనె
గ్రోలి యవ్వేళఁ జొక్కున ♦ వ్రాలివ్రాలి.

ఉ. కన్నులడాలు కుంతములకై వడి వింతలు చూపుకాపులే
యన్నులమోవి బింబఫలమంచును చేరఁ దలంచి మించి పై
రెన్నుల ముక్కులం గమిచి యింపుగఁ బెంటుల నంటి చూడికన్
గ్రన్నన నేఁగురామచిలుకల్ రహిఁ నక్షులు సాఁచుఁ జెంగటన్.

ఉ. ఆతతి మందయందుఁ బడునట్టుగఁ గొమ్ముల గట్లఁ గ్రుమ్మి లోఁ
బోతర మొప్పఁగా మరుని పోరునకై గమకించి పైపయిన్
మ్రోఁతకు హుంకరించి మెయిమూర్కొని మూతుల నెత్తిహత్తి యాఁ
బోతులు ఱంకె వేయుచును ♦ బోరనఁ జేరె సమాంసమీనలన్.

కం. కమలములు పాకవినతం
బులు నగుకల్హారచయము ♦ మూర్కొని క్రిందన్
వలపునకుఁ జొక్కుకై వడిఁ
దల లూఁచన్ పైఁడి నుక్కు ♦ తళతళ మీఱన్.

సీ. కలువలసంగాతి ♦ చెలువులమజ్జాతి
యివముపుట్టువిభాతి ♦ యింపుజోతి
[1]తొలిజోగిముడిపూవు ♦ బలుజక్కవలగావు
నెలరేవలపుప్రోవు ♦ నింగితావు
ఒజ్జనెచ్చెలిమేలు ♦ యొరపువెన్నెలచాలు
కడలిరాయలచూలు ♦ కళలప్రోలు
మరునివజ్రపుతాళి ♦ మలయురిక్కలబాళి
యెడయుజోడువిరాళి ♦ యిరులజాలి

తే. గీ. చురుకుడాల్జంట తపసిరా ♦ చూపుపంట
సోయగపుతేవ కనుచాటు ♦ చోటియావ
తామరలబంది కటిమేను రాముజంది
తేటఁ బాటిల్లె జాబిల్లి ♦ తేజరిల్లి.

---

పా. 1. తొలిజోగిముడుపురా వలజక్క.

ఉ. నీరధరాళిపేరఁ దగు ♦ నీలపుబిందెల వ్యోమలక్ష్మి య
వ్వారిజనేత్రుసెయ్యమున ♦ వంచినముత్తెపుతేటనీటఁ బ
ల్మాఱును రాజురాకకయి ♦ మజ్జనమాడి దిగంగనామణుల్
వారకతాల్చుచల్వవలు♦వల్వలె నిండెను పండువెన్నెలల్.

కం. శేవలమై మదిఁ బొగ రట
తావలమై నిలువఁ జలువ ♦ దనువుననువురా
క్రేవలమై సొలయుచెలుల్
కేవలమైరేయపాన♦కృతనిశ్చయులై.

రగడ. అటువలె వెన్నెల ♦ లంతట నిండఁగ
విటులును దామును ♦ వేసుక నుండఁగ
వితమురులై యా♦వెన్నెలలోపల
రతులకు నితవగు ♦ రసవపుఁదావుల
కొమరుగఁ బండిన♦కుంకుమబెళ్లను
బ్రమదక మెసఁగ మ♦ర్వపుఁబందిళ్లను
పలకలఁ దగునడ♦బంగరుసజ్జల
దళనుగుఁ దవలయ♦దళములసజ్జల
నెఱసరిగెంపుల ♦ నెలవుందావల
చిఱుపనిమిసమిన♦జీనవుఁజావల
వలరులఁ గడు ఘు♦మ్మనునెలఁదోఁటల
తళతళమనియెడి ♦ దంతపుపీఁటల
నొండొరు లుండఁగ ♦ నొరపులు మీఱుచు
నండజయానల♦హాళిహాళిఁ గేరుచుఁ
బలికినసురవలు♦వలు ధరియింపుచుఁ
బులుపులు తగఁ దొడ♦వులు మెఱయింపుచుఁ
గలకలఘుమ్మను♦కలపముఁ బూయుచు
మలఁగక మఱిమఱి ♦ మైఁ గై సేయుచు
దళసంచునుతవ♦తంబుర ఘుమ్మన
దళవుగ ఢక్కలు ♦ దగ ధింధి మ్మన

సొగసుగఁ గాముని♦జోలలఁ బాడుచు
        మొగమోటపురత♦ముల నోలాడుచు
నిగరపుజిగిచిఱు♦నగవులఁ దక్కుచు
        సగము గొఱికి ఫల♦చయముల మెక్కుచు
మెఱుఁగులు దేరఁగ ♦ మిరియపుగాలికి
        బురబురమని నిలఁ ♦ బొగచినయాలికి
పొలుపులఁ దగ మెక♦ములమూలుగులును
        తలకొని జగదొం♦తులవాలుగలును
కొలఁది యెఱుంగని♦కోర్కుల నంజుచు
        నలువగు రుచులకు ♦ నాలుక గుంజుచు
రహిం మీఱిన నును♦రజతపుదొన్నెల
        మిహింపైఁడిజగా♦మేలిమిగిన్నెల
జిగిదగుముత్తెపుఁ♦జిప్పలచెంబుల
        పొగరు నింపు కెం♦పులకలశంబుల
పలువగపగడపు♦పాణిద్రోణుల
        నెలరా తెలివె♦న్నెలసింగాణుల
నెఱకఱిజిగిఁ దగు♦నీలపుజారుల
        పరిగొనువిడిజిగి♦పచ్చలకోరల
వినుత మైనతా♦విని దగి యుత్తమ
        యనఁ దగు కెంజా♦యలగంధోత్తమ
తగియనివెడజిగి♦ధిగధిగ నిండుగ
        పొగరున నగుజగ♦భుగభుగషండుగ
నించినించి నెఱనీటులఁ దేలుచు
        ముంచిముంచి కడు ♦ ముదమునఁ గ్రోలుచు
మానమతంగజ♦మదపూరమె యిది
        సూనాశుగనృప♦సుఖసారమె యిది
గానాంభోనిధి♦కల్లోలమె యిది
        తానామృతకం♦దళజాలమె యిది

యనుచు ననుచుతమి ♦ నతిశయిలంగను
కొనుచుఁగొనుచు మది♦కోరిక పొంగను
తనిసితనిసి మది♦తహతహ మించను
కినిసికినిసి ప్రియు♦కిలకిల పెంచను
గునిసిగునిసి మది♦గుజగుజ హెచ్చఁగ
నెనసియెనసి మరు♦హిజుగులు విచ్చఁగ
పదరిపదరి విటు♦వైపులు నవ్వుచు
పదరిపదరి విరి♦బంతులు రువ్వుచు
నదరియదరి భువి ♦ నలయిక వ్రాలుచు
నుదరియుదరి తమ♦మూరట దేలుచు
కొదిగికొదిగి పలు♦కులు వచియింపుచు
పొదలిపొదలి వెఱ♦బూమె నటింపుచు
పెదవికెంపు చనఁ ♦ బ్రియులను దిట్టుచు
నొదిఁగినవారల ♦ నుదుటనఁ గొట్టుచు
నిందింపుచు మఱి ♦ నేరము లెన్నుచు
నందెలు ఘల్లన ♦ నడుగులఁ దన్నుచు
మోహాపువగలో ♦ మునుఁగుచుఁ దేలుచు
నూహ లెఱుంగని♦యువిదలఁ బోలుచు
మీాటగుముదమున ♦ మేలిమిఁ జెందిరి
నీటుగ వెంబడి ♦ నిదురను బొందిరి
తేఁకువ నందఱు ♦ తెల్వి యొసంగను
వేఁకువ మేల్కని ♦ విలసిల్లంగను
కుక్కుటకులముల♦కూఁతలు మీాఱెను
దిక్కు లన్నియును ♦ దెలతెలవాఱెను
కొలకొలమని పులుఁ♦గులు నెలుఁగించెను
వలపులఁ దగి కలు♦వలు ముకుళించెను
సారసములు ని♦చ్చలు వికసించెను
వారిజినీపతి ♦ వడి నుదయించెను.

మ. అపు డావేగరి వేళఁ దెల్ప నెలగో◆లంటంగ గీర్వాణరా
డ్రిపుసేనావిసరమ్ము గ్రమ్ముకొని పే◆ర్మి న్లల్లసిల్లంగ గో
రపుపేరమ్మునఁ దూలి తా మని యొన◆ర్చం జేర్చి రాశానట
ద్వ్యపదేశుల్ యదువృష్ణిభోజకుకురా◆వంతీశ్వరుల్ వింతగన్.

కం. వారలసేనలపై దుము
దారుగను మురాసురుండు ◆ తనయులుఁ దానున్
బోరన పో రొనరించెను
ఘోరనరాశనకులంబు ◆ కో యని యార్చెన్.

కం. పురు డింత లేక యురువడి
మురుఁ డంభోనరణమధ్య◆ముననుండి యనిం
జిరజిరలు నెఱయ దరిసిన
వెఱపున నలరాచసేన ◆ విఱిగెన్ విఱుగన్.

కం. భూదేవమంగళాశీ
ర్వాదంబులు నిండఁ గైదు◆డిపానడలరుచుల్
సౌదామినులవలెను నా
నాదిశల న్మెఱయఁ దా ఘ◆నస్థితి బెరయన్.

సీ. కోదండటంకృతుల్ ◆ వేదండఘీంకృతుల్
హేషితంబులు నాట◆భాషితములు
స్యందనారవములు ◆ వందిసంస్తవములు
కుంతఘుంటలయులి ◆ గోరకరవలి
పటహానినాదముల్ ◆ భటసింహనాదము
లొంటరినుడిపద్దు ◆ లొంటెనస్ట
విజిగీషుహుంకృతుల్ ◆ వేత్రులహూంకృతుల్
దళముల కూఁత వా◆ద్యముల మ్రోఁత

తే. గీ. యేకమయి లోక మగలించు◆ఛాక మించ
మేచకాపాంగతోఁ బాప◆మేఁతపక్కి

జక్కపై నెక్కి గోపాలచక్రవర్తి
వెడలె నరిపైని నెడలేని కడఁక పూని.

వ. ఇవ్విధంబున గుడారు వెడలి కదలిపొంగినవగ నడచు నిజబలంబులఁ బురికొల్పి పరబలంబుల నరికట్టి నిల్పి శైలశస్త్రజలజ్వలనపరిధినంసర్గంబున దుర్గమంబై నిసర్గక్రూరతాధారదనుజవీరపరివారవేష్టితా శావకాశంబగుమురపాశంబు గదాకుంతసారవారణనాగాస్త్రంబుల విదళించి గరుడని కదలించి మించినతత్పక్షవిక్షేపణక్షమాంతరిక్షానుక్షణలక్షితరూక్షరూక్షాశుశుక్షణిసఖరయవ్యతికరజనితనినదాభిఘాతంబుల విశీర్యమాణనిశితవిశిఖసంఘాతంబులమెరమెర బెరయ బిరబిర దొరయ నరిమురి గెరలి బిరబిర దరలి కఠినతరగదావిదారితఫణిపతగసురధరాసురుండగు మురాసురుండు వచ్చి హెచ్చినకినుక నవుడవుడు గఱిచి నిద్దురమబ్బున మెయి మఱచి భుజమ్ములఁ జఱచి కరచిరత్నరత్నరుచులు నెఱయ నఱచి యెఱచిదిండితండంబులనెచ్చరించి మిగుల మచ్చరించి యిరుగడల నెక్కిరింతలు నెలయఁ జిడిముడిగోరంతలు-యిడుముల నడరునావులింతలు సూప వలంత యొకింతయు లేక యయ్యసురాంతకుండు సూడెనయ వేఁడిదళనవేటుపాటిల్ల నిరాఘాటపాటవమ్మున శిఖరిశిఖర పంచకంబగు తదీయశీర్షపంచకంబు ద్రుంచె త్రుంచిన నుదంచితసోత్సేకాయత్తచిత్తులై తత్తనూజాతు లేడ్గురు రుడ్గరిమ హెచ్చి విచ్చలవిడి పెచ్చుపెరిఁగి పంతంబులు మెఱయఁ గుంతంబులొరయఁ గంఖాణమ్ముల నదలించి బాణమ్ముఁ రోదాలించి శరాసనంబులు మెఱయఁ బ్రాసమ్ములు ధళధళ దొరయ శూలమ్ము లెనయ భిండివాలమ్ములు మొనయ వాలంబు లొండొంటి నగ్నులంటి మండ శైలశిలాజాలమ్ములు నిండ నంస్ఫోటచటులభటపటలవిస్ఫోటితంబులు విలయసమయ విజృంభమాణకుంభీనసకులజంభరిపు పదకటకసముత్తంభితకరతటరటితపటుతరడమరుఢిమఢిమ ద్రఢిమవిడంబంబునఁ గృతాడంబరంబులు చూపఁ గినిసి ఖనిశితవిశిఖపరంపరలాడు విజయస్సైనేయమాద్రేయులం బొగడి బీరమ్మున నెగడి యరికుమారవీరపరివారమ్ము నమరప్రకారమ్ము దెగడి తెగడి కబ్బిత గడబ్బిరవగల గెబ్బునల్లనల్లత్రావుడుచెలులపెదబొబ్బలు గుబ్బతిల్ల నబ్బు

రంబున పైనొరఁగి పోరుచు బిబ్బోకవతిగబ్బిగుబ్బమొనలసోఁకులతబ్బిబ్బు లేనితమి యుబ్బరంబున మబ్బుదేరి యని నిబ్బరంబున తొలిగిబ్బరౌతుగబ్బి తనముమీఱి యబ్బలిబంధనుండు చిందనశిఖిశిఖాసహస్రంబులు నహర్మధ్య నయనదురారాధ్యతమందితమందేహరపుసహస్రంబు లనువొందుచందంబున దళితామిత్రతనుత్రశిరస్త్రంబులగు నస్త్రంబు లేసి రేసి డొక్కలుచించి ముక్కులు భంజించి కాళ్లు గోరించి వ్రేళ్ళు గారించి తొడలు తుండించి మెడలు ఖండించి శిరంబులు డించి కరంబులు ద్రుంచి యురమ్ములు వ్రక్క లించి యుదుటున నగ్గలించి కుమ్ములు పరఁగ నెమ్ములు విఱుగ నాయమ్ములు సొరఁగ రక్తధారానికాయమ్ములు దొరఁగ కన్నులు దిరుగఁ గబంధంబు లవని దొరుగ నొక్కమొగి నక్కటిలారిమురకుమారుల నుక్కుమిగులం జక్కాడి ప్రశాంతపరరాజన్యంబును ప్రక్షిప్తనిఖిలరక్షోదనుజ దౌర్జన్యం బును ప్రశమితదైతేయజన్యంబును ప్రపంచితవందారుబృందారక సౌజన్యం బును నగుపాంచజన్యంబు నొత్తిన యుగెత్తుగ నత్తమిల్లుశత్తరంబునఁ గులా చలంబులు కూలె. కుంజరంబులు వీలె-ధరణి చీలె-తరణి తూలె-నభంబు వ్రాలె-నక్షత్రంబులు రాలె-సాగరంబులు ఘోషిల్లె-సకలదిక్కుంజరంబులు ఘోషిల్లె-భువనంబు లన్నియు నోహటిల్లె-బోరునను రోదసి నివ్వటిల్లె నంత నావృత్తాంతం బంతయు నాకర్ణించి మురాపదానము లభివర్ణించి కల్పాంత దుర్దాంతచండిమ మెండుకొనం దగుదండధరుండునుంబోలె మండిపడి మచ్చ రంబున నుండియుండి నానావయవఘటితనవమణిభూషణకిరీటవరకుండలుం డైన నరకుండు కోదండంబు కేలఁ గొని వేదండంబుపై నెక్కి తనయిరు చక్కి(గ్రిక్కిఱిసి యనేకవేదండంబులపై నుండి చెండివేనెలవరితండంబులు నిండి రా నెదుట నరదంబునందుండి తనతనయుండైన భగదత్తుండు ముందు నడువఁ బడవకై వచ్చె నంత.

కం. అయ్యసురేంద్రతనూజుఁడు
దయ్యపుమూఁకలను గూడి ♦ దళములఁ గవియఁగ
కయ్యంబునకు న్వడముడి
యయ్యెడ నెదిరించెఁ బంక♦జాక్షుఁడు చూడఁగ.

కం. ఎదిరించిన భీమునికై
బెదరించుక లేకెదిర్చి ♦ పెళపెళ నార్చున్
ముదమున నలభగదత్తుఁడు
గుదిగొనుననుగన్నెరాకు♦కోలల నేసెన్.

ఉ. ఏసినబాణపాతముల ♦ కెంతయు రేసి రణంబుఁ జేసి హా
వాసికి వచ్చినావొ యదు♦వల్లభు డాసి తలంపు మాసి రా
కాసిపిసాచిగా యనితి♦గాశిరుధాత్రి హిడింబికారతా
భ్యాసి నకాసిచాయలక♦రాసిని దూసి కిలార్చి పేర్చినన్.

కం. గద చేకొని యరదము డిగి
మదమున భగదత్తుఁ డపుడు ♦ మార్కొనెఁ దానున్
గుదియ గొని రథము డిగ్గుచు
నదలించె బకారి భృత్యుఁ ♦ డసి నార వేయన్.

కం. అప్పు డని దెప్పరమ్మున
ముప్పిరిగొనుకినుక నిగుడ ♦ మొనసి గుదియపెం
జిప్పల్ల గుప్పగుప్పన
నిప్పుక లొగి నుప్పతిల్ల ♦ నిలిచెం బెలుచన్.

ఉ. బాహువు లప్పళించి బహు♦భంగుల మించి గ్రహంబు వెన్కగా
నూహ లొనర్చి నిల్చి విజ♦యోన్నతిఁ గోరుచుఁ బొల్చి జన్యస
న్నాహము దేహచేష్టలఁ గ♦నంబడఁగాఁ బరవళ్లు చుట్టుచున్
శ్రీహరిసేనలున్ దనుజ♦సేనలు చూడఁ గడంక వీడఁగన్.

మ. మొనసోఁకుల్ మెరయింపుగుండ్లు మొరయిం♦పున్ రేక దోకింపుచు
ట్టునపుట్టున్ బెడఁగొట్టుగుట్టుపరివ♦ట్టుం గొట్టి నవ్వీటిగొ
ట్టును ముక్కాఁకయు గొక్కెసాపెణకపో♦టున్ మీటు పాటిల్ల ను
క్కున నొక్కుమ్మడి పోరసాగి రిరువు♦ర్గొట్టని బిట్టార్చుచున్.

సీ. పూసపోఁకులఁ బెట్టు♦పుట్టుమిణ్గురులందుఁ
బొరిపోరి భూనభో♦ంతరము నిండ

ఘనదండమున ద్రోయు♦కంచుటందియ లెంచ
స్థిరదిక్కరిశ్రుతుల్ ♦ చెవుడు నింపఁ
గరిదిగుంఘునఁ జుట్టు♦గజ్జనాదు దెమల్ప
గల్పాంతనిర్ఘాత♦గరిమ దెల్ప
లగుడవిభ్రమణంబు ♦ జగతిఁ దేపకుఁదేప
స్ఫుటకాలదండవి♦స్ఫూర్తిఁ జూప

తే. గీ. నదను దాపల వలపల ♦ నెదుట వెనుకఁ
గదిసి యిదె యిదె పోడు పోడు ♦ విదె యదంచుఁ
బవనజపలాశసంభవుల్ ♦ బలిమిమీఱి
వెనుకఁ దియ్యక పెనఁగి రా♦కినుక దొనుక.

సీ. కాలసర్పమ్ములగతి మింట ద్రేయుచో
స్వర్గాదిలోకముల్ ♦ జలదరించు
నురువడి చేకొద్ది ♦ దిరబిరఁ ద్రిప్పుచో
మొగి నవాంతరలోక♦ములు చలించు
చే దట్టి బెట్టుగా ♦ క్షితిచేతఁ బెట్టుచోఁ
బాతాళలోకంబు ♦ బబ్బరించు
ఢాక మీఱంగ న♦డ్డము చేసి చిమ్ముచో
ధరణిలోకం బెల్ల ♦ దల్లడించు

తే. గీ. ననుచు నందఱు వెఱఁగంద ♦ నణఁగి యడఁగి
నిలవరంబుగ వెగటాని ♦ నిగిడి నిగిడి
బెట్టు గుదియల నొండొంటఁ ♦ జుట్టుముట్టి
భీమభగదత్తులు తమంతఁ ♦ బెనఁగి రంత.

సీ. పాండవేయవతంస♦పదనిపారణమేలు
యమరారితనయభా♦రముభళీర
పరిబిత్తరఘు చూపు♦చంద్రవంశలలామ
క్షణదాచరసెబాసు♦కళహాళంబు

భీమసేన కడిందె♦పెట్లాడు మఝ్ఝూరె
మమ్మారె దనుజేంద్ర♦కుమ్మరింపు
ఉత్తరుం డొక్కరుం ♦ డోహోహో బకవైరి
వింతదైత్యాధీశ ♦ కొంతమాఱు

తే. గీ. లనుచు నిరుగడఁ దమవార ♦ లభినుతింప
హెచ్చరిచ్చంగఁబడి లేచి ♦ వచ్చి హెచ్చి
పోరి రిరువురు గద లని♦భూమి కదల
ననిలతనయుండు నరకదై♦త్యాత్మజుండు.

చ. అటువలె గంధసింధురము ♦ లట్లు గదారణ మిర్వురున్ సము
త్కటగతి సల్ప దానవుఁడు ♦ తగ్గి ధరాస్థలి మ్రొగ్గి లేచి సం
కటమున నాచి చేగుదియ ♦ గ్రక్కున నొక్కఁడుఁ బాఱవైచి మైఁ
గటమున రక్తధార దొరు♦గన్ నరుగన్ వరుగెత్తె వీటికిన్.

శా. ఆలా గాత్మజుఁ డేఁగ జిత్తమున గో♦పావేశ మేపార ను,
ద్వేలద్వేషము మీఱఁగా నరకదై♦త్యేయుండు మత్తేభముం
గా లాడింపుచు నొత్తిమిత్తి బలుధా♦కన్ హత్తి చేయెత్తి యా
భీలస్ఫూర్తిని దైత్యసేనఁ బురికొ♦ల్పెం గృష్ణు నీక్షింపుచున్.

వ.—అంత.

శా. శోణోత్తేజితనీలజాలముల ర♦చ్చం బెట్టునేత్రద్యుతుల్
రాణించన్ దరహాసచంద్రికలు మీ♦ఱన్ గండభాగంబులన్
మాణిక్యోజ్జ్వలకుండలప్రభలు గ్ర♦మ్మం బైఁట సారించి సు
శ్రోణీరత్నము లేచి నిల్చె సమర♦క్షోణిం బ్రియాగ్రమ్మునన్.

కం. హరిణాయతాక్షి లేచిన
దరహాసము చిగురుమోవిఁ ♦ దళతళ మనఁగా
హరి పలికె విస్మయంబున
స్మరపుండ్రధనుర్విముక్త♦మౌక్తికలీలన్.

కం. ఆలంబునకై యిటువలె
మేలంబున లేవఁ దగవె ♦ మెలఁతలు చేసే
జాలమ్ము లేమి చెప్పదు
వాలమ్ములయేట్లు విరులె ♦ వనజదళాక్షీ.

సీ. కేళీగృహాకపోత♦కివకివారవములా
యమరారిఘోరకా♦హళరవంబు
సహచరీసాకూత♦సల్లాపసరణులా
నాసీరదరిసింహ♦నాదసరణి
బాలికాపరిచిత♦డోలికావిహృతులా
సమరయాతాయాత♦గమనవిహృతి
ధర్మపాంచాలికా♦పరిణయరీతులా
రిపుసారకాంతాప♦రిణయరీతి

తే. గీ. యకట యే మందు నిందీవ♦రాక్షి వికట
సురవిమతసేనలను దేజి ♦ చూడవశమె
తెలిసినను కన్నకార్యంబు ♦ తెలియ కున్నఁ
జానలకు నెందు సహజంబు ♦ సాహసంబు.

కం. [1]రామా మే మానిక కిట
[2]రామా రా మాటవాసి ♦ రా మానవుఁడా
[3]రా మానునె రణమున గా
రామా యని చెలికి రామ♦రామా తగునే.

కం. అనిన విని మత్తకాశిని
తననాయకుచేతిధనువు ♦ దాఁ జేకొనఁ గా
మునియంపఁ బూనురతిరే
కను మృదుచే నొడియునల్ల♦గౌరియుఁబోలెన్.

---

పా. 1. రామా వేమారక కిట. పా. 2. రామా నా మాటవాసి.
పా. 3. రా మానునె రణ మన గా.

కం. వి ల్లందుక శరధారలు
మల్లడిగొనఁ బల్లవోష్ఠి ♦ మార్తురసేనల్
చెల్లాచెదరుగఁ జేసెను
భల్లా [1]బడెసాయ బనుచుఁ ♦ బతి నుతియింపన్.

సీ. కంకణక్రేంక్రియల్ ♦ కటుచాపటంక్రియల్
చిఱునవ్వు మెఱయింపు ♦ జేవురింపు
కలవాగ్విరావముల్ ♦ కహాకహారావముల్
గొల్లన నగుముద్దు ♦ గొరకసద్దు
సరససల్లాపంబు ♦ సంగ్రామకోపంబు
వింతసొగసుధాక ♦ వెగటుకేక
సొంపుమీఱినవైపు ♦ చుఱచుఱ మనుచూపు
బులుపులు తగునంగు ♦ పొగరుపొంగు

తే. గీ. సరసశృంగారవీరర♦సంబు లమరు
కొమరు తగి యుండ మెయిఁ జిఱు♦చెమట నిండఁ
బోరు గావించె రిపుసేన ♦ బో రనంగఁ
గల్లవగగొల్లదేవేరి ♦ కడఁక మీఱి.

వ. అపుడు.

కం. గొనయమ్ము దివిచి కోమలి
గనయముఁ జిమ్మఁగ నురోజ♦కలశమ్ములత
గ్గును హెచ్చుఁ జూచి కుతుక
మ్మున హరిహృదయమ్ము వెనుక♦ముందై యుండెన్.

సీ. సంపర్తకేలిదై ♦ చంద్రికాపాళిదై
తనుగెంపు నగుపెంపు ♦ గ్రక్కతిల్లఁ
బటుకాలదూతిదై ♦ పంచాస్త్రిహేతిదై
చాపంబు రూపంబు ♦ సంఘటిల్ల

పా. 1. బడెసాహెబనుచు.

నళినిదుర్ధర్షమై ♦ యతిసుధావర్షమై
విడిసద్దు నుడిముద్దు ♦ విస్తరిల్ల
నుల్లాసనాభిధమై ♦ యురుమోహాశోభిధమై
శరవృష్టి కచవృష్టి ♦ పరిఢవిల్ల

తే. గీ. దితిజదితిజాంతకులకు ను♦ద్వేగరాగ
సంగతులు పొంగ నంగనా♦జనమతల్లి
కినిసి యనిఁ జేసె ధీచమ♦త్కృతి వినిద్ర
రౌద్రశృంగారరసము లౌ♦రా యనంగ.

మ. స్ఫురితాంగద్యుతి చంచలాలతికగా ♦ భ్రూవల్లరీవేల్లనల్
పరుషేంద్రాయుధలీలఁ జూపఁ గచశో♦భ ల్కాందబృందంబుగాఁ
గరజశ్రీల్ కరకాళిగా దితిజసం♦ఘాతాబ్జదుర్ధర్ష మా
శరవర్షంబులు నించెఁ జంద్రముఖి వ♦ర్షాలక్ష్మిచందంబునన్.

కం. ఎడనెడ వెన్నుం డోసఁగెడు
మడుపులు గొని యనికి మగుడ ♦ మదవతి ముఖమ
య్యెడఁ దగెఁ గచఘనకలనల
బెడసిబెడసి తిరుగుచంద్ర♦బింబమువోలెన్.

సీ. ప్రియునిపై బొమముడి ♦ పెట్టనేరనిగోల
గడుసుసింగిణి నెట్లు ♦ గుడుసుచేసె?
చెలులతో ముద్దుగాఁ ♦ బలుకనేరనిబాల
గద్దించి రిపు నెట్లు ♦ ఘాతచేసె?
స్వీయసైరంధ్రి కై ♦సేయ నోడుఁగుతన్వి
శితబాణతతి నెట్లు ♦ చెంగలించె?
అలరుపాదపు ద్రాఁచఁ ♦ దలఁకెడితరళాక్షి
దళములపై నెట్లు ♦ తారసిల్లె?
తే. గీ. కుంకుమవసంతముల నాడఁ ♦ గొంకుకాంత
యరులమెయి రక్తధార లే♦కరణి నించె?

ననుచుఁ జెలు లందఱును చూచి ♦ హర్ష మొంది
పొదల దైత్యులఁ జెండాడెఁ ♦ బువ్వుబోఁడి.

సీ. వెన్నెలమూఁకయో ♦ విడియెండకాఁకయో
యన నయ్యెఁ జంద్రాస్య♦మినుకుచూపు
మరుకీర్తిలెక్కయో ♦ నెఱతోఁకచుక్కయో
యన నయ్యెఁ దెరవమ్ము♦త్యపుఁదురాయి
పూఁదేనెసోనయో ♦ పొడిరాతివానయో
యన నయ్యె మగువాగా♦యకపుమాట
జంత్రవిశేషమో ♦ శతధారఘోషమో
యన నయ్యెఁ జెలివింటి♦గొనముసద్దు

తే. గీ. మొనయుశౌరికి వైరికి ♦ మోదఖేద
ములను శృంగారరసము న♦ద్భుతరసంబుఁ
దోఁచ నారాచముల నేసి ♦ దురముఁ జేసెఁ
గుతుకకోపంబుల నెసంగి ♦ కోమలాంగి.

కం. తెలిచూపుమెఱుఁగుపొత్తుల
వలెఁ దగస్తనకలశహార♦వల్లరి స్తన్యా
కలనఁ దగఁ దల్లి గావున
నలచెలి తాఁ బెంచ నెంచె ♦ నసురకులేంద్రుణ్.

కం. ఆవగ రొత్తింగి కృష్ణుఁడు
భావము రంజిల్ల నిట్లు ♦ పలికెం జెలియా
నీ వెంతయు బడలితివి గ
దా విను నేఁ బోరు చేసె♦దం జలమేలే?

తే. గీ. కినుక దగ వీరపత్నివి ♦ గనుక నీకు
నని యొనర్చుట యుచితంబె ♦ యైన నేమి
యేను నీదాసుఁడను గాన ♦ యిపుడు లలన
కలన నాచేత గెలిపించుఁ♦దలఁచవలయు.

---

పా. 1. గా♦యనవుపలుకు.

కం. అని నగి నగించి తా గ్ర
కక్కున హరి యని యుక్కు మిగులఁ ♦ గొమచేబాణా
సనము గొని యెక్కు దీర్చెఁ
గొనకొనుగుణరవభరంబు ♦ ఘుమఘుమ మనఁగన్.

మ. ధను వక్కైక్కువడి నెక్కు దీర్చి గుణసం♦ధానంబు గావించి రో
షనటద్భ్రూకుటియై ఛటచ్ఛటలు పెం♦చ్చన్ గుంపు విచ్చంగ దై
త్యనికాయంబులపై రమాపతి స్ఫులిం♦గాటోప ముప్పొంగ నిం
గి నెసంగన్ శరధార నించె సమర♦క్రీడామహోదారుఁడై.

కం. జగదీశుఁ డవ్విధంబున
మగఁటిమిఁ జూపంగ మాఱు♦మలయుచుఁ గిన్కన్
దిగదిగ మనుచూపులతో
నిగు రెత్తెడివగను దైత్యుఁ ♦ డి ట్లని పలికెన్.

కం. ఉవిదలమఱుఁగున నుండియు
బవరం బొనరించునట్టి ♦ పౌఢుఁడ వీవే
భువిలోన నిట్టిశౌర్యం
బవురా నే నెందుఁ గాన ♦ నాభీరమణీ.

సీ. నాపీట బందిఖా♦నాఁ బడి యున్నట్టి
యఖిలభూపాలక♦న్యకలకన్న
నాదివాణంబులో♦నను బత్తిఁ బని సేయు
గంధర్వరాట్కులాం♦గనలకన్న
నెక్కు డౌప్రేముడి ♦ నింపుటారతు లెత్తు
జగపాఁపరాణివా♦సములకన్న
నాచెంతఁ జేరి మ♦న్నన నూడిగము సేయు
తెఱగంటికోడెబి♦త్తరులకన్న
తే. గీ. మిన్నగా నున్న దేమి యీ♦యన్న మిగుల
నిటుల నియ్యాఁటదానిఁ దె♦చ్చుట గొఱంత

మగువశౌర్యంబు నమ్మట ♦ మగతనంబె
వర్తమానవృథాటోప ♦ ధూర్తగోప.

చ. అని నరకాసురుండు నము♦దగ్రదురాగ్రహుఁడై యవగ్రహం
బున మఱి చేకొలంది ముసు♦మున్నుగఁ గుంభము లప్పళించి హ
స్తిని గదియించి శౌరికడఁ♦జేరి శరాసననిర్గళన్నిన
ర్గనిశితఘోరమార్గణప♦రంపరఁ బెంపరలాడె నయ్యెడన్.

సీ. కరి ఘీంకృతులు చేసి ♦ కవిసి కొమ్ములఁ గ్రుమ్మఁ
గో యని శితనఖ♦కోటిఁ గొట్టి
గజము కర్ణములచే ♦ గజిబిజి సేయంగఁ
గక్కటిలంగ ఱె♦క్కలను గొట్టి
కినుక మత్తేభంబు ♦ పెనుబారి వేయంగఁ
జిల్వతావళమునఁ ♦ జెదరఁగొట్టి
వారణం బతిఘోర♦వమథువుల్ చిమ్మిన
నగుఁజూపుమంటచే ♦ నిగురఁగొట్టి

తే. గీ. తాను నాగారి గావునఁ ♦ దార్ఢ్యఁ డధిక
రోషభీషణతరమహా♦వేష మమర
వెనుకఁ గదియించె ననుపమ♦విజయ మెసఁగ
వైరినాగంబు నవ్వేళ ♦ శౌరిమ్రోల.

చ. గరుడనిఘాశకర్తన్ వదన♦కంజ మొకించుక చెంగలించఁగా
శరముల నించుదైత్యబల♦శాసనువీఁకకుఁ గిన్క హెచ్చఁగా
సరసత వెన్కనుండి కొమ♦చన్మొనగుబ్బల నెచ్చరించఁగా
దుర మొనరించె బిరమునఁ ♦ దోయరుహాక్షుఁడు యోజితాస్త్రుఁడై.

తే. గీ. అటులు సత్యాధిపతి యేయు♦నస్త్రములకు
నసుర ప్రత్యస్త్రముల నేసి ♦ యఱచి శక్తి
వైనతేయునిపై వైచె ♦ వైవ నతఁడు
దానిఁ దాల్చెను కలువల♦దండరీతి.

చ. అమరవిరోధి శక్తి యటు ♦ లైన విరించినుడిన్. గుఱించి మిం
చి మఱియు నాగ్రహించి యని ♦ సేయుచు డాయుచుఁ దోమరంబు కుం
తము ముసలంబు పాశ మసి ♦ దండ మఖండపరశ్వథంబు టం
కము గద ముద్గరంబు పరి ♦ ఘంబు నగెత్తుగఁ బేర్చి యేసినన్.

ఉ. ఏసిన నస్త్రశస్త్రముల ♦ నెంతవడిన్ బరిగోల వ్రేసి పోఁ
ద్రోసి మహాద్భుతం బపుడు ♦ తోఁపఁగ బెట్టుగఁ గేకవేసి యు
ల్లాసము మీఱ సంగరవి ♦ లాసము నెయ్యురు మేలుమే లనన్
వాసిగఁ బైఁడిచేల వలె ♦ వాటులు మీఱఁగ నేపు మీఱఁగన్.

కం. చక్రి సమరక్రమంబును
విక్రమమును బాహుబలము ♦ విజయం బెసఁగన్
శక్రాదిసురలు పొగడఁగఁ
జక్రంబున నసురుశిరము ♦ చక్కఁగఁ ద్రుంచెన్.

కం. ఒకయరిఁ జేపట్టుక యరిఁ
డెకటార్చెను శౌరి యనుచు ♦ దితిజునితల త
ల్లికిఁ జెప్ప యెచ్చటికిఁ బో
వక పుడమిని కడుపుచొచ్చు ♦ వగ ధరఁ గ్రుంగెన్.

లయ. అమ్మురహరుండు బవ ♦ రమ్మున జయారె విజ
యమ్మటులు కైకొనఁగఁ ♦ గొమ్మ కడు సంతో
షమ్మునను కౌఁగిటను ♦ బమ్మి హరిమేనఁ జిఱు
చెమ్మటల నొత్తె జిలుఁ ♦ గుమ్మొయఁగుపైఁటన్
గ్రమ్ముమృదుమందపవ ♦ నమ్ములను గంధమున
నిమ్ముకొనె నెంతయును ♦ కమ్మవిరిసోనల్
ధిమ్మనియె సారె పట ♦ హమ్ము లమరీసునట
నమ్ములవిధమ్ములను ♦ ముమ్మడిలె నంతన్.

వ. అటువలె విజయమ్ము గైకొని యమ్మదనజనకుండును సురనిచయమ్ములం జూచి యచ్చెరువునం దల యూఁచి యవనీసతి వచ్చి మ్రొక్క-

కన్నుల నీరు గ్రుక్కి వై జయంతియు వనమాలికయు వరుణచ్ఛత్రంబును వాసవజననీకుండలంబులు నొసంగినం గై కొని యామెమనవిచేకొని జనక వియోగజనితఖేదాయత్తుం డైనభగదత్తునిం బట్టాభిషిక్తునిం జేసి యేటి యెలనాగల నెదుర్కొనుమేటిమున్నీటినీటునఁ బదాఱువేలరాచకన్నియల నెదుర్కొని వేఱువేఱ పేర్కొని యన్యోన్య వీక్షాంతరంగితహావభావుండును ననుపమవిభావుండునగుచు నవ్వధూమణులం దోడ్కొని యప్పురంబు వీడ్కొని యఖిలబలంబులుఁ దాను నండజకులాఖండల స్కంధారోహణంబు చేసి యక్కనకమహాశైలంబు నెడఁబాసి యతిరయంబున ద్వారకానగరంబుఁ బ్రవేశించి గరుడావరోహణమ్ము గావించి యాత్మవిజయంబు నభివర్ణింప వచ్చినయమరేంద్రునకు నదితికుండలంబులును నవరత్నకనకధారావిచిత్రం బగువరుణచ్ఛత్రంబును సమర్పించి యతని నమరావతికిం బంచి వైనతేయుని నగ్గించి విజయసైనేయమాద్రేయుల విడిదలకుఁ బోవ నియోగించి సత్య భామయుఁ దానును సరససల్లాపంబు లాడుచు నగరు సొత్తెంచి యలసిన యలంత దీర్చుక రమ్మని యమ్మగువను నిజగృహంబునకుఁ బుత్తెంచి తమ్ము నెదుర్కొనుభోజకన్యాముఖాంభోజముఖుల నాదరించి యయ్యైరుదచ్చివేయి మచ్చెకంటులయందుఁ దమి పుట్టినయందఱిని శుభముహూర్తంబునఁ జేపట్టి వారలకు వేఱువేఱ లీలాగృహంబులు పావణించి శృంగారవనంబున రంగారు చిన్నిలతకూనలం బొదవుసోమరిగాలిచందంబునఁ జక్కఁదనంబున కిక్క లగుచక్కవెలఁదులఁ జొక్కించుచక్కెరవిల్తుమామయందంబున నిఖిలతరు శాఖ లిగురొత్తహత్తి సంతసిల్లువసంతునిభాతిఁ బ్రకృతుల నన్నింటి నలంచు పరమాత్మరీతి నానందసంధానితహృదయారవిందుండై యిందుముఖుల నందఱిం గందర్పసామ్రాజ్య మేలింపుచుండె నయ్యుదంత మంతయు నెయ్యం పుటింతులవలన వినంబడ నయ్యవసరంబున.

చ. కొఱకొఱ మించె రుక్మిణికి ♦ ఘూర్ణిలె లక్షణ యెంతయేని చు
కృరమనె భద్ర జాంబవతి♦కుందెఁ గళిందజ గందెఁ జాల వే
పరుకొనె మిత్రవింద నగ్నె♦జాలఁ దపించె సుదంత వారిలో
నరయఁగ సత్య తా పరుసు♦రా లగుటక్క మదికిన్క మాటుచుక్.

ఉ. వారల నూరడించి యదు♦వల్లభుని న్వినుతించి ముందుగా
నేరికి డెందముం దెలియ♦నియ్యక కయ్యపుగెల్పునుద్దులున్
సారెకు నగ్గడించి యల ♦ చానల వీడ్కొని పాదకంజమం
జీరఝుళంఝుళం బెసఁగఁ ♦ జిత్తము కగ్గఁగ వచ్చె నింటికిన్.

కం. వచ్చినరాక గనుంగొని
యచ్చెలినెచ్చెలులు కోప ♦ మగ్గల మని తా
మిచ్చట నచ్చట నొదుఁగుచు
నచ్చికముగ నడుగరాఁగ ♦ నంతఁ దనంతన్.

చ. కనుగలవింటిదంట కడ♦కంట ననుంజిగిమంట లంట నె
మ్మనమున నిచ్చరచ్చ గొను ♦ మచ్చర మెచ్చఁ బటానిచిల్కతే
జిని వడి నూకి కేక లిడి ♦ చేకొలఁది న్మొల నున్న నున్నక్రొ
న్ననపిడియమ్ము రెమ్మి జత♦నమ్ముగఁ గొమ్మయురమ్ము గ్రుమ్మినన్.

కం. మోహము భయసన్నాహము
నోహరిసాహరిఁ బెనంగ ♦ నులికి యులికి లో
నూహించి నెచ్చెలులతో
నాహిమకరవదన కోప ♦ మాఁపక పలికెన్.

శా. మోమోటమ్మునఁ జేరఁగా నరిగి మి♦మ్ముం జౌక గావింతునా
యేమీ గొంకెద రమ్మలార దయతో ♦ నిన్నాళ్లు మన్నించునా
సామిన్ రచ్చలఁ బెట్టఁగావలసె నా♦చందంబు మీతో నయో
యే మంచున్ వచియింతు నూరకె వితా♦యీవేళ సిగ్గయ్యెడిన్.

కం. మగఁడే దైవ మటంచును
మగువలు మతి నమ్మి యుండు♦మమత కలదుగా
మగఁ డెడసి చౌక చేసిన
మగువకుఁ గా దనఁ దరంబె ♦ మదవతులారా.

కం. సురవైరిపీట నొక్కడఁ
జెఱఁబడి విడఁబడిన మిఱుకు♦చెలువలతో నా

హరివంటిరసికుఁ డెనయుట
మరునిప్రతాపంబొ కాక ♦ మాభాగ్యంబో.

కం. దిటమునఁ బదాఱువేవురు
కుటిలాక్షులమాయఁ దగిలె ♦ గోపాలుఁడు నే
నెటువలె సైరింతు నయో
కటకట యెడ లేనిసవతి♦కాపుర మయ్యెన్.

సీ. తేరకుఁదేరగాఁ ♦ జేరినరాధతోఁ
గూడి యాడి సుఖించుఁ ♦ గొన్నినాళ్లు
నేటుగాఁ దనచేతి♦తాటికి లోనైన
కోమలులకుఁ దక్కుఁ ♦ గొన్నినాళ్లు
చెల్లఁగా మును గొల్ల♦వల్లెల నగవడు
కొమెరలనుడిఁ జిక్కుఁ ♦ గొన్నినాళ్లు
యోగంబు దెచ్చుమే♦యాగంబు పచరించు
గుబ్బెతలకు నబ్బుఁ ♦ గొన్నినాళ్లు
తే. గీ. వాని నొకనోట మగఁ డన ♦ వశమె యట్టి
బ్రదుకునకు నెల్లఁ జాలని♦కొదవ యేడ
వానికిఁ బదాఱువేలపై ♦ వలపు పాఱి
మున్మురం బయ్యె నీవేళ ♦ నమ్మలార.

కం. మును దనకు మేను దాఁచక
పెనఁగినపౌరుషము జనులు ♦ పృథివి నెఱుఁగరా
వనజాక్షులార యెవ్వరి
నెన రెవ్వరికిన్ సతంబు ♦ నిజ మిటు లయ్యెన్.

కం. వగ దప్పి నలంగిననా
దగదప్పులఁ దీర్చి నన్నుఁ ♦ దనియించక యా
మగువల హరి సేరెఁ గదా
తగ వేడది పతికి గుబ్బె♦తలు తఱ చైనన్.

కం. మొదల నొకరాధ చాలును
విదపక జతచెలులెకె చాలుఁ ♦ బ్రియునానసను నేఁ
గదిసి సుఖించఁగ నవతులు
పదియార్వేలైన నెట్లు ♦ బ్రదుకఁగవచ్చుక్.

కం. ఎల్లరు లోకంబున మగఁ
డొల్లనిప్రోయాలి జముఁడు ♦ నొల్లఁ డనంగా
నుల్లాస మేది యిటువలెఁ
దెల్లముగాఁ బరువు దప్పి♦తిం జెలులారా.

కం. అని యీగ్తై వడి నారీ
జనములతోఁ బలికి కోప♦ ఘూర్ణితమన
స్సున ననమాయుధబాణా
సనఘుంకృతు లనఁగ నూర్చి ♦ చపలాశయ యై.

సీ. మోవితావికి డాయ ♦ మొనయఁగా నెదురందు
మొకరితేఁటులనాదు ♦ మోహరింప
వెడఁదచన్నులయందు ♦ వెలయు కెంజిగిలీల
నంగజశరకీల ♦ లంకురింప
జంత్రంబుల రతంబు ♦ సలుపుకూకిరుతంబు
దిటము నై నవిధంబు ♦ ధిక్కరింప
ప్రేమ గూడుగయాళి♦రామతమ్మలయాళి
యదరుగుండియజాలి ♦ యాదరింపఁ

తే. గీ. జెలులచేమంతి నవలరే♦కులబవంతిఁ
బరఁగుమెఱుఁగారుచిగురాకు♦పాన్పుమీఁదఁ
బదనుకత్తులబోనుపైఁ ♦ బడినరీతి
వ్రాలె నెలనాగ యులరుచు♦వలపు రేఁగ.

కం. అటువలెఁ బాన్పునఁ బడి తా
నటు నిటుఁ బొరలుచును గుండె ♦ యదరిపడంగాఁ

జిటచిట యంతట నెఱయఁగఁ
గుటిలాక్షి మహార్ద్ర రావ ♦ కోపాకుల యై.

వ. వికవిక నవ్వు నుస్సు రను ♦ ప్రేలిపడుః విధి దూఱుఁ జింత నూ
రక తలపోయు బోంట్ల నడ ♦ రః గమకించుఁ దపించుఁ దాళఁజా
లక విలపించు నౌనవు బ ♦ ళా యను హా యను దూఱి పోరి యి
చ్చకములు సేతునా యనును ♦ జంకును గొంకుఁ దలంకు నెంతయుః.

కం. ఈరీతి వగలఁ బొగిలెడి
నారీతిలకంబుఖుబుర్షు ♦ నర్మసఖు ల్వే
ర్వేఱ వివరించ విని శృం
గారభయాద్భుతదయావ ♦ గాఢహృదయుఁడై.

ఆ. వె. కట్టుకొన్న చెలులఁ ♦ గా దనవచ్చునో
మహిని గా దటన్న ♦ మాట రాదొ
యిట్టిపట్ల సత్య ♦ కేల కోపము వచ్చె
నేమి సేతు నంచు ♦ నెంచియెంచి.

సీ. మెలిగొన్నహారముల్ ♦ మెల్ల మెల్లనఁ జేరి
యింతి యొక్కతె దిద్ద ♦ నియ్యకొనక
సరగున వచ్చు చో ♦ జాజినవలెవాటు
చాన యొక్కతె యీన ♦ సరకుగొనక
యెడఁబాయలేనురా ♦ యే వత్తునా యని
మగువ యొక్కతె దెల్పు ♦ మనవి వినక
సైగగా నొకకడ ♦ సవతునూతనరాక
బాల యొక్కతె నిల్వ ♦ నేల యనక

తే. గీ. పచ్చవిల్తునిబవరంబు ♦ రచ్చ నిచ్చు
వేలుకల హెచ్చుదుగదచ్చి ♦ వేలసతుల
విడిదలబవంతి దగ కేరి ♦ వెడలి వచ్చెఁ
గామినీసాంత్వనము గోరి ♦ కంసవైరి.

ఉ. వచ్చి మురారి రచ్చఁ బడి ♦ వారిజలోచన యిందుచందముఁ
నెచ్చెలు లుండునందమును ♦ నెమ్మిఁ గనుంగొని సారె పైపయిఁ
వెచ్చఁగ నూర్చియూర్చి యిది ♦ విం తవు నంచుఁ దలంచు నెమ్మదిఁ
హెచ్చినమోహసాగరము ♦ నెంచుచుఁ జెక్కిటఁ జెయ్యి చేర్చుచుఁ.

సీ. అంతటింతటఁ జేరి ♦ యారతిపళ్లెంబు
లెత్తరారై రిగా ♦ యిందుముఖులు
అయ్యవారా సత్య ♦ యదిగో యున్న దటంచు
రాకొట్టదాయెఁగా ♦ రామచిలుక
మెచ్చుగా నిటకు నేఁ ♦ దెచ్చినచేకాన్క
లందుకోరై రిగా ♦ యనుఁగుఁజెలులు
కంకణా లందెలు ♦ ఘ ల్లనఁగా వచ్చి
చెయ్యియ్యదాయెఁగా ♦ చిగురుబోఁడి

తే. గీ. యిటువలెనె మేర దప్పి యీ♦యింతి సేయు
చలము దెలిసియు నాపాప♦జాతిమనసు
దీనిపదములఁ జుట్టుక ♦ రా నటన్నఁ
దాళఁగూడునె యని యెంచి ♦ తల్లడించి.

సీ. పంచదారయు నించి ♦ పండ్లు మేపితిఁ గాని
చిలుకకు నే నేమి ♦ చేసినానొ
యాటలు దిద్దించి ♦ హవణించితిని గాని
శిఖడింభముల కేమి ♦ చేసినానొ
పేర్పేర మన్నించి ♦ ప్రియము చేసితిఁ గాని
చెలులకు నే నేమి ♦ చేసినానొ
కని పెంచి ఘనునిగా ♦ గారవించితిఁ గాని
చెఱకువిల్తుని కేమి ♦ చేసినానొ

తే. గీ. కటకటా ప్రాణనాయకి♦కరుణ లేమి
నెవరికంటికి దెసనుండ ♦ కిట్టు లైతి

నెనరు కన రైన నిం కెట్లు ♦ కనరువాఁడ
ననుచు వివరించి వివరించి ♦ యాత్మ నెంచి.

సీ. గరితయే యిట్టులు ♦ కలహించ నోడికట్టఁ
గా దనఁ జూచునే ♦ కలువకంటి
సతియె యీరా కై వడిఁ ♦ జలపదంబున నుండఁ
గినిసి వాదించునే ♦ కీరవాణి
దేవేరియే యిట్లు ♦ భావంబు దాఁచిన
నటు పోవ నెంచునే ♦ హంసగమన
యిల్లాలె యీరీతి ♦ నెనసి కోపించినఁ
జల్లార్చి తేర్చునే ♦ చంద్రవదన
తే. గీ. వనిత తనుఁ దాన తెలిసికో♦వలెను గాని
పరులు నా కౌదురా యయో ♦మరులు కెరలి
యిరులుకొన్నట్టు లున్నది ♦ యీజగంబు
పాపు విధి యంచుఁ జింతించి ♦ బాళి మించి.

మ. ఎదుటన్ లేఁజిగురాకుపానుపుపయిన్ ♦ హేరాళ మావంతచేఁ
గుది నంతంతకు వింత లీనుహజోయలుం ♦ గోపంబు తాపంబు లోఁ
బొదలం గన్నులు మోడ్చి మైమఱచి పూ♦బోం ణ్లూరడించంగ ను
న్మదయై పొర్లుచు నుండుసత్యఁ గనె శౌం♦భద్దాన్యసంరంభుఁడై.
కం. కని తాఁ జేరంబోయిన
వనితలు తొలఁగంగ, వలదు ♦ వల దను యాక్రో
న్నసబోఁడులమఱుఁగున నొక
ననసురటిని విసరె శౌరి ♦ నారీమణికిన్.

చ. విసరఁగఁ గమ్మఁదెమ్మెరలు ♦ వీచుదువాళికిఁ బైఁట జాఱఁ గ
క్కసపుమెఱుంగుగట్టువగ♦గబ్బిచనుంగవ బైలుదేఱఁగా
దుసుకిలి నీవి పోవ నల ♦ తోయరుహాసన యుల్కి యుల్కి లో
మసలి చెఱంగు గప్పకొని ♦ మంపును కోపముఁ బెంపుమీఱఁగన్.

కం. ఉదరిపడి చూచి యధరం
బదరఁగఁ గన్గొనలఁ గ్రమ్ము♦నశ్రుకణంబుల్
పొదలంగ నేడ్చుచును గ
ద్గదవాగ్వైఖరిని హరిని ♦ కసరుచుఁ బల్కెన్.

ఉ. నుచ్చుతనమ్ము లేల కను♦సూసుక నేను కలంగియుండఁగా
నెచ్చెలిమాటునన్ నిలిచి ♦ నిక్కముగా దయగల్గినట్లుగా
నిచ్చట నీవన న్వినర ♦ నేటికి నేఁటికిఁ జాలుఁజాలు నీ
గచ్చు లదే మురారి కల♦కాలము నీవగ లే నెఱుంగనా.

కం. వగవగగ నీవు వినరే
వగ చేతోజప్రతాప♦వహ్నిజ్వాలల్
తగిలించుటో యటునిటు నను
నొగిలించుటో తెల్పు నీదు♦నుడి వినవలెరా.

కం. నీ వేమి సేతు వింతులు
కావరమునఁ బిల్చిరేమొ♦కా నాప్రాణం
బీవగ నుండఁగ సామీ
రావలెనా నీతి గాదు♦రా నళినాక్షా.

కం. హంసీగమనలు చాలా
శంసింపఁగ మారవంబు ♦ చాలించి కడున్
సంసారి వైతి విప్పుడు
కంసారీ మేలు మంచి♦కాపుర మయ్యెన్.

కం. కలకాల మిట్టిచెలువల
కలహములకె కాలుద్రవ్వు♦ఘనుఁడవు గావా
తెలియకను మోసపోయిన
నెలఁతలతో గొడవ యింక ♦ నీ కేటికిరా.

ఉ. గుట్టున నున్నకోమలుల ♦ కోపము రేచి మొఱుంగనట్టుగాఁ
జుట్టుక కల్లచూపులను ♦ జూచుచు వారలు సేవసేయుచో

నిట్టటు గుక్కమిక్క మన♦నియ్యక తక్కుచు మొక్కలంబుగా
దిట్టతనంబు చూపునిను ♦ దేవరగాఁ దలపోయఁగావలెన్.

కం. మన నీవు పరుల, కందఱి
మనసులు నీ వైతె తెలిసి ♦ మాట్లాడెద వా
వనిత లిటువంటినీతో
ఘనతలు పచరించఁదగునె ♦ కంజదళాక్షా.

ఉ. పూవును తావి యింపెసఁగు ♦ పొంకముగాఁగ సతీపతుల్ మనో
భావన నిద్ద ఱేక మయి ♦ పంతును రంతును మీఱ నుండఁచో
నేవగ నైన ముచ్చటలు ♦ హెచ్చునుగాని మగండు చూడఁగా
నీవగఁ బూనె నేని తను♦వేటికి సిగ్గరి యైనబోటికిన్.

సీ. పోరు చేసినదాని♦పోరామి నాయమా
చెఱ నున్న చెలులమ♦చ్చికలకన్న
నీచేతఁ బడుబోంట్ల ♦ నెన రెన్న మంచిదా
వైరిచేఁ బడుబోంట్ల♦వలపుకన్న
నెనమండ్రలో నున్న♦యింతిమేలు ఘనంబె
వేవేలు గలబోంట్ల♦వింతకన్న
వేర్వేఱ పెండ్లాడు♦వెలఁదిచిన్నె నతంబె
గుంపుపెండ్లి సతుల♦కులుకున్న

తే. గీ. రసికుఁడవు నీవు నీవంటి♦ప్రౌఢుఁ డిందుఁ
జేర నుచితంబె యిటువంటి♦చెలిమి గలుగఁ
దెలిసి విహరించునీకు నేఁ ♦ దెలుపఁగలనె
వల్లవీదాస యిఁక నేల ♦ వట్టియాస.

వ. అని పలికినసత్యభామకుఁ జెలికత్తియ లిట్లనిరి.

కం. ఎఱిఁగెఱుఁగనివగ నీసరి
గరితలు నీవలెనె పతిని ♦ గరిసింతురచే
వెఱవక జగదీశ్వరుతోఁ
బరుసపుమాటాడఁదగునె ♦ పద్మదళాక్షీ.

కం. సాగ సౌతావికిఁ దుమ్మెద
జగతిని వేవేల లతలఁ ♦ జరియించదొకో
మగవాఁడు నటులె కాదా
మగువలయెడ నీకు నకట ♦ మచ్చర మేలే.

కం. ఒకసతి నైనను నరునకు
వెకటున్ గరగరిక పుట్టు ♦ వింత గలిగినన్
శుకవాణు లెందఱైనను
ప్రకటంబుగ నేలుదొరకు ♦ భయ మేలె చెలీ.

ఉ. పట్టివళావళుల్ నలుపు ♦ వారలె కాని ముకుందునిన్ మిటా
రిల్లటు నీవలెన్ బెళుక ♦ నియ్యనివారలు లేరు వాఁడు తా
నెట్టివెలంది నైన మది ♦ నెంచఁడు నీదయవాఁడు గావునన్
రట్టున కిట్టిపట్టునను ♦ రామ యయో మన సెట్టు లొగ్గనో.

సీ. వగలచేఁ బాగులుచు ♦ బిగిసి యుంటివిగాని
హరిని నెదుర్కొన ♦ వైతి వేల
కుములుచు పట్టినే ♦ రము లెంచితివి గాని
యబ్జాక్షు నలరించ ♦ వైతి వేల
కాఁక దెచ్చుకొని హా ♦ గద్దించితివి గాని
ప్రాణేశు రమ్మన ♦ వైతి వేల
చీద రొత్తినయట్లు ♦ సెలసి కొట్టితి గాని
యసురారి మన్నించ ♦ వైతి వేల
తే. గీ. అన్నియును కిన్క దీఱిన ♦ వైనఁగాని
యతఁడు దెచ్చినరత్నభూ ♦ షాంబరాదు
లందుకొన హెగ్గడీలతో ♦ నానతిమ్ము
వలదు వల దమ్మ యీజోలి ♦ వట్టిజాలి.

కం. అనిన విని కసరి యురగాం
గనవలెఁ దల యెత్తి బెట్టు ♦ గానూర్చి రయం

బున నో రగపడఁ బెట్టుచుఁ
గనకాంగుల నుబికి చూచి ♦ కామిని యనియెన్.

కం. ఎంచక మాటాడెద రీ
మంచితనమ్ములకు నేమి ♦ మంచిది చాలా
వంచకుఁడు మీ కొసంగెడు
లంచంబులు కొంచెగత్తె ♦ లా చెలులారా.

కం. అనువుగఁ గనుగీటుచు నే
విన మి మ్మొసరేచి తాను ♦ వెఱచినయట్లున్
ఘనుఁ డితఁ డావలిమొగమై
వినివినమిగ నుండు నిట్టి ♦ వితము లెఱుంగన్.

ఉ. వీనియుపేక్షయు న్మఱియు ♦ వీనిపరాఙ్ముఖభావమున్ బళా
మానినులార మీఁద నిట ♦ మ మ్మిఁక నేమి యొనర్చు వీనికిన్
వీనియనుంగుఁగొమ్మలకు ♦ వీనివితామొగమాటమాటకున్
వీనిపిసాళిచేతలకు ♦ విస్మయ మయ్యెడు నేఁ జలింతునే.

శా. సొమ్ముల్ చేలలు క్రొవ్విరుల్ మణులు కాం♦సు ల్మాకు నిం కేల నే
కొమ్మ ల్లేరె పదాఱువేవు రవి చే♦కోఁ గావున న్వారికిన్
సొ మ్మా నెన్న నితండు వీనికి నిలన్ ♦ సొ మ్మాదు రాబోటు లీ
నెమ్మి న్మీరలు దెల్ప నేమిటికి నే♦ణీనేత్రలారా యనన్.

కం. స త్యాటువలె ననఁ జెలువలు
ప్రత్యుత్తర మిచ్చి రపుడు ♦ పతికిన్ సతికిన్
నిత్యంబు నలుక గలుగుచొ
వ్యత్యాసము పుట్టకున్నె ♦ యదియు నెఱుఁగవా.

కం. ఎఱుఁగక నీ వొల్లనియీ
వరవస్తువు లొరుల కొసఁగ ♦ వారికి నళుకో
హరికృప గలవా రందఱు
దొరసానులు గారొ కొనిన ♦ దోసం బగునో.

కం. ఎపు డెపు డని మోహంబున
విప్రులాత్మలు వానిపొందు ♦ వేళలు గాచే
కృపు ర్తంత నీ వెఱుంగవొ
యిపు డెఱేఁగియు నీదుబుద్ధి ♦ యిటు లాయెఁగదా.

మ. నెన రావారల వీడనాడి తతివా ♦ నీతోడ నేస్తంబు చే
సినపాపంబున కేమొ తెల్పితిమి నీ ♦ చిత్తంబునం దోఁచిన
ట్లు నతాంగీ నడిపించుకొమ్ము మముబోఁ♦టుల్ నీకు నీ కేల వాఁ
డును నీవుఁ చలపోరఁగా నవల నెం♦ట్లో కార్య మట్లయ్యెడిన్.

మ. చిగురాకుంజముదాడిపైని బడవే♦చెంగల్వపూఁదేనె గ్రా
లఁగ నిద్రా తెలివెన్నెల ల్పొరఁగఁ జా♦లా యోర్చియు న్నీవెకా
తెగువ ల్చేసిన నీకె తప్పిదము తెం♦దెప్ప ల్చెలుల్ వానికిం
జిగురుఁ విల్తుని కేళిఁ దేలి సొగసుల్ ♦ చెల్లించుకో నిమ్మహిన్.

మ. అనినం గాంతలచేత వీఁడు గద యి♦ట్లాడించె నంచు న్మనం
బునఁ గోపం బుబుకంగ నీదువినయ♦మ్ముం గంటిఁగా నంచుఁ బైఁ
టను లేఁగొనునఁ జేర్చిచుట్టి చెలి యొ♦డ్డారమ్మునన్ లేచి చ
క్కనిశౌరిన్ జడఁ గొట్టెఁ గంకణరుణ♦త్కారంబు తోరంబుగన్.

చ. అటులు కృతప్రహారుఁ డయి ♦ యవ్వసుదేవకుమారుఁ డోరుపుఁ
దిటమును నేరుపు న్మెఱయఁ ♦ దీటియుఁ దీఱనిచింతతోడ నం
తటఁ జిఱునవ్వుఁబువ్వుజడి♦దార్కొనఁ బేర్కొన వచ్చి గ్రుచ్చి య
క్కటికము నాసయుఁ దొరయఁ♦గా నయగారితనాన ని ట్లనున్.

కం. జడఁ గొట్టి తీసితివిగా
జడయల్లిక నైన మెఱుఁగు ♦ చనదో తోట్టోఁ
బడఁతీ చే నొవ్వదొకో
యిదుముల కే నుండ నీకు ♦ నీఁగా నానే.

కం. ఏమే బంగరుబొమ్మా
నామీఁదను కరుణలేమి ♦ నాయం బగునే

నీమాటవాసి యెంతయుఁ
గామాకారంబు దెల్పెఁ ♦ గడపట మాకున్.

సీ. గొల్లచానలగుట్టు ♦ కొల్లలాడెడివేళ
నూరక యుండిన♦యోర్పునేర్పు
ఇల్లాండ్రఁ బెల్లుగా ♦ మల్లాడునప్పుడు
దారిగా నుండిన♦తాల్మిపేర్మి
రాధ స్వాధీనగా ♦ సాధించునప్పుడు
గెలుపుగా నున్నట్టి♦యలుపుసులుపు
తక్కినచెలు లొక్క♦చక్కి నెక్కినతఱి
నిచ్చగా నగుచున్న ♦ యింపుసొంపు
తే. గీ. మఱచి పదియాఱువేల్రక్రొ♦మ్మగువ లనఁగ
నెంత మఱి వారివద్ద నే ♦ నెంత వింత
వింతగా నింత కసరుట ♦ కొంత తగునె
మఱియు నను బాసిపోవు టే♦మాటవాసి.

ఉ. కంటికి ఱెప్ప గాచినవ♦గన్ నను బాములఁ బొందనీక యె
ప్పంటికి నీవు ప్రోవఁ దగు♦భావము లన్నియు మాని నేను నీ
యింటికి వచ్చినా యెదుట ♦ నీవగ నిల్చిన సేవఁ జేసినా
బంటుగ నెంచ వేమి పగ♦పంతములా కమలాయతేక్షణా.

శా. ఏలా కోపము లేల తాపము వితా♦యేలా విలాపంబు నా
పాలా జాలము లేల లోకమున నీ ♦ పాదంబుల న్నమ్మితిన్
చాలా చిన్నెలు వన్నె లందఱుఁ గనన్ ♦ జాలా కటాక్షించి యో
బాలా చక్కెర లొల్కుపల్కుల ననున్ ♦ బాలించి లాలించవే.

సీ. తరుణి నిన్నినాళ్లు ♦ మరునిచేచిగురాకు
గడిబాకుగా నెంచి ♦ నడచుకొననొ
కలికి నీమెయిడాలు ♦ కాముని పడవాలు
మేగోలుగా నెంచి ♦ మెచ్చుకొననొ

భామ నీనుడికోపు ♦ భావజుననివైపు
దరిదాపుగా నెంచి ♦ దాఁచుకొననొ
మగువ నీనెమ్మోము ♦ [1]మదనునిసముగోము
సొలయక దీముగాఁ ♦ జూచుకొననొ

తే. గీ. కాక యొకసారి యైన నే ♦ గడుసుపాటి
బిగిసినది లేదు కలనైనఁ ♦ దెగువరాదు
విన్నవించితి నేఁ డింక ♦ వినుట పాడి
వలదు నామీఁద నీమోడి ♦ వన్నెలాఁడి.

ఆ. వె. ఇమ్ము గ్రమ్మఁ గౌఁగి ♦ లిమ్ము నెమ్మది వింత
చాలు వీలు మేలు ♦ [2]మేలు మేలు
నమ్మికొమ్ము బాస ♦ నమ్మి కొమ్మిఁక నన్ను
బాల తాళఁజాల ♦ మేల మేల.

కం. అని కొంతకొంత కోమలి
మనమునఁ గల్లకము దోఁచి ♦ మగుడ నిగుడున
ల్కా నగుచుఁ జూపుంజుఱచుట
పెనగొన వ్రాజ్ఞతభీతి ♦ భీతాశయమై.

సీ. తళుకెత్తుచిఱునవ్వ ♦ మొలకలు జడిగొను
పన్నీటివలెను పై ♦ పైని నిండఁ
దడి యొత్తుచెంగావి ♦ నిడుద పావడవలెఁ
గెంపుపోఁగులచాయ ♦ గుంపుకొనఁగ
నొసటికస్తురిబొట్టు ♦ మిసమిస ల్చెమరిన
గోవజవ్వాది చె ♦ క్కుల నటింప
మెఱుఁగారువలెవాటు ♦ సరిగకుచ్చులగచ్చు
బంగారుపూవుల ♦ రంగు నెఱప

తే. గీ. మరునివిరిగోలయేటున ♦ నొరగినట్లు
నెలకుఁ దామరలకుఁ జెల్మి ♦ నెఱపునట్లు

పా. 1. మరునిసామముగోము. పా. 2. జాలమేల.

మోము ప్రోయాలిపదయుగ♦మునను జేర్చి
సాగిలెను శౌరి వలపుల♦బాగు మీఱి.

కం. చిఱుమీసఁపుఁదుమ్మెదకవ
తరుణీపదశౌరివదన♦తామరసము ల
త్తఱి సంధించుట గనుఁగొని
పారువున నిరుగడలఁ జేరె ♦ ననఁ జెలు వొందెన్.

కం. అప్పుడు హరిజాఱుసికం
దెప్పునఁ జెలి మనసుకినుక ♦ దీరఁగఁ దన్నెన్
నె ప్పెఱఁగి గిల్కు తామెత
యప్పలరవ లాని యందె♦యలు ఘ ల్లనఁగన్.

కం. ఘల్లని యందెలు మొరసిన
కొల్లో కొ ల్లనుచుఁ జనిరి ♦ కోమలు లపుడే
యల్లలనబోటనవ్రేలును
మెల్లన హరి పంట నంటి ♦ మెఱుముచు నొక్కెన్.

కం. కాముకుఁ డటువలెఁ బంటన్
వేమాఱున్ వ్రేలు నొక్క ♦ వెలసినకళచే
మై మిగుల ఝుమ్ము ఝు మ్మనఁ
గామిని కోపంబు మఱచి ♦ కలకల నవ్వెన్.

కం. నవ్వులకుఁ బువ్వుబోఁడిని
చివ్వున లాగించి గోప♦శేఖరుఁ డంతన్
మవ్వమున మోవితేనియ
బువ్వంబునఁ దనిసె మొదటఁ ♦ బొలఁతుక తనియన్.

కం. తనిసిన దాని న్మగుడం
దనియించఁగ శౌరి మబ్బు ♦ దట్టుచుఁ గవగాఁ
బెనఁగి తమి నూరడింపుచు
ననవిల్తునియనికిఁ దార్చె ♦ నయ మెనయంగన్.

తే. గీ. రాజబింబాస్య మగఁ డట్టు ♦ రతికిఁ దార్చు
మదిని నెలకొన్న మరుచివ్వ ♦ మరులు కెరల
వరవువలె నాని తప్పించు ♦ నెరవు మాని
తీఁగవలె నాఁటె వాఁ డెందుఁ ♦ దిరిగె నందు.

కం. చెందలిరుసెజ్జ నిటువలె
ముందుగ సమసురతమునకు ♦ మొనయించి రహిన్
కందర్పజనకుఁ డనువున
నిందీవరనయన నాని ♦ నెంతయు నంతన్.

సీ. మగఁ డోడు కఱచిన ♦ వగపుచిన్నె నటించు
నూరటిల్లఁగ లేచి ♦ హుంకరించుఁ
జెలువుఁ డగ్గలికతో ♦ నిల వైరము నటించు
నాయన యదలించ ♦ నాదరించు
హరి తాఁ గిలార్చిన ♦ నదరి చిన్నె నటించు
నులికినఁ బ్రేమించి ♦ యోహాటించుఁ
బతి కేక వేసిన ♦ బవిళిచిన్నె నటించు
నుబుసాన నుడి మించి ♦ యుగ్గడించు

తే. గీ. వలపుపొలుపును కలకల ♦ వలపుపొలుపు
సలుపుమెలపును కళలచే ♦ గెలుపుతలఁపు
వెలయఁ గలయిక కలకల ♦ మొలయఁ గొంత
సమరతంబున నగువింత ♦ నమరె నంత.

కం. ముందఱఁ దోఁచియుఁ దోఁచని
తందరమీటులును మఱియుఁ ♦ దహతహాసీటుల్
సుందరదన గన హరి కులు
కుం దరహాసంబు మీఱఁ ♦ గొమ నెలయించెన్.

కం. అంతర మెఱుఁగనివళుకులు
దొంతరవీడెములు కులుకు ♦ దొంతరపలుకుల్

వింతరహిం బూను మఱిమఱి
కొంతరవళి నానె గొమిరె ♦ కొమరుఱిమురునన్.

కం. వగలాడి యిట్లు వగవగ
తగువాటమ్ముల నెసంగి ♦ తక్కుల్ సొక్కుల్
సొగయం జెలినడుము సందిటం
దగ నొగిం గూర్చుండెం దొడలం ♦ దరుణియు నుండెన్.

చ. ఒఱపులు నిండం గాందొడల♦నుండెడుగుబ్బెతగుబ్బదోయి పే
రురమున నప్పళించుకొని ♦ యూంకొనుబాగులు పల్కులాగునన్
మెరయికజోగులుం గదియు♦ముద్దులపోగులుం గుల్కు నుల్కుచున్
హారి తమిబల్మిం బల్మొనల♦నంచులు మోవంగ మోవి యానంగన్.

కం. మానిని ముకుళించినకను
గోనల నరచొక్కునిక్కు♦కొసరులు కసరుల్
పూనుకొనె మత్స్యపుటముగం
బైనిం బడి విలాసిం దోసి ♦ పైకొని వేడ్కన్.

వ. అంత.

సీ. అనుపమరతికూజి♦తానుమేయకపోత
మలఘురయోదయ♦త్పులకజాత
మమితబంధోద్యమ♦శ్రమజలసంపాత
మతినృత్తకుచనాట్య♦గతిసమేత
మకలంకరుచికీర్ణ♦చికురయాతాయాత
మాభుగ్నపటునితం♦బాభిఘాత
మత్యపాయరసాశ♦యత్యంతకాకూత
మసమసౌరభలస♦త్కుసుమపాత

తే. గీ. మలకజాతాన్వితాంగచా♦పలవిభాత
మోదనస్ఫూత మధికప్ర♦సాదచేత
ముగ నపుడు శౌరి మదికిని ♦ సొగసు నించె
మగువమరుసాదనఘనంబు ♦ మగతనంబు.

కం. అప్పుడు వగలాఁడిమెయిన్
గుప్పున విరిదమ్మితావి ♦ గుబులుకొనంగా
నప్పురుషోత్తముఁ డంతన్
ముప్పిరిగొనుమోహవార్ధి ♦ మునుఁగుచు నుండెన్.

సీ. కవసరిపిణియుగ్గు ♦ కౌనుదీవియద్రుగ్గు
తెగచినిల్వులు దిగ్గు♦దిగ్గుకొసరు
పలుకులలగ్గుకు ♦ పఱచునూకులజగ్గు
నుబికినపతిసేఁత ♦ కొగ్గుసిగ్గు
తెగఁ గ్రుక్కుచో డగ్గు ♦ తెగఁబడునుడిసగ్గు
స్తనభారమున వగ్గు ♦ తగ్గుమొగ్గు
నడయాడుచో నగ్గు ♦ నడిహారములప్రగ్గు
గళరవములసగ్గు♦గగ్గుగగ్గు
తే. గీ. నలఁతనగు కగ్గు నడియుగ్గు ♦ లాటమొగ్గు
బడలుమైనెగ్గు తళుకెత్తు♦తొడలనిగ్గు
కేళితమిఁ జిల్కు పుంభావ♦కేళి నుల్కు
మెఱసె రతిఁ గుల్కు కల్కు తా ♦ మెఱుఁగుపోల్కు.

కం. పురుషాయితమున నటువలె
మెఱయుచు సరిగెలుపు లెనయ ♦ మెలఁతుక తనియన్
హరి చెలి నణఁచుక తనిసెన్
విరిగొరకలపాదుశాయి♦విజయము మీఱన్.

తే. గీ. ధరణి నందఱు నుతియించ ♦ సరసు లెంచ
నెనరునన్ సత్యభామసాం♦త్వనముఁ జేసి
యాయురారోగ్యపుత్రపౌ♦త్రాభివృద్ధి
నలరె నలశౌరి మొనలేని♦హాహణు మీఱి.

కం. ఈకథ వినినం జదివినఁ
జేకొని వ్రాయంగఁ బ్రోది ♦ చేసిన మిగులన్

లోకంబున ననవరతము
శ్రీకాంతునికరుణవలనఁ ♦ జేకుఱు శుభముల్.

కం. అని భక్తిని వైశంపా
యనముని వినిపింప వినుచు ♦ హర్ష మెసంగన్
జనమేజయధరణీంద్రుఁడు
ఘన మొప్పఁగ వెలసె నిత్య♦కల్యాణములన్.

మ. వసుధాఖండల ఖండలగ్నమధుర♦త్వత్రాణపారీణసూ
క్తిసుధాకందళ కందలక్షనయభా♦గ్విశ్రాణసంవిద్విమా
నసభాసద్బుధ సద్బుధప్రవరగం♦ధర్వస్వరోదారమా
నసమంజూత్పలసత్వరస్థగితమా♦ద్యద్రాజచూడామణీ.

కం. చండయవనాళికాక్షర
కుండలనోద్భవ్యదండ♦కోదండభుజా
దండధృతమండలాగ్రవి
ఖండితరిపుగళవిఖండ ♦ గండరగండా.

కం. దాక్షాయణీదయారస
వీక్షార్జితరాజలోక♦విశ్రుతశీలా
పక్షాంతచంద్రవదనా
లాక్షాంకితఫాలభాగ ♦ లక్ష్మీశీలా.

*కవి. వినుతకృపావన రమ్యకృపావన
విభ్రమపావనదృక్కమలా
తనురుచిమానససంభవ మానస
దాసామానసమగ్రయశా
వననిధిసారసనాథిపసారస
వక్రమసారసఘనవిభవా
వనజభవాసనవారిజగద్యుతి
వారిజనారజయాభ్యుదయా.

---

*ఈ కవిరాజవిరజితము లక్షణ విరుద్ధముగానున్ననూ ప్రత్యంతరము లేమి యథా మాతృకగాఁ బ్రకటించితిమి.

## గద్యము.

ఇది శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ జ్ఞానప్రసూ
నాంబికా కృపావలంబవిజృంభమాణసారసారస్వతసుధాతరంగ లింగనమః॥
వెంగనామాత్యవంశపావన విరచితవిద్యాధిదేవతాసంభావన దక్షిణసింహా
సనాధ్యక్షతిరుమలక్షమాకాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుచ్ఛ
సితచ్ఛత్ర చామరకళాచికాకనకాందోళికాదిరాజోపచార ధీరజనహృద
యరంజకవచోవిహారవల్లకీవాదనధురీణవర్ణగీతాదిగాం
ధర్వస్వరకల్పనాప్రవీణ కామాక్ష్యంబికానాగనకవి
రాజనందన కలితసకలబాంధవహృదయానందన
శ్రీకర కవితాకర సుకవిజనవిధేయ శ్రీ కామే
శ్వరనామధేయప్రణీతం బైన సత్యభామా
సాంత్వనం బనుమహాప్రబంధంబు
నందు సర్వంబును
చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.



శాబ్దోపు 3 వ ప్రబంధము.

# హంసవింశతి.

అయ్యలరాజు నారాయణామాత్య విరచితము.

—♦ శైలికి ఉదాహరణములు. ♦—

ఉ. కేరఁగరాదు నవ్వ గిలి♦గింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బలు ఖ♦చిక్కునఁ గుమ్మఁగరాదు కూటమిన్
మీఱి యథేష్టలీలల ర♦మింపఁగరాదు వెలందిమిన్న లే
పారఁగ నాథులం గలయు♦నప్పుడు గావున సాహసింత్రుగా
జారులఁగూడఁ దత్సురత♦సౌఖ్యమె సౌఖ్య మటంచుఁ గామినీ. ఆ. 1.

సీ. చిటిలెడుగందంబుఁ ♦ బెటిలెడుకస్తూరి
చలియించురత్నకుం♦డలయుగంబుఁ
గదలెడునెఱివేణి ♦ వదలెడుపువ్వులుఁ
జెమటఁ గరంగు కుం♦కుమపు బొట్టు
వికసించుకన్నులుఁ ♦ బ్రకటించుమణితముల్
గంకణఝణఝణ ♦ త్కారరవముఁ
బొదలెడుచనుదోయి ♦ కదలెడుహారముల్
ఘననితంబాఘాత♦నినద మడర
తే. గీ. నిటలసంచలదలక ము♦క్తాటనఖాంక
మమితనిశ్వాసమారుతం ♦ బతనుగేహ
దర్శనోత్సాహిపతిచపే♦టప్రదాయి
యైనపుంభావసురత మ♦య్యతివ సలిపె. ఆ. 2.

శా. నీవీబంధము చక్కదిద్దు నెఱివే♦ణిన్ లెస్సఁ గై సేయుఁ గె
మ్మోవిం జిల్కుదరస్మితంబు జిగిచూ♦పుల్ ల్వాఱఁగాఁజూచుఁ జ
న్గ్రోవ ల్గన్పడఁ జేయు నెచ్చెలియతోఁ ♦ కేళ్కేలఁ దట్టించి వా
చావైచిత్రిని ముచ్చటాడు సకి తన్ ♦ జారు ల్విలోకింపఁగన్. ఆ. 2.

చ. కుడువ సమస్తభాగ్యములు ♦ కోరికమీఱఁగఁ గట్ట వస్త్రముల్
దొడుగ విశేషభూషణము♦లుం దనరార నలంద గంధమున్

ముడువను మంచిపుష్పముల ♦ మొత్తముగల్గిన భోగహీనలై
పడఁతుక లుండనేర్తు రటె ♦ ప్రాయమునం బెఱత్రోవ డాయకన్. ఆ. 3.

చ. ఒకనికి మోముచుంబనము ♦ లొక్కనికిన్ మొనగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱి ♦ యొక్కనికిన్ బిగికౌఁగిలింపు లొం
డొకనికి గాఢసంగమము ♦ లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవిక చూపు మన్మథుఁడు ♦ గట్టినథట్టి సడల్ప నియ్యకన్ ఆ. 4.

ఉ. వాకిలిఁదీసి చొక్కటపు♦వాలుగకన్నులఁ దేలఁ జూచి నా
ళీకదళాక్షి కుందనపు♦లిబ్బుల నేలెడు గుబ్బచన్మొనల్
సోఁకఁగఁ గౌఁగిలించి నెఱ♦సొంపునఁ గేళిగృహాంబులోనికిన్
దోకొనిపోయి వాని రతి ♦ నూతనసంభవపారవశ్యయై. ఆ. 4.

కం. కళలంటి ముద్దు వెట్టుక
వెలసినతమి మోవి నొక్కి ♦ వీపును జనును
క్కులుబ్రేల్లఁగౌఁగిలింపుచుఁ
బలురీతుల రతులఁ గలసి ♦ భ్రమనొందించెన్. ఆ. 5.

సీ. తరితీపువగలు బి♦త్తరపుఁజూపులు మోవి
విఱుపులు సొలపులు ♦ వింతమాట
లుదుటుచొకాటంపు♦టొయ్యారిచేష్టలు
సోబానపాటలు ♦ సొగసుగుల్కు
పొగరువికావిక♦నగవులు బెళకించు
కనుసన్న నేర్పులు ♦ కలికితలు
సామితెల్ చిన్నెలు ♦ జాణతనంబులు
తెచ్చికోల్మరుపులు ♦ తేటపడని

తే. గీ. జంకెనలు బొమ్మతాటింపు ♦ సాహసములు
వచ్చి తేరఁగఁ బల్కొడి♦ముచ్చటలును
విటులఁ గనుగొన్న వేళల ♦ విస్తరించు
రూఢి మించినతమితోడ ♦ రూపసేన. ఆ. 5.

1938 జనవరు మాసారంభమున వెలువడుతుంది.

వెలస్వల్పము ! ఫలమధికము !!

# గళరోగనివారిణి. (Tonsil Cure.)



(Tonsils ) టాన్సిలుసు అను వ్యాధి ప్రస్తుతకాలములో దేశమం దంతటను పిల్లలకు, పెద్దలకు తరుచుగా కలుగుచున్నది. యీ వ్యాధికి దేశమందంతటను శస్త్రచికిత్స అనవసరము. యీ వ్యాధికలుగుటకు ప్రధాన దోషమేదియున్నదో దానినిగమనించి చికిత్సించినచో టాన్సిలుసు హరించి పోవుటయేగాక దానికిసంబంధించిన యితర వాధులన్నియు నివారింపబడును. అట్టి చికిత్సను మేముగమనించి చికిత్సచేయుచున్నాము. అందునుంచి టాన్సిలుసు అనువ్యాధి హరించుటయేగాక అందుకు సంబంధించిన, యితర వ్యాధులు అన్నియుపోయి రక్తవృద్ధి, దేహదార్ఢ్యతకలుగును.

వేనవేలకువాడి యోగ్యతాపత్రములను పొందియున్నాము. యీ వ్యాధినిగురించిన విషయములను తెలియగోరువారు ఒక అణాచీటీని పోష్టే లోపంపిన టాన్సిలుసు అను పుస్తకమును ఉచితముగాపంపెదము.

నెలదినములకు సరిపడుమందు సీసా 1 కి రు. 2—8—0.

మావద్ద యింకను అనేకవిధములైన సుప్రసిద్ధఆయుర్వేద ఔషధ ములు సరసమైనధరలకు దొరకును కేటలాగు ఉచితము.

ఆయుర్వేద వైద్యవిద్వాన్
బృందావనం వెంకటరంగాచార్యులు.

రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనరు,
శ్రీ చెన్నకేశ ఆయుర్వేద వైద్యాలయము.
మచిలీపట్టణము.

**Recognized by the Government Central Board of Indian Medicine Madras.**

# త్రిలింగ జ్యోతిషాలయము,

## మచిలీపట్టణము

ప్రొప్రయిటర్:

అనుభవ దైవజ్ఞ



ప్రొఫెసర్: పి. వి. యస్. శర్మ.

దృగ్గణిత ఆధారమున:— జాతకచక్రములు, ద్వాదశభావములు, సంవత్సర ఫలితములు, దశాంతర్దశాఫలితములు సంపూర్ణజాతకములువగైరా:

న్యాయసమ్మతమగు ప్రశ్నలకు జబాబులు:

వాస్తునిర్ణయము: పలువిధ వ్యాపారాభివృద్ధికి భవానీ కవచములు:

సరియగు జననకాలంలేనివారికి ప్రశ్న మూలమున సరియగు భవిష్యత్ఫలిత నిర్ణయము.